# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక



సంపాదకవర్గము:

**కొలికిచర్ల వెంకటరత్నం**

**విశ్వనాథ సత్యనారాయణ**

**అడివి బాపిరాజు**

**శివశంకర శాస్త్రి**




సంపుటి ౭    జనవరి, ఏప్రిల్ ౧౯౩౯ 1939    సంచికలు ౩,౪


| | | |
|---|---|---|
| ...ద (గేయము) రాయప్రోలు సుబ్బారావు | ... | ౧౮౧ |
| సంధ్యారాగిణి (పద్యాలు) దేశిరాజు కృష్ణశర్మ | ... | ౧౮౩ |
| సాంధ్యనృత్యము (గేయము) పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి | ... | ౧౮౫ |
| ఆహ్వానము - (గేయము) | ... | ౧౮౬ |
| సౌందర్యోపాసన (వ్యాసము) కృత్తివాస తీర్థులు | ... | ౧౮౭ |
| శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు (విమర్శనము) గిడుగు వెంకటరామమూర్తి | | ౧౮౯ |
| విహ్వాలత (పద్యాలు) సోమరాజుపల్లి వెంకటరామయ్య | ... | ౨౧౧ |
| కదంబకన్య (కథ) దిగుమర్తి రామారావు | ... | ౨౧౨ |
| సలీంకవి (గేయము) | ... | ౨౧౮ |
| వలపు వేటకాదు (గేయం) | ... | ౨౨౦ |
| మృణాళిని (గేయము) "పట్టాభి" | ... | ౨౨౧ |
| వచనకావ్యాలు: రచనావిధానం (వ్యాసము) వావిలాల సోమయాజులు | | ౨౨౫ |
| మధువిహారం (గేయము) | ... | ౨౩౫ |
| కళవళిక (గేయము) నాగలింగం వెంకటేశ్వరులు | ... | ౨౩౬ |
| ఉత్తరాలు (వ్యాసము) కా. సూ. | ... | ౨౩౭ |
| శశికళ (గేయం) అడవి బాపిరాజు | ... | ౨౪౩ |
| మేనక (నాటిక) తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు | ... | ౨౪౮ |
| కావ్యపరిమేయము ౩ (వ్యాసము) జమ్ములమడక మాధవరామశర్మ | ... | ౨౬౧ |
| ఆకాశ గంటలు (గేయము) దేశిరాజు కృష్ణశర్మ | ... | ౨౭౧ |
| జో. (కథ) విశ్వనాథ సత్యనారాయణ | ... | ౨౭౩ |
| నా ప్రేయసి (గేయము) మొక్కపాటి సుబ్బారావు | ... | ౨౭౭ |
| తెలుగు కవిత్వములో "భావనలు" (వ్యాసము) నోరి నరసింహశాస్త్రి | | ౨౭౯ |
| కొత్త పాట (గేయం) శివరామం | ... | ౨౯౨ |
| దీక్షితదుహిత (నాటిక) శివశంకరశాస్త్రి | ... | ౨౯౫ |
| సఖి (గేయము) పన్యాల వెంకట రంగనాథరావు | ... | ౩౦౬ |
| మాతృస్తవము (పద్యాలు) అంబటిపూడి సత్యనారాయణ | ... | ౩౦౮ |
| కిటికీలో దీపం (గేయము) శ్రీరంగం నారాయణబాబు | ... | ౩౦౯ |
| పుస్తక సమీక్ష | ... | ౩౧౧ |
| సంపాదకీయము | ... | ౩౨౪ |

# ఉగాది

రాయప్రోలు సుబ్బారావు

వెండిగొలుసులు లంకెవేసి ప్ర
చండమగు నీ నల్లతెరలను
తూర్పు వాకిలి తలుపురెక్కలం
దొలగ లాగెద రెవ్వరో!

నిమురవిడి ఆశానితంబిని
నీలవేణి విదల్చ రాలెడి
మల్లెపువ్వుల పగిది రాలెడి
అల్లనల్లన తారకల్.

పండుకుంకుమ కలిపి తీర్చిన
పచ్చిముగ్గుల అల్లికలవలె
ఉపరిగత వాతాయనమ్ముల
మించె అరుణిమ కనబడెన్.

ప్రథమ పూర్వోదయము వేళను
భాసిలెడి సంపన్నగృహములు
ప్రతిదిశాన సుఖాభిముఖమయి
అలరెనో జగమంతయున్.

దూరమంచున నిలిచి అభినవ
ధాతులగు బంగారు వలలను
తరుణ సరసుల విసరివేయుచు,
దరహసించెద రెవ్వరో.

# ప్ర తి భ

శీతపీడకు కాంతిమాయగ
సిగ్గుచితికిన కొమ్మలెల్లను
పల్లవించెను నవ్యరంజన ;
వయసు వంకల దీర్చునో !

కొమ్మలకు పగడాలసరమయి
కోయిలకు రక్తాశనంబయి
ఆశలకు ఉద్దీపమాలయి
అలరు ఆల రీ ప్రొద్దులన్.

అంటి అంటక అబలవాతెఱ
నాటిపోయెడి చుంబనములటు
తాకి తాకక తనువు పులకల
తెక్కియనోలయు సమీరముల్.

కాలనాటకమందు ప్రథమాం
కమున సుకవి ఉషఃప్రవేశము
నను ఘటించిన శుభముహూర్తం
బగునొకో ఈ సందెయున్.

ఈ మహోత్సవ మధుమదవదభి
రామ సూక్తము సంతజెప్పగ
చిగురు మ్రింగి నిరుక్తి సాధన
నెగడు ద్విజకులమే తగున్.

# సంధ్యారాగిణి

## దేశిరాజు కృష్ణశర్మ

వ్రాలిన కొప్పులో సుమపరాగము నిత్యమనోజ్ఞ సుస్థిర
శ్రీలలితంబు నీ వలపుసింధువులో చిరుగాలి తెప్పపై
తేలెడు మోహనాకృతికి తీరని దాహవిముక్తి నేను సం
ధ్యా లలితాంగి, నాకొరకు దాచకుమీ విడబారు క్రొమ్ముడిన్!

నీ తెలిచెక్కులంటిన వినీతికి లేత గులాబిరంగు క్రొం
బూత ప్రసించ ఘోషకును మూకత దిద్దెను లేతలేత జీ
మూతములెల్ల పైకొరగి మూగెను నీ గొడియందు, ముగ్ధవై
పాతరలాడు నే ప్రణయభావమునన్ పరిపూతవైతివో!

చీకటిదోనెలో ప్రణయ జవవిముగ్ధులు ద్యోధునీపృషత్
సేకము జాలు గట్టిన గ్రసించిన సంస్కృతి నాగరమ్ములో
మేకొని మెల్లమెల్లగ గమించెడు వేళ మనోజ్ఞ కైశిక
శ్రీకత కొప్పు వెట్టకుము, చేర్చకు నల్లని పైటవాటులన్.

ఆ చరమాబ్ధిలో నొక రహస్యసుధా పరికృప్తి మేదో సం
ధ్యా చరమావధిన్ పరిణతాకృతి పూచెను, ఆ మనోజ్ఞ రే
ఖా చిరభాగ్యముల్ కలలగాంచి తపించెడు మానవాళికిన్
దాచక పంచిపెట్టు మొకనాడును తీరని జీవితాశలన్.

ఈ తెరచాటు ముగ్ధ వలయాకృతమై మురిపించు వాసనల్
పో తపియించ చటన్ కుసుమమోహిని నిగ్గులువోలె, లెమ్ము సం
ధ్యా తరుణీమణీ, ప్రణయతల్పమునుండి, మనోజ్ఞవాసనా
ప్రీతిని నీలనీరదవరీయులు కూడిరి పల్కరింపగన్.

౧౫౩

చాలవిశాల మింగిన శైవలినీ తటియందు సైకత
శ్రీలసితమ్ములో విరియఁ బమ్మెద వేదో విమోహసృష్టిలో
భాలషితంబులన్ మరియు నాప్రిసెద వేవో ప్రసించదోష ని
మ్మాలన కావ్యసంతతులు మోహనరాగ విశుద్ధగీతికల్.

పోరలు పొరల్ మొయిల్ గగనభూమిని జారుచునుండ జీవిత
స్థిరతవహింపలేక నెగు తీవ్రవిమోహితులట్లు, నీదు సుం
దర-అనకుంఠనంబు విడనాడి ప్రశాంతపు వేళ ప్రేమ సం
భరితము పుణ్యభావము ప్రవాసులకై వినిపించు మోహికన్.

పరుగిడిపోవు నీ పవన భావుకమూర్తి అనేక దేశముల్
తిరుగుచువచ్చి నీకిప కిరవించును లోకములోని ప్రియసం
సరణమునన్ విరాగులగు సాధులు న్యాయచరిత్రులన్ మహా
పరిణతి నందు జీవిత సుభాస్మృతి ఒక్కటై కీర్తి చెల్పునో!

**నిశాతపస్విని**

ఓసి నిశాతపస్విని! ఎటో గ్రహియింపుము ప్రేమవాసనా
పేశలమూర్తివై పరితపింపని వేల? విమోహతాప సం
త్రాసమునందు ఊర్పుపోగ దాల్చిన పీ నునుమబ్బు దోంతరల్
చేసిన తాపన ప్రసితి శ్లేషము పొందిన తూర్పుదిక్కునన్.

ఒక నిమిషంబులో విరతినొందెను నీ ప్రణయానుబద్ధ రూ
పక-అనుభూతిలో పరుగువారెడు లోకము, పశ్చిమాంబుధిన్
శికలితమైన భంగచయ పిహ్వలనాన్, పరివృత్తపుణ్యముల్
సకల జగత్ప్రహా ప్రియాసాధన మార్గములందు వ్యూహముల్.

అమృతమయమ్మగు ఈ భువన మంతయు భావిత స్వప్నకాంక్ష సం
భ్రమితము చేసి సౌఖ్య పరివాసిత మైన పవిత్రమాధురుల్

సమముగ లోకదృష్టికి ప్రసాదముచేసి రహస్యరక్తి సం
క్రమణము జీవితావధిని గైకొని తారుచునుండె మెల్లగా.

### ఉషోబాల

ఓ సఖి, నీ విలాస నివహోల్లసతల్ ప్రతిసీర చాటుగా
జేసి వసింతు, నా కిట వశీకృత మోహన తంత్రమైన సం
ధ్యాసమకాంతి కన్పడదు, తార్పడు లేజవురాకు సంజలో
ఏ సడి లేక మ్రోడయి వహించిన నాయెద పుణ్యరాగముల్.

ఇదివరకే తపించి హసియించెను, నేడు లోక వింతవింత స
ఒడలాలికించు నిన్నుగని పాయని హృన్మధు భావమార్గ సా
స్వప్నములు దాల్చి యీ పవన సంతతు లెల్లెడ జాలుగట్టె నా
విధమె అనుగ్రహింపు సఖి! నెగము తీయడనాల ప్రాతవై!

## సాంధ్యనృత్యము

### పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

మందాకినీ తీర మందానిలమ్ములో
శోభాతరంగితాచ్ఛోద స్రవంతిలో
నిత్య స్నానార్థివై నృత్యముల్ విడుతువా!
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

కాసారవీధిలో కల్యాణ మందగా
నయకార్యములనీడ నాదములతో వీగ;
తమి రేని కేలెత్తి తమకమున పిలుతువా
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

ఒకదానిపై నొకటి ఓర్పుమై మేఘములు
ఆకాశయానంబు నంతటం జేయగా
మాయూరగతులనే మసలుచున్నేర్పదా
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

ప్రాచీన సంస్మరణ పరిణాహగీతిలో
కనుజాడ మించియే కనె నీలి మేఘంబు
సంతోష వీచికా సాంత్వనమ్ములు కనవ ?
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

నిర్నిద్రవిలయమున నియమ బద్ధత జెలగి
ఈ యధోజవితపు హేళనమ్ములె కనగ
భవనృత్తగానంబు ప్రసహింప జేయవా !
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

భక్తు లెల్లరు నాక ప్రణుతులై కాంచగా
స్నానమ్ము చాలించి జలములన్ వీడుచున్
సాంకేతికోద్యాన సములఁ బలికించవా !
సాంధ్యనృత్యోత్సవాచరణశీలా, శివా !

## ఆహ్వానము

నక్షత్రంబులు నాట్యం బాడగ
మేఘము లెల్లను మిథ్యలుగాగా
సౌందర్యం బను సరసిని నాట్యము
చేయగ పార్వతి చెంతనె నిల్వగ
లయసంధ్యలలో నృత్యా
లాపన సేయగ రావా ?

రాత్రిందినములు లాస్యము చేయుచు
సాధ్వీనేత్రాంచలముల నిలువగ
ప్రతిని మేషమున రామణీయకము
నవనవనాట్యము నయముగ జేయగ
లయ సంధ్యలలో నృత్యా
లాపన సేయగ రావా.

# సౌందర్యోపాసన

## కృత్తివాస తీర్థులు

సౌందర్యశబ్దానికి రమణీయత, చారుత అనే పర్యాయపదాలు వాడుతున్నారు. 'సౌందర్య' పదంలో అనశ్వరమైన సత్యశివంకరమైన ఆత్మసౌందర్య మనే గంభీరభావం ఇమిడి ఉన్నది; మామూలుగా 'భౌతిక సౌందర్య' మని అర్థం చేసుకొంటారు.

పాశ్చాత్యదేశాలలో సౌందర్యోపాసకులు కళల్లో ఆత్మవ్యక్తిని గ్రహిస్తారు. అందువల్లనే మనవారు భౌతికసౌందర్యాన్ని, బాహ్యరూపాన్ని ప్రధానంగా తలచలేదు. సూక్ష్మమై అవినాశియైన శారీరసౌందర్యం కవులను గాయకులను చిత్రకారులనూ శిల్పులనూ ఆకర్షించింది. మనశిల్పులు మాంసఖండాలు, హావభావవిలాసాలు మూర్తింప చెయ్యలేదు. భారతీయ సౌందర్యలక్షణాలనుగ్రహించి వాటికి రూపకల్పన చేశారు. భారతీయ శిల్పసౌందర్యంలో దైవికశక్తి, అనంతలీలావిలాసములు, మనవారు దర్శింపగలిగినారు. సర్వాంగీణసౌష్ఠవమే కాక, ప్రాణవిలాసము, సంపూర్ణము, ఉజ్జ్వలము అయిన మనోవికాసము సౌందర్యసారము. సంకల్పరూప మయిన మనస్సును అతిక్రమించి సర్వ ప్రాణిగత మైన ఆత్మపదార్థమును భారతీయులు భావన చెయ్యడమే కాక, సాధన చేసి ప్రాణమనోమయ మైన శరీరసౌష్ఠవంలో ఆత్మజ్యోతిని దర్శించ గలిగినారు. శారీరసౌందర్యం ఉదాత్తమై ఉజ్జ్వల మైన ఆత్మస్ఫూర్తిగా మనవారు సాక్షాత్కరింప చేసుకున్నారు. ప్రపంచంలో మహాకవు లయినవా రంతా ఆత్మదర్శనంకోసం సాధన చేసినవారే. భౌతిక మైన ఆవరణలో ఉన్నంత సేపూ, ప్రకృతియొక్క బాహ్యరూపాన్ని లేక అపరాప్రకృతిని వర్ణిస్తారు. మొదట అపరాప్రకృతిని ఉపాసించి తదనివార్యక క్రమ సాధనవల్ల భౌతికస్థానాపేక్ష లేక ఆవరణలు దాటుతూ పైకిపోతారు. సౌందర్యమే తానై తానే సౌందర్యమయ్యే స్థితికి మహాకవి సాధన చేస్తాడు. చివరికి 'అపర'నుంచి 'పరా' సౌందర్యంలో లీనమవుతాడు సౌందర్యమయ మైన దివ్యానుభూతి కలిగినప్పుడు తన్మయుడై సౌందర్యసారసర్వస్వంలో ఓలలాడుతాడు. అమృతం వెల్లివిరిసే వైఖరీవాక్కుతో పరా సౌందర్యానుభవం వర్ణిస్తాడు మహాకవి. అతడే ద్రష్ట. నిజమైనకళలో పరాసౌందర్యోపాసనానుభవం వెల్లివిరిసి వుంటుంది. దివ్యసౌందర్యంలో నిజమైన ఆనందం ఉంటుంది. అటువంటి మహాకవి మన హృదయతంత్రులు మీటి దివ్యగానతుషారంలో మనహృదయాలను ముంచివేస్తాడు. ఆ ఏకరసంలో, వెన్నెలపన్నీటిలో సహృదయులను జలక మాడిస్తాడు. మననవీనకవులలో ద్రష్టలు చాలాతక్కువ. ద్రష్టలయినవాళ్ళు లేకపోయినా, intution వల్ల కొద్దిగా మంచికవిత్వాం చెప్పకపోలేదు. కొందరుకవులు బాత్తిగా శబ్దమాధుర్యంలోనే తృప్తి చెందినారు.

పాశ్చాత్యులు సాధనసంపత్తి లేకపోయినప్పటికీ, సహజ మైన intution వల్ల సౌంద

ర్యోపాసన చేసినారు. ఆంగ్లేయకవీశ్వరులలో కీట్సు సౌందర్యసారము అనుభవించి 'A thing of Beauty is a joy for ever' అని చెప్పగలిగినాడు. సమస్త మైన కళలూ సౌందర్యాన్నే వ్యక్తం చేస్తవి. సౌందర్యానుభవమే ఆనందానుభవం. మధుసూదనసరస్వతీ పూజ్యపాదులు చెప్పినట్టు, భగవంతుడు 'సౌందర్యసారసర్వస్వం' మహాకవు లంతా దివ్యమైన సౌందర్యసారసర్వస్వం అనుభవించినవారే! కీట్సు 'ఎండిమియన్' కావ్యంలో జీవుడికీ, అమృతజ్యోతిలో దర్శనీయమైన సౌందర్యరసాధిదేవతకూ గల దివ్యప్రేమానుబంధం వర్ణించాడు. (సౌందర్యరసాధిదేవతను మనవారు శక్తిగా ఉపాసించి, ఏకరసమనీ, కళానిధి, కావ్యకళారసజ్ఞ, రసశేవధి; అనీ అన్నారు.) 'హైపరియన్'లో సౌందర్యం మానవజీవితానికి ప్రాణంవంటిదనీ, శాశ్వత మైనదనీ; 'లామియా'లో భావనాశక్తి విషయమయమైన భౌతికసీమలను చూస్తే జంకుతుందనీ, 'సైకీ'లో సైకీని దివ్యభావనామూలంగా సృష్టించుకో గలననీ చెప్పాడు. గ్రీకు శిల్పసౌందర్యంలో నిమగ్నుడై సౌందర్యం సత్యశివంకర మైనదని తెలియజేశాడు. గ్రీకులు హీబ్రూలవలె గాక మంచిరసజ్ఞులు. చక్కనిదృష్టితో సౌందర్యోపాసన చేశారు. కాని వా రెంతఉపాసన చేసినా, విషయాధీన మయిన భౌతిక సౌందర్యం అతిక్రమించి పైకిపోలేదు. పాశ్చాత్యరసికప్రపంచంలో ప్లేటో, మహోత్కృష్టుడు. స్థూల మైన బాహ్యరూపంకంటె సూక్ష్మమైన సౌందర్యమే ఉపాసించి 'We must rise from Form to the idea' అని చెప్పినాడు. సౌందర్యం వృద్ధిక్షయరహిత మైన దనీ, నిత్యమనీ, అతీంద్రియమైన దనీ, దివ్యసౌందర్యోపాసకులు భగవంతుడికూర్మిమిత్రులనీ, జరామరణవర్జితులై అమరత్వం పొందుతారనీ Symposiumలో స్పష్టపరిచినాడు. అరిస్టాటిలు కేవల శాస్త్రజ్ఞుడు కావడంవల్ల రసికుడు కాలేదు. అతనిబుద్ధి పృథక్కరణవ్యాపారంలోనే ఉండిపోయింది. అందుచేతనే సౌందర్యము order, Symmetry అని చెప్పాడు. అయితే ప్లేటోమతానుయాయు లైన Neo-platonists, ప్లోటినస్ మొదలైనవారు, ఏకమై నిత్యమై నిర్మలమై పూర్ణమైన సౌందర్యం intuition వల్లనే సాధ్యమవుతుందని చెప్పినారు. ఆధునిక రసికుడైన 'క్రోచే' కూడా intuition యొక్క వ్యక్తీకరణమే సౌందర్యమని వ్యక్తపరిచినాడు. ఆ దివ్యమైన సౌందర్యం కేవలానుభవైకవేద్యమయిన పరిపూర్ణ మనోవికాసంకంటె భిన్నంకాదు. ప్రకృతిసౌందర్యంకన్న మనస్సు గొప్పది. కావ్యసౌందర్యం ప్రకృతిసౌందర్యంకంటె గొప్పది. రాజసతామసవృత్తులు తొలగిపోగా మనస్సు నిర్మలమై శుద్ధసత్త్వమైనప్పుడే సౌందర్యం సాక్షాత్కారమవుతుంది. మబ్బులన్నీ తొలగిపోగా పూర్ణచంద్రబింబం మనోహరమై గోచరమవుతుంది!

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

[ విమర్శనము ]

**గిడుగు వెంకట రామమూర్తి**

(గతసంచిక తరువాయి)

22. మీరదను 12 వ పేరాలో, "వందలకొలదిగా ఉన్నవే ఈనిఘంటువులో చేరని శబ్దములు, సంస్కృతములూ ఆంధ్రములూ కూడాను. ఏవో మారుమూల నున్నవి కావు. ఆంధ్ర భారతములోనివే, కొన్ని కనబడకేను, సంస్కృత కావ్యములలోనివి కొన్ని లేవు. ఒక్కటి కొరతయినా, వీరి ఘోషణములోని 'అన్నియుంగలవు' అనే వాక్యము బొంకుకాక మానదే! ఈ విమర్శనము ఉత్తరభాగములో ఈ విషయము సవిస్తరముగా విశదపరుస్తాను' అని వ్రాసినాను. మీరు విడిచిన సంస్కృత శబ్దాలు అన్నీ లెక్కపెట్టలేదు గాని వేలుంటవి అని తోస్తుంది. అవి అన్నీ ఎత్తి వ్రాయడము విమర్శకుని పనిగాదు. అవి కొన్ని వ్రాస్తాను. కొన్ని సూచిస్తాను. వేతనము పుచ్చుకొని ఆప్తే మొ॥ నిఘంటువులలోనుండి శబ్దాలు ఎత్తివ్రాసే పండితులున్నారు గదా; వారు అనుబంధముగా అవి వేరే ప్రకటించగలరు.

23. ఆంధ్రకవులు ప్రయోగించిన సంస్కృత శబ్దములలో మీరు విడిచినవి కొన్ని ముందుగా ఉదాహరిస్తాను. 'అర్పణమ్' 'సమర్పణమ్' అని, నపుంసకములుగా ఈ శబ్దములు ఆప్తే నిఘంటువులో ఉన్నవి. కాని తెలుగుకవులు (సంస్కృతకవులుకూడా) స్త్రీలింగములుగా ఇట్టి శబ్దములు ప్రయోగించడము అరుదుకాదు. అయినా తెలుగు పండితులు వీటి సాధుత్వమును గూర్చి తగవులాడుతూనే ఉన్నారు. గొప్ప విద్వత్కవులు "వర్తన" సాధుత్వముగురించి నిరుడు వాదప్రతివాదములు చేసినారు. వారిలో ఒకరు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు రచించిన శ్రీ కళాప్రపూర్ణ జయంతి రామయ్య పంతులుగారిని తమ తగవు తీర్చవలసినదని కోరినప్పుడు, ఈ 'వర్తన' శబ్దము వారెత్తుకోలేదు గాని; వారు కృష్ణాపత్రికలో (17-4-37) ప్రకటించిన తీర్పులో "వేంకటశాస్త్రిగారిక నాయందుగల నిర్హేతుక ప్రేమయే యీ <u>కృతిసమర్పణకు గారణము</u>" అనివ్రాసినారు. ఆ వాక్యములో 'సమర్పణ' స్త్రీలింగముగానే శిష్టలోకముతోపాటు తామున్ను ప్రయోగించినారు. గాని తమ నిఘంటువులో 'అర్పణ' చేర్చలేదు. ఎవరు ప్రయోగించినా 'అసాధు' శబ్దము 'సాధువు' కాదని తమతీర్పులో

పంతులుగారు వ్రాసినారుగదా. ఈ 'అర్పణ' శబ్దమును గురించి ఏమంటారు? ఇట్టివే 'ఆర్జన, అర్చన' మొ॥ శబ్దములను గురించికూడా తగవులు వచ్చినవి. తీర్పులో వాటి ఊసు ఏమీ కనబడదు. సంస్కృతములో 'అర్పణమ్' సాధువు, 'అర్పణ' అసాధువు అంటారు సంస్కృత పండితులు. అందుకు ఆప్టే నిఘంటువు ప్రమాణము. తెలుగులోనో? శిష్టుల వ్యవహారమందు 'అర్పణ' 'సమర్పణ' ఉన్నట్టు శ్రీ రామయ్యపంతుల వారి వాడుకను బట్టి నిర్ణయించవచ్చును. అది గ్రామ్యముకాదు, వ్యావహారికాంధ్ర శబ్ద మనిపించుకొంటుంది. అది గ్రాంథికభాషలో చేరుతుందా? అని పంతులవారిని అడిగితే, నిఘంటువులన్నీ చూచి, "నిఘంటువులలో లేదు; కవిప్రయుక్తము కాదు; గనుక గ్రాంథికముకాదు" అంటారనుకొంటాను. "పోనీండి; 'వ్యావహారికము' కాదా? మీరే వాడినారే! 'వ్యా' 'వా' అనే సంకేతాక్షరములతో కొన్నిశబ్దాలు వ్రాసినారే; అలాగున 'అర్పణ' 'వ్రాసినారు కారేమి?" అంటే ఏమంటారో పంతులు వారు? శబ్దమునుమీదమీద 'అసాధువు' 'సాధువు' అని బ్రహ్మదేవుడు వ్రాసినాడా యేమి? 'చరిత్ర,' 'దర్శ' సాధువులైనవి కావా?

24. ఇంచుమించుగా తొమ్మిదివందల సంవత్సరాల క్రిందటకూడా శిష్టుల నోటను 'అర్పణ' 'సమర్పణ' అనే శబ్దాలు లోక వ్యవహారమందు వచ్చేవి. అందుకు ప్రమాణాలు చిత్తగించండి:—నన్నయ ఆదిపర్వమందు—

చ. తడయక మ్రొక్కియున్న వినతాసుతు నప్పుడుసూచి యాత్మలో
నిడుగడఁజేయుచుం గడు సహింపక కద్రువ నానిఁ బిల్చి నా
కొడుకులనెల్ల నెత్తికొని కుమ్మరుచుండుము యేమివంచినన్
మడవక చేయు మీవని సమర్పణసేసెఁ బ్రభుత్వ మేర్పడన్. (II. 40)

భీమఖండములో శ్రీనాథుఁడు 'అర్పణ' ప్రయోగించినాఁడు. చూ. దిగువను 'అప్సర'లకు ప్రమాణముగా ఉదాహరించిన పద్యము. ఇట్లే పాండురంగమాహాత్మ్యమందు 'సమర్పణ'శబ్దము ప్రయుక్తమై ఉన్నది. (చూ. IV. 166). ఉత్తరాంధ్ర కవులమాట చెప్పనక్కరలేదు. (చూ. శశాంక. III. 84). 'అర్పణ' సాధువు అని ఇకను అంగీకరిస్తారా? అంగీకరించరా? ఆప్టేలో 'వర్తనమ్' అనిన్నీ శబ్దరత్నాకరములో 'వర్తనము' అనిన్నీ వ్రాసిఉన్న నపుంసక శబ్దము మహాకవులు 'వర్తన' అని ప్రయోగించి ఉన్నారు. బోలెడు ప్రయోగాలున్నవి. శివతత్త్వసారమందు—

క. కర్తయని నిన్ను నెఱిఁగినఁ, గీర్తింపఁడు వెండి తన్నుఁ గార్యాకార్య,
వర్తనలఁ గర్తనేసని, కర్త ప్రధానుండుగాన ఘనభక్తుఁడజా. (148)

నన్నెచోడుని కుమారసంభవమందు—

ఉ. క్రొవ్విరి తమ్మితావిగాని క్రోవిలి మదంబునఁ దేలి తేఁటి కాం
డ వ్విరి పువ్వుఁగంపు సొగయింపని భంగి మహేశ్వరుండు నా
జవ్వనియావసం బనెడు చంద్రికఁ గ్రోలఁ జకోరభంగిమైఁ
దివ్వఁడు లోకవర్తనకు దేవతలెంత విహీనభాగ్యులో. (ix-356)

భోజరాజీయమందు—

క. నాఁడు మొదలుకొని యీ ప్రాఁ,బోఁడి యనారతముఁ దెచ్చి భోజనమిడఁగా,
నేఁ డొక్కటి చనుసంతకు, వాఁ డక్కడనుండు నుచితవర్తనలమెయిన్.(II-178)

ఒక్క ప్రసిద్ధకవి పింగళిసూరనే ఒక్క ప్రసిద్ధగ్రంథములోనే అనేక పద్యములలో ఈ శబ్దము ప్రయోగించినాడు చూడండి. రాఘవ పాండవీయము—

చ...ప్రధాన పురుషాంతరవర్తన నాకళింపుచున్ (I-4)

మ...నీ యిల్లాలివై కాంతప్రవర్తనలం బన్నాచు (I-15)

సీ. గీ. తనదు సుఖదుఃఖ విరహవర్తనలు (II-36)

సీ. వివిధవిహార భోగవర్తనల నొసరి (II-100)

క...సర్వ దిగ్ప్రవర్తనఁ దేజము మెఱయ (II-113)

సీ. వత్సరావల సత్ప్రవర్తనల్ జనులకు (III-25)

తే...అటవివి, నవర్తనకు నొందఁగతిలేక (III-113)

(రామాయణార్థమందు 'వినివర్తన' భావార్థమందు 'వర్తన' అని టీక)

సీ. గీ...మనోజ వికారప్రవర్తనలు సలిపె (IV-5)

తే. ధర్మవర్తన గాచు నగిమనంగ (IV-154)

ఈకవి రచించిన కళాపూర్ణోదయములోను ప్రభావతీప్రద్యుమ్నము లోను కూడా ఇట్టిప్రయోగా లనేకము న్నవి. ఈశబ్దము వాడినకవులు ఇంకా అనేకు లున్నారు. ఇట్టిది లేకుంటే ఆంధ్రనిఘంటు వవుతుందా?

25. ఈ 'వర్తన' శబ్దముయొక్క సాధుత్వమువలెనే ఏశబ్దముయొక్క సాధుత్వ మయినా శిష్టవ్యవహారమందు ఉండడమువల్ల కలిగినది; గాని దాని రూపమువల్ల కలుగలేదు. అందుచేతనే 'సిద్ధిర్ లోకాత్' అన్నారు లాక్షణికులు; వారు అట్టి శబ్దా

లకు ప్రక్రియ కల్పిస్తారు; ప్రక్రియ కుదురకపోతే, 'పృషోదరాదివత్ సాధుః' అని కానీ 'నిపాతనాత్ సాధుః' అనికానీ సమాధానము చెప్పుతారు. ఇట్టి లౌకిక శబ్దాలు, ఔచితినిబట్టి, కవులు కావ్యాలలో ప్రయోగిస్తారు. అప్పుడు అవి కావ్యోచితమయిన భాషలో చేరుతవి. సామాన్యకవులు వాడిన సాధుశబ్దము 'సాధీయాన్' (సాధుతరము); ప్రసిద్ధకవులు వాడినది 'సాధిష్ఠః' (సాధుతమము) అవుతుంది. కవులవాడుకవల్ల శబ్దానికి 'ఔచిత్యము' కలుగుతుందిగాని 'సాధుత్వము' కలుగదు; దానికి 'సాధుత్వము' శిష్ట వ్యవహారమువల్లనే కలుగుతుంది. ఈచర్చ ఇక్కడ అవసరమని నాకు తోచినందున చేసి నాను. ఇట్టిచర్చ చేయకుండానే మరికొన్ని శబ్దములు ప్రయోగములతో ఉదాహరిస్తాను.

26 నన్నయాదులు వాడిన సంస్కృతశబ్దాలు విడిచినారు; చూడండి:— 'అను గమ్యమానుఁడు' — 'అనుగంతే' మొ॥ మాటలున్నవి. (చూ. ఆరాధ్య మానుఁడు.) గాని ఇదిలేదు. ఇట్టి 'శానచ్' ప్రత్యయాంతాలు తెలుగుగ్రంథాలలో అనేకములున్నవి. 'గరుడుండు దనకు నురగభోజనత్వంబు సురపతిచేతఁబడసి తనను గమ్యమానుఁడై...' (ఆది. II-116). 'అంగనాజనులు'—ఆప్టె నిఘంటువులో ఉన్నది. దానిలోనున్న 'అంగనాప్రియము' మాత్రమే సూ. ని. లో ఉన్నది. ఇదిలేదు.

సీ. అంగనాజనుల యుత్తుంగ సంగతకుచ కుంకుమ చందన పంకములయు (ఆది. III-156)

'అశ్రుతపూర్వము'—'అదృష్టపూర్వము' వ్రాసినవారు ఇది ఎందుకు విడిచినారో!
"అశ్రుతపూర్వంబయిన యయ్యాక్రోశంబు విని..." (ఆది. VIII-116)
'అదృష్టశ్రుత పూర్వము'—

క. అతని చరితంబు చెప్పఁగ, నతిమానుష మపగతప్రయాస మదృష్ట, శ్రుత పూర్వము (అర. II-195)

'అవలుంచించు'—

"మఱియు నొక్కజట యవలుంచించి వేల్చిన (అర. III-267)

'అసమేక్షణుఁడు'—

క. అసమేక్షణ శివభక్తుం, డసమశ్రేష్ఠుఁడని పలికి యన్యులతోడన్ (శివ తత్త్వసారము. 431)

'అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి.'—

క. పూని యతద్గుణ సంవి,జ్ఞాన బహువ్రీహి మాన్పఁ జను దెంచిన యణ్,
మానితషష్ఠీ తత్పురు,షానూన సమాసమెఱుఁగ రజ్ఞులు రుద్రా. (శివ
తత్త్వ. 23)

'అర'=అంగారకుఁడు—

క. మందారారార్కాలయములు, మందారారార్కాఖనీజమయమయ్యె (నన్నెచో
డనికుమార: Iv-383)

'అవాఙ్మానసగోచరము'—

సూర్య. ని. 'అవాఙ్మానసగోచరము' మాత్రమే ఉన్నది. సంస్కృత పండితులు 'వాఙ్మ
నసమ్, అవాఙ్మనసమ్' మాత్రమే సాధుశబ్దాలంటారు.

క. నీచు లనీచులు పరిమిత, వాచులు వాచాలు రాత్మ్యనసు లవశులు స్వే
ష్టాచారు లవాఙ్మానస,గోచరచరితులు పినాకిసూరిమిభక్తుల్. (శివతత్త్వ-192)

క. జ్ఞానంబు వడయుటకు వా,ఙ్మానసములు సునియతములుగావింతురు.
(శాంతి v-90)

"ఏకమతి"—

క. ఆరోగ్యముగల యుక్తముఁ, బౌరోహిత్యంబు నడపఁ జనుచునది ధర
త్రీరమణుఁడితఁడు దాను స,మారంభములెల్ల నేకమతిఁగనుటొప్పన్.
(శాంతి II-311)

"ఏకవాక్యత"—

వ. కావున సర్వంబు ప్రధానంబనుటయు నకుల సహదేవు లేకవాక్యత నిట్లనిరి.
(శాంతి III-455)

'ఆబాలవృద్ధంబు'—

సీ. పా. తెరువుల నరుగంగ నరికట్టిచంపె నా
బాలవృద్ధంబుగా బహుజనముల (నిర్వచనోత్తరరామా. III-79)

క. తవిలితనయూరి యాబా, లవృద్ధముసు మున్నుపొనిపి లాలితముగ నీ, శివలింగ
ముతోఁగూడఁడె, శివనీదయ నొడయపిళ్ళ శీఘ్రమునశివా (శివతత్త్వ-405)

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండనై (అర. 1-266)

'ఆబాలగోపాలము'—

తే. మేలు రెండులోకంబుల మేలు తెచ్చుఁ; గీడు సేసినఁ దప్పదు కీడయగుట,
దీని నాబాలగోపాలమైన జనము; సకలమును మదినెఱుఁగు నీవారఁడు దక్క.
(నిర్వచనోత్తర. IV-67)

సీ. పా. క్షత్రియాధమ నీచ కలదు లోకంబున
నాబాలగోపాలమైన వాక్య, మతికుటిలుండు (కర్ణ II-47)
ఆమూలచూడము (విక్రమా. vii-39)

'ఉపరి'—సూర్య. ని. లో; "ఇది తెనుఁగున సమాస పూర్వపదముగానే యుండును. ఉదా. ఉపరిచరము మొ." అని వారా ఉన్నది. ఇట్లే అనేకావ్యయములను గురించి నియమ మున్నది. గాని ఆంధ్రకవులు ఆ నియమాలు పాటించలేదు. లోకవ్యవహారములో శిష్టులు 'అథవా, సదా, సద్యః, అకస్మాత్' మొదలయినవి అనేకము తరుచుగా వాడుతూఉన్నారు. 'అథవా' శ్రీమహాభారతములోను వరాహపురాణములోను ప్రయుక్తమైఉన్నది. 'ఉపరి' భాగవతమందు అనేక పద్యములలో కనబడుతున్నది.

సీ. పా. అటమీఁదఁ దారల నన్నిటి కుపరియై
రెండులక్షల శుక్రుఁడుండి...(V. ii-86)

క. మునిసప్తకము కెగువఁ, దనరుచు నామీఁద ద్రియుతదశలక్షలఁ బెం,
పున శింశుమార చక్రం, బనఁగా నిన్నిటికి నుపరియగుచుండు నృపా. (V.II-90)

'అప్సరలు' శ్రీనాథుడే ప్రయోగించినాడు. 'అప్సర' తప్పంటారు సంస్కృత పండితులు, అమరవ్యాఖ్యలు చదువనివారు. క్షీరస్వామి, (గోప్పవ్యాఖ్యాత) 'అప్సరా ఇతిదర్శనాత్' సాధువు అన్నారు. ప్రాకృతములో అచ్చర ఏలాగయినది? శిష్టులు 'అప్సరా' అంటూఉంటే, అశిష్టులు 'అచ్చరా' అన్నారు.

భీమఖండము చూడండి—

ఉ. అక్షతగంధ పుష్పఫలహారి హిరణ్మయపాత్రహస్తలై
దక్షపురీవిలాసినులు తామరసాయతలోచనల్ సహా
సాక్షులుగ భీమలింగమున కర్పణచేసిన యప్సరల్ విహా
పాక్షు నెదుర్కొనం జనికి యందియలంఘ్రుల ఘల్లుఘల్లనన్ (V -30)

[ఈపద్యమే మీదనుదాహరించిన 'అర్పణ' శబ్దముకు ప్రమాణముగా స్వీకరించవలెను]

'అనుభవత' —

ఈశబ్దము ఆ ప్తె నిఘంటువులో లేదు; అందుచేతనే సూర్య. ని. లోనూ లేదు. తెలుగు కవులు ఇది ప్రయోగించి ఉన్నారని ఈనిఘంటువురచించిన పండితమహాశయులకు తెలియదు. చూడండి, నారాయణకవి రచించిన పంచతంత్రము.

సీ. సంరక్షసేయని స్వర్ణమప్పుడె చెడు వృద్ధిఁబొందింపని విత్తమొడయు
<u>ననుభవత</u>కురాని యర్థంబుగల్గియు లేనిఫలమె కాని లేదు సుఖము(మిత్రభేదము70)

27. ప్రసిద్ధాంధ్రకవులు ప్రసిద్ధాంధ్ర కావ్యాలలో ప్రయోగించిన సంస్కృతశబ్దాలు ఆంధ్రనిఘంటువులో ఉండవలసినవి అన్నీవి విడిచి, ఇటుపయిని పుట్టబోయే ఆంధ్ర కవులు రచించబోయే ఆంధ్ర కావ్యాలలో ప్రయోగించబోయే సంస్కృతశబ్దాలు శ్రీ రామయ్యపంతులువారు ఇప్పుడే ఊహించి, యీనిఘంటువులో చేర్చి, 'సంస్కృత విద్యార్థులకు సంస్కృత నిఘంటువులతో పనిలేదు; ఇది కొనుక్కొని దగ్గర ఉంచుకొంటే, సంస్కృత సారస్వతమంతా ఆపోశనము పట్టినట్టు మింగవచ్చు'నని బడాయిమాటలువ్రాసుకొన్నారు గాని సంస్కృతము అభ్యసించడమునకు మొట్టమొదటవిద్యార్థులు చదివే పంచకావ్యాలలోని మాటలే కొన్ని నాకు దీనిలో కనబడలేదు. 'అ' అంటే బ్రహ్మ, 'ఉ' అంటే శివుడు. ఎందుకివి ఆంధ్రనిఘంటువులో? 'అంకచండాలము' అని వెంకటనాథుని పంచతంత్రములో ఉందట. ఇది సంస్కృతములో లేని సంస్కృతమట. ఇది తెలుగుననే కలదట! సంస్కృతభాషలో లేని సంస్కృతశబ్దము ఆంధ్రసారస్వతము అంతా తర్చితర్చిగాలిస్తే వీరికిదొరికినది; శిరసావహించినారు. చింతామణి; కల్పతరువు; కామధేనువు; ఆంధ్రముగాని సంస్కృతముగాని అభ్యసించే ఆంధ్రుల అదృష్టము; మహాభాగ్యము!

28. పంచకావ్యాలలోని మాటలలో ఏమి విడిచినవి కొన్ని ఎత్తివ్రాస్తాను (క్రిందను గీతగలవిలేవు)

<u>రఘువంశము</u> మొట్టమొదటి సర్గలో-'<u>అగృధ్ను</u> రాదదే సోర్థమ్' (I-21)

ఏవం తయోరధ్వని దైవయోగా <u>దాసేదుషోః</u> సఖ్యమచింత్యహేతు (V-60)

<u>కుమారసంభవము</u>లోనివి, నమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మనే,

గుణత్రయవిభాగాయ పశ్చాద్భేద<u>ముపేయుషే</u> (II-4)

విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు<u>మసాంప్రతమ్</u> (11-55)

ఆత్మేశ్వరాణాం నహి జాతు విఘ్నాః సమాధిభేదప్రభవో భవన్తి (III-40)

పర్యఙ్కబన్ధ స్థిరపూర్వకాయ మృజ్వాయతం సన్నమితోభయాంసం, ఉత్తానపాణి ద్వయ సన్నివేశాత్ ప్రఫుల్లరాజీవమి వాఙ్కమధ్యే (III-45)

మేఘసందేశములోనివి:—

కర్తుం యచ్చ ప్రభవతి మహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యాం...(I-11)

తత్రస్కన్దం నియతవసతిం పుష్పమేఘీకృతా.. ,అత్యాదిత్యంహుతవహముఖ సంభృతం తద్ధి తేజః (I-47)

కిరాతార్జునీయములోనివి—

గుణానురాగాదివ సఖ్యమీయివాన్ నబాధతేస్య త్రిగణః పరస్పరమ్ (I-11)

వితన్వతి క్షేమ మదేవమాతృకా శ్చిరాయతస్మిన్ కురవశ్చకాసతే (I-27)

[ఆప్టె నిఘంటువులో 'అదేవమాతృక' ఉన్నది. 'న దేవో మేఘో మాతా సృష్టి కారకః యస్యా' అని సంస్కృతములోనే అర్థం వున్నది. ఇంగ్లీషులో సవిస్తరముగా వ్యాఖ్యవ్రాసి ఉన్నది. ఆప్టె నిఘంటువులోనుంచి శబ్దాలు ఎత్తుకొని, ఈ సూర్యా. ని. లోనికి ఎక్కించిన పండితులు ఈశబ్దము విడిచినారేమి? ఈకావ్యములోనిదే ఈశ్లోకమే ప్రమాణముగా ఆప్టెలో ఉదాహృతమయి ఉన్నది కూడాను].

స్వయం ప్రదుగ్ధేస్య గుణై రుపస్నుతా

వసూపమానస్య వసూని మేదినీ (I. 18)

అభిమానవతో మనస్వినః ప్రియముచ్చైః పద మారురుక్షతః (II. 13)

[కొన్ని సన్నంతాలకు శతృర్థకాలు మొ. వ్రాసి కొన్నిటికి వ్రాయమరచినారు. చూ. ఆరిప్స, ఆరిప్సితము, ఆరిప్సువు, ఆరిరాధయిష, ఆరిరాధయిషువు; అయితే ఆరిరాధయిషమాణుడు లేదు.]

నచ సామర్థ్య మపోహితం క్వచిత్ (II. 27)

[సూర్యా. ని. లో 'అపోహితవ్యము' 'అపోహ్యము' ఉన్నవిగాని 'అపోహితము' లేదు. ఉన్నవాటికి వ్రాసిన అర్థము అస్పష్టము.]

అతిపాతిత కాలసాధనా...(II-42)

విపత్స్వప్యవిపత్తిరమ్యమ్...(III-15)

విధాయ విధ్వంసమనాత్మనీనమ్ (III-16)
పరిస్ఫురల్లోల శిఖాగ్రజిహ్వం జగజ్జిఘత్సంత మివాంతవహ్నిమ్ (III-25)
అథోష్ణభాసేవ సుమేరుకుంజాన్ (III-30)
ద్రుతం ధ[illegible]ండమివాహివిద్విషః (Iv-27)
అసితమధరవాసో బిభ్రతః సీరపాణేః (Iv-38)
ఆశానాముపరిచితా మివైకవేణీమ్. (vII-9)
[ఏకవీరః, ఏకవేణీ మొ-లేవు]
అయ స్తస్సురసరిదోఘరుద్ధ... (VII-32)
ఉత్తీరం నిహిత వివృత్తలోచనేన (vII-34)
ఉపేయుషీ (vIII-6)
ఉపేయుషః (vIII-10)
ఉపేయుషీణాం (VIII-12)
ఉపేయుషి (Ix-2)
'ఉపేయువస్' తరుచుగా అన్నికావ్యాలలోను ప్రయుక్తమయి ఉన్నది. ఈ శబ్దము ఈ నిఘంటువులో లేదు. 'అనాశ్వాంసుఁడు' మాత్రము ఎత్తుకొన్నారు. ఆశ్వాంసుఁడు లేదు.

మాఘకావ్యములో:—
తమర్ఘ్యమర్ఘ్యాదిక యాదిపూరుషః...(I-14)
('ఆదిపురుషః' 'ఆదిపూరుషః' రెండూ లేవు)
శబ్దవిద్యేవ నో భాతి రాజనీతి రపస్పశా (II-112)
అథోచ్చకైస్తోరణ సంగభంగభయావనమ్రీకృత కేతనాని. III-26)
(ఉచ్చకైస్తోరణ...అని సమాసముంటుందే.)
ఇతి విశకలితార్థామౌద్ధవీం వాచమేనామ్ (II-118)
అనిర్విదా యా విదధే విధాత్రా (III-34)
యమస్వసుశ్చిత్ర ఇవోదభారః (II 11)

౧౯-౭

లలో ఉన్నది. సంస్కృత మభ్యసించేవారు ఈ నిఘంటువును ఆశ్రయించి కావ్యా లయినా చదువగలరా?

మీరు విడిచిన సంస్కృతశబ్దాలు దిగువను కొన్ని వర్గాలుగా విభజించి సూచించడము నకు ప్రయత్నిస్తాను. అన్నీ పట్టికలుగా వ్రాయజాలను. ఆలాగున వ్రాయడము నావని కాదని మీదనే మనవి చేసినాను. వ్యాకరణములో పాణిన్యాదులు ఉదాహ రించిన శబ్దాలయినా అన్నీ ఈ నిఘంటువులో వ్రాయలేదు. నిఘంటు రచయితలు వ్రాసిన నిర్వచనాలలోను, వ్యాఖ్యలలోను ఉదాహరించిన సంస్కృత శబ్దాలు 'మూలపదములు'గా వ్రాయలేదు. మీరిచ్చిన ప్రయోగాలలోని శబ్దాలుకూడ కొన్ని విడిచిపెట్టినారు. ఇవి సూచించి, మీరు వ్రాసిన అర్థాలు; నిర్వచనాలు విమర్శించి, పిమ్మట తెలుగుశబ్దాలను గురించి వ్రాస్తాను.

30. వ్యాకరణశాస్త్రమందు వ్రాసిఉన్నవే చాలామాటలు సూర్య. ని. లో లేవు. అట్టివాటిలో కొన్ని ముందుగా ఉదాహరిస్తాను: —

'అహర్దివము' ఉన్నదిగాని 'అహర్దివి' లేదు; ఇది ఆప్టె ని. లో ఉన్నది; విడిచినారు.

'అహఃపతి,' 'అహర్పతి' ఉన్నవిగాని 'అహస్పతి' లేదు.

'అహస్కరుడు' ఉన్నదిగాని 'అహస్కరుడు' లేదు. ఆప్టె ని. లో రెండురూపములూ ఉన్నవి. మీరు విడిచినారు.

రూపాంతరములన్నీ నిఘంటువులో వ్రాయకపోతే విద్యార్థులకు అవి ఉన్నవని తెలి యదు. ఎవరైనా అట్టి ప్రయోగిస్తే తప్పనుకొంటారు.

శబ్దరత్నాకరములో పై మాటే మోసపోయినారు. అది ప్రమాణముగా నిశ్చయించు కొని భారతాది గ్రంథాల పరిష్కరించిన పండితులు వాటిని పాడు చేసినారు.

'అహోరాత్రము. సం. వి. అ. న' అని సూర్య. ని. లో ఉన్నదిగాని ఆప్టె ని.లో 'అహోరాత్రః, అహోరాత్రమ్' అని రెండులింగములలో ప్రయోగములతోకూడా ఈశబ్దమున్నది. సంస్కృత విద్యార్థుల కేలాగున తెలుస్తుంది?

'ఇమణిః' 'ఇమన్యా' 'ఇమన్య' 'ఇమిత' లేవు.

"అవ. సం. అవ్య: 'దీనియాద్యక్షరము వైకల్పికముగ లోపించును.' ఉ. అవతంసము, వతంసము." ఎంతహాస్యాస్పదముగా ఉన్నది! ఆప్టెలో వైకల్పికమని లేదు. కొన్ని చోట్ల అకారము లోపిస్తుంది. ఉదా. 'వగాహ్య' అనిఉన్నది.

'అవనతము.' 'అవమానము' 'అవతారము' మొ॥ నాటిలో 'అ' లోపిస్తుందా?
ఇదెక్కడి శాస్త్రము? ఇదెట్టి పాండిత్యము?

అవాసిన్, అవినాయిన్, అవిశాయిన్ మొ. లేవు.

హలంతశబ్దాలలోనివి—అవయాజ్, అవద్ర్యఙ్చ్, అవముయఙ్చ్, అముముయఙ్చ్, ఊర్జ్-లేవు.

అనుచ్ఛిత్తిధర్మా, అధిజ్యధన్వా, అంగవిమంగః, అయుష్టోమః, ఉపావృత్, ఉపావృట్, అభీరుక్, ఋతీషట్-లేవు.

ఉత్తరతీరమ్, ఉత్తరతారమ్ - రెండూ లేవు.

[పాణినిసూత్రప్రకారము మొదటిరూపము మాత్రమే భాషలో ఉన్నట్లు తోస్తుంది. అయితే లోకములో 'ఉత్తరతారమ్' అనిరూపా కొందరుశిష్టులు వాడుతూ ఉండినందున కాత్యాయనుడు 'శబ్దానుశాసనము'లో ఆరూపా చేర్చవలసినదని వార్త్తికము వ్రాసినాడు. ఏశబ్దానికైనా లోకములో శిష్టవ్యవహారములో రూపాంతరము లుంటే, అవిరూపా సాధువులుగా అంగీకరించి శాస్త్రకర్త అనుశాసించవలెను. ఆలాగున చేయకుంటే శాస్త్రము దుష్టమవుతుంది గాని వ్యవహారము దుష్టముకాదు. 'తీరమ్' అనేది 'తారమ్'గా ఎందుకు మారింది? అని ఆక్షేపించరాదు. ఇట్టి శబ్దములు లేనందున ఈనిఘంటువు ప్రమాణముగా అంగీకరించదగినది కాదు.]

అయస్కామ, అయస్కుశా, అయస్[illegible]-లేవు.

అధోఽధః, ఉపర్యుపరి, అధ్యధి, మొ. లేవు.

అపరస్పరా, అచస్క్యమ్ (=కర్మ శోభనమ్).

'అపరకరః' 'ఉపానసమ్' (ఉపగతం అనః) 'అమ్మా[illegible]' — లేవు.

'ఇక్షువాహణమ్' 'శరికాననమ్' — ఆప్టేలో ఉన్నవయినా దీనిలో లేవు.

'అపథం' 'అపంథాః' 'అపథః' -- వీటిలో మూడోదిమాత్రమే సూర్య. ని - లో ఉన్నది.
'అశ్వోరసమ్' పాణి. V. 4. 93 చొప్పున నిష్పన్నమయినది ఉన్నది; గాని దాని వెంబడినేఉన్న 94వ సూత్రము చొప్పున ఏర్పడ్డదే 'ఉపానసమ్' లేదు.

అక్షపరి, ఏకపరి — పాణి II. 1. 10 చొప్పున నిష్పన్నమయినవి. 'ద్యూతవ్యవహారే పరాజయే ఏవాయం సమాసః' అని సిద్ధాంతకౌముదిలో ఉన్నది. ఈ శబ్దాలు ఈ నిఘంటువులో కనబడవు.

'ఉపేయివాననాశ్వాననూచానశ్చ' ఇతి నిపాతాః దీనిప్రకారము నిష్పన్నమయిన శబ్దాలలో 'అనాశ్వాంసుఁడు' మాత్రము నాకంటబడినది.

'ఆశ్వాంసుఁడు, ఉపేయివాంసుఁడు, ఈయివాంసుఁడు' మొ. అనేకము కనబడలేదు.

మహాకవులు ఈరూపములు తరచుగా ప్రయోగించి ఉన్నారు.

'అశ్రి' సం.వి. చతుర్‌శబ్దమునకు పరమైనప్పుడు అకారాంతమగును.

ఒక్క 'చతుర్' శబ్దమేకాదు, 'త్రి,' 'షట్' ఇంకా మరికొన్ని మాటలకు పరమైతే అకారాంతమగును. 'త్ర్యశ్రి' అనవచ్చునని విద్యార్థులకు ఏలాగున తెలుస్తుందండీ!

'అస్రిః' అని రూపాంతరమున్నది. వీరు విడిచినారు.

'ఐకాగారికుఁడు, సం, వి. అ, పుం. చోరుఁడు,' 'దొంగ' అని ఈ నిఘంటువులో వ్రాసిన శబ్దము పాణిని 5. 1. 113 వ సూత్రముచొప్పున నిష్పన్నము. దీనివెంటనే, 114 వ సూత్రము చొ॥ 'ఆకాలికః'; వార్త్తికము చొ॥ 'ఆకాలికీ' అనుశిష్టమై ఉన్నవి. అవి ఈనిఘంటువులో లేవు. 'ఐకాగారిక' శబ్దానికి స్త్రీలింగరూపము 'ఐకాగారికీ' దీనిలో చేరలేదు. స్త్రీలింగరూపాలు ఊహించి తెలుసుకోలేము.

'ఉపలశబ్దము' స్త్రీ. అన్నారు; పుం. కూడాను. అజానేయశబ్దానికి స్త్రీలింగరూపమున్నది; 'అజానేయీ;' విడిచినారు. 'అతికేశా', 'అతికేశీ' అనుశిష్టములిందు లేవు. ఏలాగున ఇవి విద్యార్థులు తెలుసుకోగలరు ఈనిఘంటువు ఉంచుకుంటే?

అస్పృచః (పాణి v. 4-74), అక్షుధూః; ఆయతీగవమ్, అవరహసమ్, అయోదతీ, అరోకదన్, అరోకదంతః, అజాతకకుత్—అనుశిష్టములు; లేవే.

'ఉదగాహః' ఎత్తుకొని, 'ఉదకగాహః' విడిచితే, రెండోదాని గతి ఏమికాను! పాణి. vI. 3,57-60 చొ॥ నిష్పన్నములైనవి; వార్త్తికములు కూడా ఉన్నవి. ఇట్టివే ఉభాఞ్జలి, ఉభయాఞ్జలి; ఉభాదన్తి, ఉభయాదన్తి, ఉభాకర్ణి, ఉభయాకర్ణి మొ॥ వి.

'అవసామమ్' ,అవలోమమ్' లేవు; అనుసామమ్, అనులోమమ్ ఉన్నవి. ఇవీ అవీ కూడా ఒక్కసూత్రములోనే అనుశిష్టమయినవి. అచ్ప్రత్యన్వవపూర్వాత్ సామలోమ్నః (v. 4-75) ఈశబ్దాలకు ప్రక్రియచెప్పడానికే ఈసూత్రము రచితమయినది.

అలుక్సమాసాలలో, 'ఆత్మనేపదము'వంటివి ఒకటి రెండుమాత్రము నాకు కనబడ్డవి. కనబడనివి ఎన్నిఉన్నవో చూడండి:—అల్పాన్ముక్తః (vI. 3-2) అన్తికాదాగతః,

ఆయుష్టోమః (vII 3-83). ఓదనస్యపాచకః; ఓజసాకృతమ్, అంజసాకృతమ్, ఆత్మనా ద్వితీయః, ఆత్మనేభాషా, అరేజః, అప్సుయోనిః, అప్సుచరః, ఉరసిలోమా, అపాం స్రష్టా; అంతేగురుః; మొదలయినవి చాలామాటలు లేవు.

'అప్‌స్రష్టా' అనగూడదే, 'అపాంపతిః' వ్రాసినవారు 'అపాంస్రష్టా' ఎందుకు విడిచినారు? పాణిని 'మధ్యేగురుః' మాత్రము అనుశాసించినాడు; కాత్యాయనుడు 'అన్తేగురుః' అనికూడా ప్రయోగము లోకములో ఉన్నదన్నాడు.

ఉదిశ్విత్ కతిపయ్యా, అపరాధ్యాపకః,

అనభ్యాసమిత్యః (=దూరతః పరిహర్తవ్యః),

అగ్నిమింధః, ఇక్షుభక్షికా లేవు.

శబ్దమంజరి చదువుకొనే పిల్లలు, సమాసకుసుమావళి కంఠస్థం చేసుకొంటారు. ప్రథమాతత్పురుష సమాసాలు 'ఉత్తరకాయః,' 'అర్ధపిప్పలీ' మొదలయినవి దానిలో ఉన్నవి; ఈనిఘంటువులో మొదటిది ఉన్నదిగాని రెండోది లేదు.

సంఖ్యావాచకములన్నీ ఈ నిఘంటువులో చేర్చడానికి సంకల్పించినవారు 'అధికచత్వారింశ' మొ॥ విన్నీ అష్టాచత్వారింశత్, అష్టచత్వారింశత్; అష్టత్రింశత్ మొ॥ విన్నీ విడిచినారు.

వ్యవస్థలేదు, చూడండి:—

అచ్ఛావాకుడు ఉన్నదిగాని, అచ్ఛావాకీయము, అచ్ఛావాక్యములేవు. అచ్ఛన్దస్, అచ్ఛేదిక, అచ్ఛైధిక, అచ్ఛుప్త, అచ్ఛోటనమ్ లేవు. 'అజకా' రూపాంతరము 'అజికా' ఆప్టే ని. లో ఉన్నది; దీనిలో లేదు. అజకః, అజకవమ్; అజకావః; అజకావమ్; అజగమ్, అజగనమ్, అజగావః — ఇట్లా రూపాంతరములతో ఆప్టే ని. లో ఉన్నట్టు శబ్దాలుఅన్నీ వ్రాయడము నిఘంటుకారులకు విహితధర్మము

అనస్థ, అనస్థిక, అనస్థః, అన్వాదిష్టమ్, అన్వాధానమ్, మొ॥ కనబడలేదు. అన్యథాకారము వ్రాసినవారు ఇత్థంకారము ఏవంకారము విడిచిపెట్టడమునకు కారణము కనబడదు.

31. అవ్యయాలు కొన్ని వ్రాసినారు; కొన్ని విడిచినారు; వ్యవస్థలేదు. తెలుగులో ఈ అవ్యయాలు వ్యస్తపదాలుగా ఉండవన్నవారుకొన్ని ఎందుకు వ్రాసినారు? 'అద్య' వ్రాసి, 'అద్యతనము' దానికింద వ్రాసినట్లే, 'ఆరాత్' వ్రాసి, దానికింద 'ఆరాతీయము' వ్రాయవలెను; 'అధునా' ముందుగావ్రాసి, 'అధునాతనము' వ్రాయవలెను;

గాని 'ఆరాత్,' 'అధునా' విడిచినారు. ప్రయోగాలు తెలుగులో లేవంటారు గాబోలు. భావికవులు ప్రయోగిస్తా రేమో. 'అకస్మాత్తు' వ్రాసినారే. 'అథవా' జైమినిభారతములోను వారాహములోను ఉన్నదిగదా; ఆగ్రంథాలు రచించిన కవులకున్న స్వాతంత్ర్యము ఇతరుల కెందుకుండగూడదు! ఇంతేకాక, శతృ్రంతాలు మొదలయినవి సమాసాలలో ఉంటవి గనుక 'మూల'శబ్దములు (head words?) గా వ్రాయవలెనన్నవారు, 'ఇతికర్తవ్యతా' 'ఇతికర్తవ్యతామూఢుడు' అనేవి 'మూల' శబ్దాలుగా వ్రాసినప్పుడు, వాటిలోని 'ఇతి' వేరేశబ్దముగా ఎందుకు వ్రాయలేదు? 'అవాక్కు' క్రింద, 'అవాఙ్ముఖ' 'అవాఙ్ముఖి' కనబడవు. ఇటువంటి లోపాలు వందలు వందలుగా ఉన్నవి. అన్నీ ఎత్తి చూపించగలనా?

32. ఈ నిఘంటువు నిర్మించినవారు గ్రంథాలలోనుండి సంస్కృత శబ్దాలు ఎత్తుకోలేదు; ఆప్టే మొదలయినవారు కూడబెట్టినవి స్వీకరించినారు. ఆపని అయినా చక్కగా చేయలేదు, చూడండి. శబ్దాలన్నీ అకారాదిగా పట్టికలలో సిద్ధముగా ఆప్టే ని.లో ఉన్నవిగదా. అవి తెలుగుఅక్షరాలతో 'మక్కికి మక్కి'గా వ్రాస్తూ లేఖకులు కునికిపాట్లు పడ్డారేమో అని ఊహించడమునకు కారణాలు కనబడుతున్నవి. 'అనవస్థిత' శబ్దమునకున్ను 'అనశన' శబ్దమునకున్ను మధ్యను 'అనవహ్వార,' 'అనవాప్త, అనవాస, అనవాయ, అనవేక్షక, అనవేక్ష, అనవేక్షా, అనవేక్షణం, అనవస్థిత' అనే శబ్దాలున్నవి. ఇవి అన్నీ సూర్యా. ని. లో లోపించినవి. ఇట్లు, అన్ని పుటలలోను లోపాలు ఉన్నవని నమ్ముతాను. 'అనవాయ'నుండే 'అనవాయత' వచ్చినది.

33. ఆప్టే. ని. లో 'అన్న', 'అగ్ని', 'అన్య', 'అల్ప', 'అక్షి', 'అక్ష' మొదలయిన శబ్దములతో సమసించిన శబ్దాలు వేలకొలదిగా ఉన్నవి. (ఇట్టి 'సమస్త' శబ్దాలకు సూర్యా. ని. కర్తలు 'సమష్టి'శబ్దాలని పేరుపెట్టినారు. (చూ. పీఠిక — పుటలు 7,9;) నాకు వింతగా ఉన్నది ఈ పేరు. ఏశాస్త్రములో ఉన్నదో! సిద్ధాంతకౌముది చదువుకొన్నవారిని కొందరిని నేను అడిగినాను; తమకు తెలియదన్నారు; పోనీండి, 'సమష్టి' శబ్దాలని వారు వ్రాసినచోటులలోనే నేను సమస్తశబ్దాలనీ, సమాసాలనీ అంటున్నానని భావించవలెను.) ఈ సమాసాలు ఆప్టే.ని. లోనుండి పెకలించి సూర్యా. ని. లో తెచ్చిపోసినప్పుడు నూటికి యాభై, అరవైచొప్పున జారిపోయినవి! ఇంతేనా? ఇంకా! మాటలుకాని, మన్నుకాదే.

a. 'అంతర్'తో సమస్తమయినవి 160 ఉన్నవి; వాటిలో 77 సూర్యా.ని. లో లేవు.

b. 'అల్ప'తో సమస్తమయిన 60 శబ్దాలలో నాలుగుమాత్రమే దీనిలో ఉన్నవి.

c. 'ఇలా'తో సమస్తమయినవి దీనిలో లేనే లేవు. ఒక్కటయినా కనబడదు.

d. 'అభి'తో చేరినవి అనేకమున్నవి. వాటిలోనివి కొంచెము దీనిలోఉన్నవి. విడిచినవి అప్రసిద్ధములు కావుసుమండీ! 'అభివ్యంజకము' 'అభివ్యాదానము'వంటివి.

e. 'అప'తో చేరినవాటిలో అత్యల్పముగా దీనిలోఉన్నవి. 'అపకిరణము, అపకాశలీ' వంటివి లేవు.

f. 'అవ'తో చేరినవాటిలో 'అవలోమ'వంటివే అనేకము కనబడవు.

g. 'అవశ'తో చేరిన వాటిలో 'అవశింగము,' 'అవశేంద్రియచిత్త' వంటివే అనేకముగా లోపించినవి.

h. 'అశ్వ'తో సమస్తమయిన శబ్దాలు ఇంచుమించుగా 120 ఉన్నవి. వాటిలో అరవైకన్న ఎక్కువగానే దీనిలో లుప్తమయినవి.

i. 'ఋతు'తో చేరిన 26 సమాసాలలో కొన్ని మాత్రమే ఎత్తుకొన్నారు. 'ఋతుసంహార' శబ్దము విడిచినారు చూడండి!

j. 'అధర'తో చేరిన అధరస్వస్తికము మొ॥ లేవు.

k. 'అహన్'తో చేరిన అహరాగమః, అహర్గణః అహశ్శేషః మొ॥ ఎత్తుకోలేదు.

l. 'ఏక' మొదలయిన సంఖ్యావాచకములతో సమస్తమయిన శబ్దాలు వందలు వందలుగా ఉన్నవి. వాటిలో వీరు విడిచినవి ఇన్ని అన్ని అని చెప్పలేను.

m. 'అన్న'తో చేరినవి 50 ఉన్నవి. వాటిలో 30 విడిచినారు. 'అన్నప్రాశః' లేదు.

n. సంస్కృతములో 'పరి,' 'అధి' మొ॥ వాటికి పరీ, 'అధీ' అని రూపాంతరము లున్నవి. 'పరితాప'='పరీతాప' ఇటువంటివి నిఘంటువులో వ్రాయకపోతే విద్యార్థులను మోసపుచ్చినట్లవుతుంది; ఇవి ఊహించి కనుక్కోలేరు. ఆప్టేలో 'అధీవాసః' ఉన్నది. దీనికి 'ఉపరిష్టాదావరకం వాసః' అని అర్థంకూడా సంస్కృతభాషలో వ్రాసినదే ఉన్నది.

o 'ఊర్వశీ' శబ్దము 'ఉర్వశీ' శబ్దానికి రూపాంతరముగా సూర్య. ని. లో ఉన్నది. ఆప్టే. ని. లో లేదు. ఊకారము ఏలాగున వచ్చినది? వేదములోను కావ్యనాటకాదులలోను 'ఉర్వశీ'

p. ఆప్టె ని. లో, 'ఊర్ణనాభః, ఊర్ణవాభిః' అనేశబ్దాలున్నవి. సూర్య. ని.లో 'ఊర్ణనాభము' ఊర్ణనాభి;' ఉన్నవి. రెండోది ఎక్కడనుండి వచ్చినది? ఆప్టె ని. లోని ఊర్ణవాభిః అనే శబ్దము 'ఊర్ణనాభి' అని పఠించి, దానిని 'ఊర్ణనాభి'గా తెలుగించినారా ?

[ ఈశబ్దము ఆర్యభాషాతత్త్వ జిజ్ఞాసువులయిన పాశ్చాత్య పండితులు సావధానముగా పరీక్షించినది. (చూ. A. Meilet: Introduction A L' Etude Comparative Des Langues Indo Europeannes; 1912, P. 371.) ఊర్ణశబ్దము ఇంగ్లీషులో Wool, లిథ్‌లో wilna రష్యన్‌లో volna. లాటిన్‌లో velnus, గ్రీక్‌లో lenos, ఐరిష్‌లో olann, వెల్ష్‌లో gwlan, 'నాభి'శబ్దము ఇంగ్లీషులో Weave, Web, woof అనేమాటలతో సంబంధముగలది. ఆర్యభాషలన్నిటిలోను √ webh అనే సామాన్యధాతువునుండి పుట్టిన శబ్దాలు చాలా ఉన్నవి. కొంచెముకాలముకిందట ఆసియా మధ్యభాగమందు దొరకిన తొఖేరియా భాషాగ్రంథములో కూడా baf-ad అనేమాట కనబడినది. సంస్కృతములో ఈ ఊర్ణవాభి శబ్దముతప్ప మరిఒకటి. ఆ ధాతువునుండిపుట్టినది కనబడలేదట! ఇదిపోతే; ఎంతనష్టమో! ఇట్టి శబ్దాలు చరిత్రకు ఆధారము! ]

భాషాతత్త్వజిజ్ఞాసువులకు సూర్య. ని. వంటివి ప్రమాణము కావుగదా, భాషాతత్త్వవేత్తలకు 'ఊర్ణవాభికి' బదులుగా 'ఊర్ణనాభి' కనబడితే ఏమనుకొంటారు?

34. ఈ నిఘంటువులో కొన్నిశబ్దాలకింద వ్రాసిఉన్న వివరణములలో ప్రయుక్తమయిన సం. శబ్దాలు 'మూల' శబ్దాలుగాలేవు. 'అష్టభోగములు' అనే దానికింద అక్షీణ(అక్షిణీ), 'అభిమానము'కింద 'ఆత్మగౌరవము' 'అందలము', 'క్రింది' 'ఆందోళ' ఉన్నవిగాని మూలపదాలలో చేరలేదు. 'అరాబు' క్రింద 'ఉపసాలము' ఉన్నది. అందుకు ప్రమాణము ఆంధ్రభాషార్ణవము. అయితే 'ఉపసాలము' మూలశబ్దంగా లేదు. సంస్కృతములో ఇది ఉన్నదా? తెలియదు. 'ఉపశాలమ్' ఉన్నది; అది దీనిలో చేరలేదు. 'ఉపసాలాఖ్యయగు నరాబు' అనేపాఠముతప్పా? నిఘంటు నిర్మాతలు ఎవరికి నియుక్తమయినపని వారుచేసి విడిచినారు. అందరూ కూర్చుండి అన్నిశబ్దాలూ చర్చించి నిర్ణీతమయిన శబ్దరూపమూ, అర్థమూ నిఘంటువులో వ్రాయలేదు. వ్యవస్థ లేకుండా పని జరిగినది; అస్తవ్యస్తమైనది. 'వెంకన్న వేమవరం వెళ్ళివచ్చాడు'అన్నట్టు.



4

35. శబ్దస్వరూపము వికృతమైనందుకు నిదర్శనము—

'ఇహము సం. అవ్య' అని వ్రాసినారుగదా, విద్యార్థులు సంస్కృతమునందు "ఇహమ్" అనే రూపము ఉంటుందనుకోరా? "సం. ఇహ. అవ్య." అని వ్రాయవలెను. "జగము. సం. వి." అని వ్రాస్తే సంస్కృతములో "జగమ్" అనే శబ్దమున్నదనుకోవడమునకు కారణము కాదా? తెలుగులో ఇహమందు విశేష్యము.

36. వేరువేరు ప్రకృతులనుండి పుట్టి, వేరువేరు అర్థముగలిగి ఏకరూపము పొందిన శబ్దాలు అన్నిభాషలలోనూ ఉంటవి. అవి నేటి నిఘంటు నిర్మాతల పద్ధతిచొప్పున వేరువేరు "మూల" శబ్దాలు (Head words) గా వ్రాయవలెను. ఈ సూర్య. ని. లో అట్లు జరుగలేదు.

ఉ.అదుఁడు, (1) తినువాఁడు, (2) దాయము తీసుకొనువాఁడు." ఈ శబ్దము మూల శబ్దముగా వ్రాయడమే హాస్యాస్పదముగా ఉన్నది. 'అన్న+అద=అన్నాద' అనిన్ని 'అన్న+అత్తృ', 'అన్న + అదన్' అనిన్ని ఆ స్తై ని. లో ఉన్నవి. (చూ. అన్నమ్) 'అన్న+అదుఁడు' అని సూర్య ని.లో వ్రాసినవారు భ్రమపడ్డారు. ఏదయినా ఈఅర్థమందు అద్ ధాతువునుండి వచ్చిన శబ్దమిది. దాయాదః అన్నది (దాయం ఆదత్తే) ఆ అనే ఉపసర్గతో కూడిన 'దా'ధాతువునుండి వచ్చినది; అది జుహోత్యాదివర్గములోనిది. శ్లువికరణము. 'అద్' అదాది, లుగ్వికరణము.

అనుదితము, (1) చెప్పబడనిది. (2) ఉదయించిన. మొదటి అర్థమందు 'వద్' ధాతువునుండి వచ్చినశబ్దము; రెండో అర్థమందు (అ + ఉద్ + ఇతము' 'ఇ' ధాతువు నుండి వచ్చిన శబ్దము.

అనాశకము, అనాశము, అనుదారుఁడు, అరతి, మొ॥ ఇట్టివే. అర్థాలు, వ్యుత్పత్తులు వేరయినప్పుడు వేర్వేరుగా వ్రాయడము ఉత్తమపద్ధతి. ఇంగ్లీషులో (tent) అనే మాటకు నాలుగర్థాలున్నవి. నిఘంటువులో నాలుగు వేర్వేరు మాటలుగా ఉన్నవి. అట్లే (sound) అనేరూపముగలవి నాలుగుమాటలుగా ఉన్నవి.

37. 'అధివసించు, సం. అ. క్రి. నివసించు' దీనిక్రింద వ్రాసిన ప్రయోగాలలో స. క్రియగా ఉన్నది. సంస్కృతమందు 'ఉపాన్వధ్యాఙ్ వసః' అనేసూత్రము చొప్పున,

అధివస్, ఉపవస్, అనువస్- ఇవి స. క్రి. అధిష్ఠించు, స క్రి. అని వ్రాసినారే, దాని వంటిదే అధివసించు. 'అధిశీఙ్ స్థాసాం కర్మ' 'కర్మగలది' సకర్మకము.

ఆశంక - మీది ఎనిమిది పేరాలలో చూపించిన దోషాలకూ, లోపాలకూ ఉత్తర వాదు లెవరు ?

38. శ్రీ. శ్రీ. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారు ఈనిఘంటువు నిర్మించ డానికి పూనుకొని, కొంతపనిచేసినారుగదా. వారు అప్పుడు ప్రకటించిన నిఘంటు స్వరూపదిగ్దర్శన పత్రముల (Specimen pages)లో ఉదాహృతమయిన సంస్కృత శబ్దాలలో కొన్ని సూర్యా. ని. లో లేవు. ఉ:—అంగాధిపుడు, అంగాపూర్వము, అంగప్రశమనము, అంగమంత్రము:—

'అంగము'క్రింద పంచాంగములు, షడంగములు, సప్తాంగములు, అష్టాంగములు, అంగ యజ్ఞము. అంగుడు, అంకారము, ఆకోకేరము:—లేవు 'అంగిరావిధానము' వ్రాసి, భవిష్యత్పురాణము చూచి వీనినన్నిటిని వ్రాస్తామనికూడా తెలియజేసినారు శాస్త్రిగారు. వారికోరిక నెరవేరలేదు. ఇప్పుడుసూర్యా.ని. రచించిన పండితులు ఆ కొరతమే తొలగించి నారు. భవిష్యోత్తర పురాణము చదివి, ఆప్రతవిధానము వ్రాయవలసినది వారిదికాదు కాబోలు. వాచస్పత్యములోఉంటే ఎత్తుకొనినట్లుగు. అర్కవివాహముక్రింద కశ్యప సంహితలోని శ్లోకాలు వ్రాసినారు. అనిష్టానుబంధిక్రింద కాదంబరిలోని వాక్యము వ్రాసినారు. 'అగ్నిష్టోమము'క్రింద గణరత్నమహోదధిలోని శ్లోకాలు వ్రాసినారు. ఈలాగుననే అనేక సంస్కృత శబ్దాలకు ప్రయోగాలు సంస్కృత గ్రంథాలలోనివే, వాచ.నుండి ఎత్తివ్రాసినారు. వానికి తెలుగు అర్థంలేదు. ఎవరికోసము ఈశ్రమ అంతా! ఆశ్లోకాలకు అర్థంతెలుసుకోగలవారికే ఈనిఘంటువు అక్కరలేదు.

39. శ్రీ విద్యావాచస్పతి కొట్ర శ్యామలకామశాస్త్రిలవారు రచించి ప్రకటిస్తూ ఉన్న 'ఆంధ్రవాచస్పత్య' మనే నిఘంటువులోనున్న సంస్కృత శబ్దాలు కొన్ని సూర్యా. ని. లో లేవు:— ఉలంగనము, ఉలూకగతి, ఉలూకారి, ఉలూకిని, ఉకము, ఉలూ ఖకము, ఉలూఖల మర్దల న్యాయము, ఉలూఖల శేషన్యాయము, ఉలూత సం. వి. ఆ స్త్రీ. (సూర్యా. ని. లో 'ఉలూతము' మాత్రమే,) ఉల్కాగ్ని, ఉల్మకిని, ఉల్లిక, ఉల్లాల్యము, ఉల్లీలాశ్రయము, ఉల్లాహిత్యము (దృష్టిభేదము).

40. స్మృతులలోను, దర్శనములలోను, వ్యాకరణములోను, వైద్యము, జ్యోతిషము, మొ॥ శాస్త్రిలలోను ఉన్న పారిభాషికపదాలలో కొన్ని ఉన్నవి, కొన్ని లేవు. వ్యవస్థపేర్పర్చుకొని శబ్దాలు వీరు ఎత్తుకోలేదు. ఆప్టె ని. లోను, వాచ. లోను ఉన్నవన్నీ వీరు దీనిలో చేర్చలేదు. 'అభావ' శబ్దము గురించి చాలా వివరణము ఆప్టెలో ఉన్నది. సూర్య. ని. లో రెండుపంక్తులున్నవి అభావము నిర్వచించకుండా 'అత్యంతాభావము' క్రింద ఉదా. వ్రాసినారు; 'అన్యోన్యాభావము' క్రింద ఏమీ లేదు. ఈలాగుననే తక్కిన విషయములున్నూ. శ్రీ నాగపూడి కుప్పుసామయ్యగారు ఈ విషయమై మొగమాటము లేకుండానే హిందూ పత్రికలో తమ అభిప్రాయము ప్రకటించినారు. సూర్య. ని. లోని తెనుగుమాటలలో 'అవకతవక' అనేమాట లేకపోవడము పెద్ద లోపముగా వారికి కనబడినది. అది ఆంధ్రదేశమందంతటా, అందరూ, ఆబాలగోపాలం, వాడుతున్నారనిన్ని అపరిహార్యమనిన్ని, అది తెలియజేసేభావము, బోధించేమాట మరి ఒకటి లేదనిన్ని వ్రాసినారు. అట్టివారు ఈలాగున వ్రాయడము నాకు ఆశ్చర్యమున్ను ఆనందమున్ను కలుగజేసినది. వారికి ఈశబ్దముయొక్క లోపము ఏలాగున తోచినది? ఈ నిఘంటువు 'అవకతవక'గా ఉన్నట్టు వారికి తోచిఉండును. ఆశబ్దము ఉన్నదా లేదా అని నిఘంటువుచూచి ఉందురు. అది కనబడకపోయినందున వారికి అది లేకపోవడము పెద్దలోపముగా తోచిఉండును. నాకూ ఆలాగుననే తోచింది. తోచిన అభిప్రాయము సహేతుకమయినప్పుడు మొగమాటము లేకుండా తెలియజేయడము తప్పుకాదు. విమర్శచేసేవానికి అది విహితకృత్యము. ఈఅభిప్రాయమును దృఢీకరించే విషయము మరొకటి దిగువను వ్రాస్తున్నాను; చిత్తగించండి.

41. మీదను 13వ పేరాలో 'గుద్దిదు చేస బడ్డటు' ఆప్టెని. లోనుండి వైదిక శబ్దాలు కూడా ఈ నిఘంటువులో చేర్చినారని వ్రాసినాను. వైదికశబ్దాలు చేర్చడము తప్పని నేను నిందించలేదు. అన్నీచేర్చవచ్చును; గ్రంథము మరింత పెద్దదవుతుంది. ఆప్టె ని. లో ఉన్నవికావా? అయితే, ఆనిఘంటువులో అవి వైదికములని తెలియజేసే గురుతులున్నవి, దీనిలో అట్టి గురుతులులేవు. అందుచేత తక్కిన సంస్కృత శబ్దముల వంటివే అనుకొని వైదికశబ్దాలు విద్యార్థులు ప్రయోగించి నిందపాలు కావలసివస్తుంది. అందు కుత్తరవాదులు ఈనిఘంటు నిర్మాతలు.

42. శబ్దానుశాసనముచేసిన ఆచార్యులు శబ్దాలన్నీ,1. వైదికములనీ,2. లౌకికములనీ, రెండువిధములుగా విడదీసినారు. వేదమందుమాత్రమే ప్రయుక్తమయిఉన్న శబ్దాలు వైదికము లన్నారు. లోకములో అందరూ వాడుకొనేవి లౌకికములన్నారు. "లోకే విదితాః=ఝుటితి (=శ్రవణమాత్రేణ) ప్రసిద్ధాః లౌకికాః" అని పతంజలిన్నీ, 'యే లోకయాత్రాహితవో భాషాశబ్దాః తైరేవ లౌకికత్వం ప్రసిద్ధమ్' అని కాశికా కారుడున్ను అన్నారు. వేదములోని శబ్దాలు అన్నీ మంత్రద్రష్టలకాలములో, ఆబాల గోపాలం, అందరికీ తెలిసినవే అయినా అంతకంతకు భాష మారిపోయినందున, వేదములోని కొన్ని శబ్దాలు వ్యవహార భ్రష్టములయినవి. అవే వైదికములు. వేదాధ్యయనము చేసేవారికి అవి సుపరిచితములైనా ఇతరులకు తెలియవు. లోక యాత్రకోసము ఏర్పడ్డ లౌకికభాష అందరికీ సామాన్యమయినది. దానిలో వైదికశబ్దాలు చేర్చగూడదు. అంతకంతకు ఈ "లౌకికభాష" కూడా మారిపోయి వ్యవహారభ్రష్టమయి, పాలీ మొదలయినవి ఏర్పడ్డవి. అయినా పూర్వాచార్యులు అనుశాసించిన భాషలో గొప్ప గ్రంథాలు రచితమయి ఉన్నందున, పండితులు వారి అనుశాసనముచొప్పున ఆభాష అభ్యసించి, నేటికిన్ని మన దేశమందు గ్రంథాలు రచిస్తూఉన్నారు. ఆభాషపేరే 'సంస్కృతము'. వైదికభాషవలెనే సంస్కృతముకూడా వ్యవహారభ్రష్టమైనా, పూర్వులుచేసిన నియమముచొప్పున ఆ రెండున్ను కలియకుండా నేడున్నవి. కాళిదాసువంటి కవి 'త్రియంబకమ్' అనే వైదికశబ్దము ప్రయోగిస్తే పండితులు నిందించినారు. లౌకికభాషలో 'త్ర్యంబకమ్' అనవలెను. రెంటికీ భేదము ఎంత స్వల్పమో చూచినారా? 'త్రియంబకం యజామహే' అని బ్రాహ్మలు నేటికిన్నీ చదువుతూనేఉన్నారు. అయినా ఇప్పటివారు రచించే శ్లోకములలో 'త్ర్యంబకమ్' అనవలెనుగాని 'త్రియంబకము' అనగూడదని నియమమున్నది. సూర్య. ని.లోని 'అగువు' అనే శబ్దము 'అగుః' యొక్క రూపము. 'అగుః' వైదికశబ్దము. అది సంస్కృతములోనైనా వాడగూడదే; తెలుగులో వాడవచ్చునా? ఆశబ్దము 'వైదికము' అనిస్పష్టముగా తెలియజేసే గుర్తుపెట్టకపోతే శబ్దరూపమునుబట్టి అది వైదికమని ఎవరూ తెలుసుకోలేరు. 'అగుః' వలెనే కనబడుతున్నవి 'చిత్రగుః' 'శబలగుః' 'తిష్ఠద్గు, వహద్గు'; ఇవి వైదికములుకావు. 'అయస్

మయ' వైదికము, 'అయోమయ' లౌకికము. త్యజ్ ధాతువునుండే 'త్యజన్' 'త్యాగః' వచ్చినవి; మొదటిది వైదికము. తన్ ధాతువునుండే తనయః, తనయా, తనః, తనా వచ్చినవి: కడపటి రెండున్నూ వైదికములు. 'అరాతిః' లౌకికమయినా 'రాతి' వైదికము. సమాసములలో కూడా ఇట్టి భేదమున్నది. 'అంతఃపురం' వంటిదే 'అంతఃపాత్రిమ్' అయినా అది వైదికము. దానిలో 'యామ' దూర్చి, 'అంతర్యామ పాత్రిమ్' అంటే తప్పు లేదు; వైదికము కాదు, లౌకికము. 'అశ్మన్' ఒక అర్థమందు వైదికము, మరియొక అర్థమందు లౌకికము.

'అంతః'తో చేరిన సమాసాలలో అంతరుష్యం, అంతఃపేయం, అంతఃకథ, అంతర్ విద్వస్, మొ॥ వైదికాలు. సమాసాలు, తద్ధితాలు, కృదంతాలు, స్త్రీలింగాలు మన యిష్టము వచ్చినట్టు కల్పించి ప్రయోగించగూడదు. ఆప్టై ని. లో అన్ని సమాసాలు వ్రాసినారు; వాటిలో ఏవి వైదికములో తెలియజేసినారు. ఈ నిఘంటువులో 'అవకతవక'—నిఘంటు నిర్మాతలు ఏ నియమము చొప్పున ఆప్టై ని. లోని మాటలు ఎత్తుకొన్నారో తెలియదు. జనసామాన్యము కోసము రచితమైన ఇంగ్లీషు నిఘంటువులో వ్యవహారభ్రష్టమైన శబ్దాలుండవు. ఉంటే, అవి అట్టివి అని నిర్మాతలు స్పష్టముగా సూచిస్తారు. 'Obsolet, arnchaic' అనే అని పేళ్ళు పెట్టి పాతఇంగ్లీషు మాటలు నేటి ఇంగ్లీషులో కలియకుండా విడదీసినారు. మన తెలుగులో 'నావుడు,' 'అనవుడు,' అరుగుదెంచు,' 'చనుదెంచు' లోకములో ఎవ్వరూ వాడకపోయినా భారతము చదువుకొన్న పండితులు తమకు తెలుసునని నేటిగ్రంథాలలో వాడుతున్నారు. వేదాలు జిహ్వాగ్రమందుంచుకొన్న ఆచార్యులు వైదికశబ్దాలు లౌకికభాషలో కలియకుండా అనుశాసించినారు. ఛాసరు, షేక్స్పియరు బోధించగల ఇంగ్లీషుపండితులు పాతపడ్డమాటలు తాము వాడరు. విద్యార్థులు వాడితే తప్పుగా నిరాకరిస్తారు. 'దేశభాష' అంటే ఏమిటో, లౌకికభాష అంటేఏమిటో పతంజలి మొ॥ ఆచార్యులు అందరూ చెప్పినారు; స్వీట్, వైల్డ్ మొ॥ ఇంగ్లీషుపండితులు చెప్పినారు. తెలుగు పండితులకు అది తెలియదా? బోధపడదా?

(సశేషము)

# వి హ్వా ల త

## సోమరాజుపల్లి వెంకటరామయ్య

౧

ప్రేమ సనున్ వెసం బొడవి పిల్చుచు వచ్చును వాగనూపుర్కో
ద్దామ ఝుళంఝుళార్భటిపథాల యటన్, మొగము న్నిలించి నే
నే మిది యంచు జూడ సహమే కనరాదు గదా! కనాప్రి ము
దామల రేఖ లేని గంభీరాకి మరంగు నెడండ కేడగా—

౨

ఈ యెదలోన తీయనిది యేదియొ రూపము ఉద్భవిల్లి ఆ
ప్యాయనలీలగా మెరసి యాత్మకు చిక్కక మెల్లమెల్ల చే
చాయల కందకుండ సరసమ్ముగ నాసలు పెంచిపోవు నీ
మాయలమారి చిక్క దొకిమారయినా యిది యేమి చిత్రమో!

౩

తీయని యే తలంపులనో తీయక తేలుచు నెప్పుడైన నై
హాయన సీమలోన శివళాంబుదబాలుకలోడ నాడు నా
కీయెడ వెచ్చిపెట్టితిని యీహృది దూసుకపోవునట్టి బా
ధాయతి దీనితో హృదయమంతయు పుండయిపోయె బో చెలీ!

౪

ఇంపులు గూర్చు వన్నెలను ఈ హృది యంతయు దోచినైచి రా
గింపుల నోడ విప్పి చెలి నేవో రసధ్వను లాలపించి మో
హింపగ జేసి మింట చనుదే; మెయిరేకల చూపకుండ నా
పెంపుడుకన్నె చిల్కరో, దవీయసివై, మనసొప్పనే, అహో!

# కదంబకన్యక

## దిగుమర్తి రామారావు

అకస్మాత్తుగా నేను అంపావూరు వెళ్ళవలసివచ్చింది. సాయంకాలం రైల్లోవెళ్తే రాత్రి తొమ్మిదిన్నరకి తాల్పురా చేరుతుంది. అక్కడనుంచి ఎనిమిది మైళ్ళు నాటుదారి అంపావూర్లోకి పోవడానికి. రాత్రి బళ్ళు దొరుకుతవో లేదో స్టేషన్లో! ఈ సాయం కాలం రైల్లో వెళ్ళకపోతే రేపుపొద్దున్న రైల్లోవెళ్ళాలి. మధ్యాహ్నానికికాని అంపావూరు చేరలేను. అవసరకార్యంకదా. సాయంకాలంరైల్లో బయలుదేరడానికే నిశ్చయించాను........తాల్పురా సమీపిస్తున్నకొద్దీ సముద్రపుగాలి బాగా వీస్తూ వున్నది. స్టేషనులో నేనొక్కడినే దిగిన ప్రయాణికుడులాగావున్నాను. అనుమానించినట్టుగానే బళ్ళేవీ స్టేషనులో దొరకలేదు. పగలుబండీకేకాని రాత్రిబండికి సాధారణంగా ప్రయాణికులు వుండరట. బళ్ళు రాత్రి సాధారణంగా దొరకవట. సరే, స్టేషనులోనే రాత్రి పడుకోడానికి నిశ్చయించేసి మూట, జంబుకానా ప్లాట్‌ఫారమ్ మీద బెంచీవుంటె దానిమీద పడవేసి, కట్టివేస్తూవున్న టీదుకాణంవద్దకు పోయాను. అదృష్టవశాత్తూ టీ అయిపోలేదు. టీ పుచ్చుకుంటూ దుకాణదారుతో మాట్లాడినప్పుడు తెలిసింది; ఈ స్టేషనులో విపరీతంగా దోమ లున్నట్టు. అవును, చిల్కాసముద్రం యిక్కడికి దగ్గరే. చుట్టుపక్కల యించుమించు అంతా అడివిప్రదేశం.

'యిప్పుడే బయలుదేరి అంపావూరు పోయేదా' అని అడిగాను. అంపావూర్లో అట్టే దోమలబాధలేదట. జంతుభయంలేదు కాని రస్తాలో సందడి ఏ మాత్రమూ వుండదు; ఒంటరిగా వుంటుందని అతను చెప్పినాడు. ఉండడమా ఈ రాత్రికి, అంపావూరు పోవడమా అని కాస్త ఆలోచనలో పడేటప్పటికి చంద్రుడు పైకివచ్చినాడు. యిక్కడ విస్తారంగా పెరిగివున్న చౌకుచెట్లమధ్యనుండి చాలా వింతగా కనిపిస్తున్నాడు. చంద్రునిముఖము పాలిపోయినట్టుగా వున్నది కాని చాలా మృదువుగా వున్నది.

నాలుగు నిమిషములు కూర్చున్నానో లేదో అప్పుడే ఘీంమంటూ దోమలు చెలరేగినాయి. వెంటనే నిశ్చయముచేసి మూట పట్టుకుని బయలుదేరాను. ఒక్కటేరోడ్డు; మరేమీ చీలికలు లేవు; సందడి లేకపోతేఏమి? వెన్నెలకూడా వున్నదికదా.

నడకఏమీ ఆయాసంగాలేదు. వెళుతూన్నకొద్దీ చౌకుచెట్లు హెచ్చవుతూవున్నవి. గాలికూడా జోరుగావీస్తూవున్నది. చౌకుచెట్ల మధ్యనుండి గాలిచేస్తూన్న శబ్దమూ, సముద్రపు కెరటాలధ్వనీ కలిసినవింతరొదతప్ప మరేఅలికిడీలేదు. రెండోమైలురాయి దగ్గిరమట్టుకూ ఏవోపిట్టలు నన్నుచూచి గూటినుండి బైటకువచ్చి రెక్కలు రెపరెప కొట్టి మళ్ళీ గూటిలోదూరినవి. మూడోమైలురాయి సమీపంలో రెండునక్కలు మెరుస్తూన్న కళ్ళతో దారిలోనిలబడి నేను దగ్గిరకిరాగానే చౌకతోటల్లోకి పారిపోయి నవి. అంతే మళ్లీ అంతానిశ్శబ్దమే. వెన్నెల చీలికలుచీలికలుగా దారిలో ప్రవహిస్తూ వున్నది. యింకా అయిదుమైళ్ళువున్నది అంపావూరు. నాలుగోమైలురాయి దాటి పోయాను. ఐదోమైలురాయి సమీపించకముందే రోడ్డు మళుపుతిరుగుతుంది. ఆ మళుపుదగ్గిర పెద్ద కదంబవృక్షంవున్నది. చెట్టుకింద పక్కపరిచినట్టుగా చిన్న యిసుక దిబ్బవున్నది. ఆకులమధ్యనుండి చంద్రుడు బహు ప్రశాంతంగా కనిపిస్తున్నాడు. ఒక్కఘడియ విశ్రమిద్దామని చెట్టుకింద మూటదించి, యిసుకమీద చేరగిలపడినాను. బంతులవలెవున్న కదంబపూలనుచూస్తూ పరధ్యానంగా చెట్టుమీదికిచూచాను. వళ్లు ఝల్లుమన్నది. యిదేమి భ్రమా, నిజమా? యౌవ్వనములోవున్న కన్యక ఒకత్తె చెట్టుకొమ్మలలోనుండి నాదిక్కుగా చూస్తూఉన్నది! నా విస్మయము, తత్తరపాటు చూచికాబోలు, 'భయపడకు, నేనూ, కదంబ కన్యకను' అని నవ్వుతూ ఆ బాలిక నన్ను సంబోధించినది. ఆమె ప్రసన్నవదనమూ, నెమ్మదైనమాటలూవల్ల నాభయము తీరినదికాని చాలా ఆశ్చర్యమువేసినది. ఈకదంబకన్యక ఎవరుచెప్మా! యింతరాత్రివేళ యిక్కడవున్నది? అని ఏమేమో అనుకుంటూవుండగానే ఆమె తిరుగ అన్నదికదా! 'నాకథ చెబుతాను. వింటావా?' అని.

'అట్లాగే' అన్నాను.

'సరేకాని నా వయస్సెంత అనుకుంటావు?' అని చనువుగా అడిగినదామె.

'మంచి యౌవనవయస్కురాలివి' అన్నాను.

'నా వయస్సు అరవైఆరు సంవత్సరాలు తెలుసునా' అని ఆమె నవ్వసాగినది.

నాకు చాలా ఆశ్చర్యమువేసింది. అరవైఆరు సంవత్సరాలు వచ్చినా యింత పడుచు తనములో ఎట్లాఉన్నదిచెప్మా?

ఆమె తిరుగ అన్నదికదా 'ఆశ్చర్యముగా వున్నదికదూ? కాని వసంతకాలంలో ప్రతి సంవత్సరమూ నా పుట్టినదినం వస్తుంది. నాకు మరేమీ పండుగలూ,

పర్వాలూ లేవు. వసంతకాలంలోనే పుట్టినదినం; పుట్టినదినమే పర్వదినం; అప్పటి నుంచీ మళ్ళీ ఎప్పటిబాల్యమూ పొందుతాను. అందుచేతే పుట్టినదినానికి — వసంత కాలానికి నేనెప్పుడూ ఎదురుచూస్తూవుంటాను.'

'అయ్యో, సంవత్సరాలు గడిచిపోతూవుంటే వృద్ధాప్యంవస్తుందికదా అని చింతఉండదూ?'

'ప్రతి సంవత్సరమూ యౌవ్వనత్వము పొందుతూవుంటే చింతఎందుకు? కొత్త ఆకులూ, కొత్తపువ్వులూ పూర్వం ఎట్లావున్నానో యిప్పుడూ ఆలాగేవున్నాను.'

'అవును, ప్రతిసంవత్సరమూ నూతన యౌవ్వనము ఎందుకు రాకూడదు?' అని నాలో నేనే అనుకున్నాను. 'సుమారు యిరవై సంవత్సరాలవుతుంది. యిలాగే వెన్నెల రాత్రి. రెండెడ్లబండిమీద ఒక యువకుడూ, యువతీ - నూతన దంపతులుకాబోలు. ఈదారినేవస్తూ యిక్కడేఆగి కులాసాగా ఖబుర్లుచెప్పుకుంటూ కూర్చున్నారు. అప్పు డా యువకుడు యువతినుద్దేశించి 'అదుగో చూచావా చంద్రుణ్ణి. కదంబచెట్టు కొమ్మల్లోంచి నిన్నుచూచే నవ్వుతున్నాడు' అంటూ ఆ అమ్మాయి ముఖాన్ని నెమ్మదిగా తనచేతుల్లోకి తీసికొని చంద్రుని కేసి తిప్పిచూపించాడు. ఆ అమ్మాయి సిగ్గుపడి నవ్వుతూనే అన్నదికదా! 'నన్నుచూచి ఎందుకు నవ్వుతాడు? నిన్నుచూచే నవ్వుతున్నాడు'. యిట్లాఅని యిద్దరూ పాపం ఆ చంద్రుణ్ణే మరచిపోయి మళ్ళీ ఖబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.'

'మరి నిన్నువాళ్ళు చూడలేదూ? నీవైనా వాళ్ళని పలకరించలేదా?'

'ఖబుర్ల సందడిలో నన్నెక్కడ చూచేరు. అంతసరదాగా మాట్లాడుకుంటూవుంటే మధ్యనేనెందుకు అడ్డురావడం అని పలకరించలేదు. కాని మంచి కదంబపుష్పాన్ని మటుకూ వాళ్ళిద్దరిమధ్యా పడవేశాను.'

'అప్పుడు వాళ్ళేమిచేశారు?

'అప్పుడేనా వాళ్ళు నాకేశిచూస్తేకదూ. ఆ అబ్బాయి మాట్లాడకుండా ఆపువ్వునుతీసి ఆమెతలలోగుచ్చి ఆమెతలని తన వక్షస్థలానికి లాగుకొని దీర్ఘముగా పుష్పపరిమ ళాన్ని ఆఘ్రాణిస్తూ కూర్చున్నాడు. యిరవై సంవత్సరాల క్రిందటి సంగతి. ఎప్పుడో కాని యిట్లా ఎవరూ రాత్రిళ్లురారు. మళ్ళీ యిన్నాళ్ళకు నీవొచ్చి యిక్కడేకూర్చు న్నావు. వింటున్నావా?' అంటూ నామీద యిన్ని కదంబపువ్వుల్ని రాల్చింది......

.........కాని యిది ఏమిటి! మళ్ళీ ఏదేనా భ్రమ కాదుకదా! తాల్పురానుండి అంపాపూరు పోయేరోడ్డే! రెండుకొసలనుండీ చాప చుట్టుకువస్తున్నట్టుగా మెల్లగా

చుట్టుకుంటూ ఈ కదంబ చెట్టుదగ్గిరకే వస్తూంది. నా వళ్లు మళ్ళీ ఝల్లుమంది.

'భయంలేదులే. మరెవరూకాదు. రోడ్డుతాత వస్తున్నాడు. చాలా వృద్ధుడు. మంచి మంచికథలు చెబుతాడు' అని కదంబకన్యక అన్నదో లేదో యింతలోకే వణుకుతూ, వంగిపోయిన నడుముతో బహు వృద్ధాప్యంలోవున్న రోడ్డుతాత దగ్గిరికా వచ్చి కదంబకన్యకను పలకరించి యింతలోనే నన్నుచూచి నమస్కరించి కళ్లను ఆనుకొని కూర్చున్నాడు. నేను విస్మితుడనై పోయాను. ఎంతవృద్ధు! ......

'బాబూ, నేనూ; తాల్పురా—అంపాపూరు రోడ్డుతాతను. చాలాకాలమై యిక్కడే నివాసము.

ఎప్పుడోకాని తమబోటివారు రారు. రాత్రిళ్లు బొత్తిగా సంచారంవుండదు. కాని ఎవరువచ్చినా ఈ అమ్మాయిదగ్గిరే విశ్రమిస్తూ కూర్చుంటారు. మంచి యోగ్యురాలైనపిల్ల బాబూ. కష్టం సుఖం మాట్లాడుకోడానికి యిలాగే ఎప్పుడేనా రాత్రి ఏ సంచారమూ లేని సమయముచూచి ఈ పిల్లవద్దకి వస్తూవుంటాను.

కదంబకన్యకఅన్నది. 'తాతా! యిప్పుడే నాకథ చెప్పాను. కానీ నీకొచ్చినన్ని కథలు నాకురావు. నీకథకూడా చెప్పుమరి.'

'పిల్లవాళ్ళు మీరు కథలు చెప్పుకోండి. ముసలివాణ్ణి నాకథఏమిటి వింటారు' అని బొక్కపళ్లతో వణుకుతూ అన్నాడు రోడ్డుతాత.

'చాలాముసలివానివలె వున్నావే తాతా. నీవయస్సెంతవుంటుంది?'

'పురాతనమైనవాణ్ణి బాబూ, అశోకచక్రవర్తి కాలంలో పుట్టాను.'

'ఏమిటీ! అశోకచక్రవర్తి కాలంలోనా?' నిర్ఘాంతపోయాను.

'అవును బాబూ అనేక రాజ్యాలు, కఱవులూ, వఱదలూ, కల్యాణాలూ చూచినవాణ్ణి. కష్టం సుఖంచాలా అనుభవించానుబాబూ. మహాప్రభువు, అశోకచక్రవర్తి. ఆయన భిక్షేకదాబాబూ! ఆయనకాలంలో జన్మించినవాళ్ళమే యింకా కొద్దిమందిమి అక్కడక్కడ నిలిచివున్నాము. నరేంద్రపురం—మహేంద్రాద్రి తాత వినేవుంటారు బాబూ. అతనూ ఆకాలంలో పుట్టినవాడే. ఈమధ్యకాలంలోనూ పుట్టినవాళ్ళున్నారు. కాని నశించినవాళ్లే హెచ్చు. ఆకాలంలో మంచిదశలో ఉండేవాణ్ణి. పెద్దపెద్ద సేనలు, అశ్వికులు, పరివారాలు అనేకమంది నామీదుగానేవెళ్లేవారు. ఎంత సంచారమున్నా లక్ష్యముండేదా. మధ్యకాలంలో చాలా చితికిపోయాను. నన్ను చూచేదిక్కే లేక

పోయిందిబాబూ. నా దేహంలో సత్తువ్వమూ పోయింది. అయినా ఉన్న కొద్ది సంచారానికి ఎప్పుడూ నా శక్త్యానుసారమూ సేవచేసినవాణ్ణే. అయ్యా! వర్ధనులవారి కాలంలో.'

'ఏ వర్ధనుడూ?'

'హర్షవర్ధనులు' గొప్ప ప్రభువు. బహు పుణ్యాత్ముడు. యిలాగే ఓ రాత్రి పల్లకీలో కూర్చొని ఒక రాజకుమార్తె వస్తూవుంది. ముందు అశ్వముపైని రాజకుమారుడూ వెనుక పరివారికులూకూడా వస్తూవున్నారు. యిటునైపునుండి అనేక భృత్యులూ, ఆయుధములతో ఒక దొంగలనాయకుడు ఈవార్త తెలిసికాబోలు పొంచి పొంచి రాసాగినాడు. గుండె ఝల్లుమన్నది. ఎప్పుడూజరగని ఘోరము నా యెదుటనే జరుగుతుందేమో అని బహు చింత పొందాను. అయినా, నా కర్తవ్యము చేతనైనంత వరకూ చేయవలెనని నిశ్చయం చేసుకున్నాను. అప్పుడిక్కడ ఈ చాకుచెట్లులేవు. కాని అంపావతిఅని చిన్నగడ్డ ఒకటి ఈ పక్కనే పారుతూవుండేది. యిక ఆలసిస్తే ప్రమాదిస్తుందని ఘట్టి ప్రయత్నంచేసి ఈ చేరువనే యిప్పుడు ఆరోమైలురాయివుందే అక్కడ భూమిలోనికి దిగబడిపోయాను. బాగా పల్లమయ్యేవరకూకుంగిపోయినాను. అప్పుడా అంపావతి యిటుతిరిగి పెద్దవడితో నామీదుగా ప్రవహించింది. పొంచి పొంచి వస్తూవున్న దొంగలగుంపు అడ్డుగా ప్రవహిస్తూన్న ఏటినిచూచి యిక్కడ ఈ ఏరేమిటి? దారికాని తప్పిపో లేదుకదా అని సందేహపడి తొందరగా ఏటిఎగువకు వెళ్ళిపోయారు. నేనుమళ్లీ యథాప్రకారంగా నడుమును తిన్నగాచేసినాను. అంపావతి తిన్నగా దానిదారిని అది ప్రవహించింది. కాస్సేపటిలోనే రాజకుమారుడు, రాజకుమార్తె, పరివారికులూ మరేప్రమాదమూలేకుండా వారిదారినిపోయినారు. బాబూ! లేకపోతే ఎన్నడూలేనిది ఎంతమాటపడిపోదును. మీదయవల్ల ఎప్పుడూ ఎవరికీ ఈదారిని హానిజరుగలేదు. గజభటులు, అశ్వికులు, పల్లకులు, రకరకాల వాహనాలు, తమ దయవల్ల ఈమధ్య రెండుమూడు మోటారుకార్లు, అనేకము చూచినాను. యిప్పుడు ముసలివాణ్ణయిపోయినాను. అనేకవింతలు, అనేక క్రొత్తసంగతులు వింటాను. మాకాలంలో సంగతులువేరు. నిన్నకాక మొన్నపుట్టింది ఈ కదంబమ్మ, మాకాలపు కథలన్నీ చెప్పమంటుంది, అమ్మాయితోకాకపోతే ఎవరితో చెప్పుకోనుబాబూ? నన్నుపలకరించి నాకథలు వినేవాళ్లు ఈ కాలంలో ఎవరున్నారు? యిన్నాళ్ళకి మీరొకరువచ్చి దయవుంచివున్నారు, అయ్యా! యింతకాలమయిపోయింది. యింకా జీవించేవున్నాను. యింకా ఎంతకాలము వుండాలో? భగవంతుడి నిర్దేశము తప్పు

తుందా? ఎంతపటుత్వము తగ్గిపోయి ఎంతవృద్ధుడి నయిపోయినా, జీవమువున్నంత వరకూ పథికులసేవ యథావిధిగా చేయక తప్పుతుందా. యింతకూ ఆపరమాత్ముని దయ.

'ఏమి తాతా, యివాళ అంత విరక్తితో మాట్లాడుతున్నావు? చూచేవామరి! యింత కాలమువుండబట్టేకదా యిన్ని కొత్తసంగతులు యిన్ని వింతలూ చూస్తున్నావు. ముందుకి యింకా ఎన్ని వింతలు వస్తాయో' అన్నది కదంబకన్యక నవ్వుతూ.

'ఏమివింతలు, ఎంతనిచూచేది. ఎంతమంది ప్రభువులు, మహానుభావులు వెళ్ళిపోయారు. యింకా ఈదేహాన్ని అంటి ఎంతకాలంవుండేది. యింతకూ నావల్లప్రయోజనం వున్నంత వరకూ స్వామినన్ను కదలనివ్వడుకదా. యింతకాలము సేవచేసి యికమాటపడి పోతానా, పిల్లమ్మా! తమాలకన్యక నీక్షేమం అడిగింది. చెబుతానులే బాగున్నావని' 'తమాల అడిగిందే? చాలాచాలా అడిగానని చెప్పు. తాతా రేపుకూడా వస్తావా?'

'అలాగేనమ్మా. బాబూ! యిక వెళ్తాను. ఏమో ఏసంచారముంటుందో! చిత్తం. సెలవు'

రోడ్డుతాతకథవింటూ వింతస్మృతులు, వింతభావాలలో నిమగ్నుడనై ఉన్న నేను చకితుడనై లేచి, నేనూ సెలవు తీసుకున్నానో లేదో అప్పుడే మెల్లిగా చాపచుట్టుకుంటున్నట్టుగా రోడ్డుతాత పరుచుకుంటూ సాగిపోయినాడు...........

'ఏమిటి ఆలోచిస్తున్నావు? ఎంతమంచివాడనుకున్నావు రోడ్డుతాత. బడలికగావుంటే కాస్త విశ్రమించు. పెందరాళే అంపావూరు వెళ్లాలికాంసు? పడుకో. తెల్లవారకమునుపే మీద పుష్పాలు రాల్చుతాను. లేచి వెళ్ళుదువుకాని...............

ఎప్పుడు నిద్రపట్టిందో, తెల్లవారుఝామునే తెలివివచ్చింది. పక్కని కదంబపువ్వులూ; వాటి సుగంధ పరిమళమూ లేచి మూటతీసుకొని చటాలున మీదికే చూచాను. పూలతోనూ పత్రములతోనూ కదంబవృక్షము ప్రశాంతముగా వ్యాపించి వున్నది. రోడ్డువైపు చూచాను. బాగారాని వెలుగులో మళుపుతిరిగి, అంపావూరు దిక్కుగా దూరంగా చౌకుచెట్లలో మాయమవుతూంది. రాత్రి విన్నకథలు జ్ఞాపకంతెచ్చుకుంటూ నమ్రభావంతో అంపావూరు దారిని వెళ్ళిపోయాను.

# సలీం కవి

౧

నరుకంబడిన యాననముతో స్ఫురించు
గురుతింపలేని సుందర విగ్రహమును
కాసారతటిమీద గని, మానసమున
ఆశ్చర్య కోపమ్ము లావిర్భవింప
నయనాల నీరు సన్నముసుంగు తడప
మోకాళ్ళపయి రాయి మ్రోల నున్నాడు
ప్రాజ్యమ్మగు లసత్కళా జ్యోత్స్న గ్రోలు
సరసుండగు సలీం ముసల్మాను సుకవి.

౨

"నవనీతమున కోసినారు కాబోలు
ఈసన్నపని యంత! ఏమి నైపుణియొ!
సానందమగు మానసతటాక మిప్డు
ముఖహీన విగ్రహమ్మును గాంచినంత;
అయ్యో, మతోన్మత్త హంతకవ్రజము
జనులన్ మృగాలట్లు చంపుటే కాక
నరగోపన సురత్వ సత్తాక మ్మయిన
శిల్పమ్మునుం గూడ చెండాడినారు."

3

తలపోయు చీలాగు శిలముందు నుండ
వివశత్వమున భక్తుని విధిన్ సలీము
సరిగా అదే వేళ, చల్లగా నటకు
—విపరీత మిది—తాను విహరింపవచ్చి

దీనిఁ ముసల్మానుసేనాపతి యగు
నాసీము ఖాఁ చూచినా, డంతవాని
నేత్రాలు కోపాన నిప్పు గ్రక్కసవి
అధరమ్ము కంపించినది భీషణముగ.

"ఎవ డా నరుడు రాయియెదుటఁ గలాడు ?
ఇది యేమి చిత్రమ్ము! ఈలా తురుష్కు
డే చేయుచున్నవా, డిటు చేయలేరు
హిందువులును నా మహిమచేత ! కాని
కనిపించుచున్నాడు వీడ! సలీముల్లు !
అల్లా! సలీమే! దయా, వీడు నన్ను
ఎడదా, కరగిపోఁ యినుమట్టు లనుము!"

౫

కాసారమందు రక్తమహోత్పలములు
మండుచున్నవి పచ్చి కండముక్కలుగ
నిసిజాతరకు మల్లు పసరమ్ముశిరము
సరణిని గస్పట్టు సాయంతన రవి
జవిరింది విద్యుల్లతవిధాన కత్తి,
నల్ల పారిం దంతె నల్లరాతిపయి!
పడినాడు రవి, మూతపడినవి పద్మ
ములు, నల్లచీకట్లు మూసుకుపోయె...

# వలపు వేట కాదు

అన్నము తినునట్టి అలవాటులేక
పచ్చిమాంసముమీద బ్రతికేటివాడు
అగపడ్డ హరిణాల నన్నింటి గూడ
కొట్టాలనే నిప్పుకోరిక గలిగి
జవ్వనారణ్యాన రివ్వురివ్వనుచు
కూచి యమ్ములతోడ కొట్టుచున్నాడు;
తానుకూల్చినవాని తాకకుండాను
ఆటమాదిరివాడు వేటాడుచుండు—
భయమన్నదియులేదు భావమ్ములేదు—
సురలోకమునులేదు నరకమ్ములేదు.—
ఎదనూపు సొంపులెర్రిదనమ్ముగాంచి
మందహాసమ్ముతో మంటలనైన
దుముకు నితరముతోడ ధూళియైపోవు.

# మృణాళిని

అప్పుడు:

మృణాళినీ! నీచూపులు చంద్రకి
రణాలనీ, నీతో నుండు గంటలు
క్షణాలనీ, నీనవ్వులు తాప హ
రణాలనీ, నీప్రేమ మయాంతర
వనాల నీడన్, కౌగిలియందుప
మనా లనీ, నాకోరిక నీచెవి
సనాలనీ, ఉన్మాదను నే బహు
దినాల నుండికూడ,

మృణాళిని !

ఇప్పుడు:

మృణాళినీ! నాచిత్తము పావక
కణాలనే విరజిమ్మ, శోక భ
రణాలు నిద్రానిద్రలు, కోకిల
గణాల నిక్వాణాలు కఠోరము
మనాల నేను గోరను మన్మథ
గుణాళినీ ఝుంకారము నింకను
వినాలనీ, కానీ విరహేక్షువు
తినాలనీ ఉన్నాను,

మృణాళిని !

ప్రతిభ

విధాత తిప్పా గానుగలం
మనమే మనకు పీనుగులం
విషాద రసము నీడ్వగలం
చేపల్లాగున నేడ్వగలం
కానీ— ఇంకేం చేయగలం
శక్తే లేని మనం;
మనం
ఎలుకలము, కా దేనుగులం
విధాత తిప్పా గానుగులం
మనమే మనకు పీనుగులం.

ప్రాణం బంతా హాస్యముగా
మరణము కోసే సస్యముగా
క్రియల్ లేని గద్యముగా
సముద్రముపై సేద్యముగా
జ్ఞానం మనకు పూజ్యముగా
సూత్రం బర్థము, గా
ముగా,
ఇది యంతా రహస్యముగా
ప్రాణంబంతా హాస్యముగా
మరణము కోసే సస్యముగా.

△

బతుకంతా
నాటకమూ బూటకమూ
కాటకమున కిటకమూ
బతుకంతా నాటకమూ;
మనమంతా
మానిసులం బానిసలం
బానిసలకు బానిసలం
మనమంతా మానిసులం;
మనపుట్టుక
పొరపాటూ నగుబాటూ
విధి బాటలు తెరచాటూ
మనపుట్టుక పొరపాటూ;
మనకోరిక
కీడుగదా చీడగదా

నీడలతో మేడగదా
మనకోరిక కీడుకదా;
ఇవి యన్నీ
నాకేలా? ప్రియురాలా!
ఈ కీలాభర
ఇవియన్నీ నాకేలా?
జవరాలా!
కను మూసీ, నను దీసీ
నా వాసన నలిపేసీ
జవరాలా, కనుమూసీ—
అది చాలును
నాకు సుఖం, నాక సుఖం
అమిత సుఖం, సుఖం సుఖం
అది చాలును నాకు సుఖం.

"పట్టాభి"

# వచనకావ్యాలు: రచనావిధానం

వావిలాల సోమయాజులు

జనసామాన్యానికి, అంటే మన భాషాచరిత్రతోనూ సాహిత్యచరిత్రతోనూ పరిచయం లేనివాళ్ళకు, మన భాషలో వచనరచన చిన్నయసూరితోనూ, తరువాత ఆంగ్లవాఙ్మయ ప్రాభవంవల్లనూ ఉద్భవించి దినదిన ప్రవర్ధమానం అయిందని మాత్రమే తెలుసు. నిజానికి బహుకాలంనాడే పుట్టి అప్పటినుంచీ అభివృద్ధిపొందుతూ వచ్చింది. ఆంధ్రభాషకు నన్నయే ఆదికవి అనీ, అంతకుపూర్వం అజ్ఞాతయుగమని వ్యవహరిస్తున్నారు. కాని, ఆయనకు పూర్వమే వ్రాసిన లక్షణగ్రంథాలు వున్నాయట. నన్నయకు ప్రాచీనుడు దక్షిణదేశంలోని ఒక ఛందోవేత్త "యాప్పిరుంగళ్" అనే ఛందోగ్రంథాన్ని రచిస్తూ "నేను వాంచియార్ (బహుశః వంచయ్య) అనే తెలుగుకవి లక్షణగ్రంథాన్ని అనుకరించా"నని చెప్పుకుంటాడు. లక్షణగ్రంథాలు ఒకదేశానికి మార్గదర్శకమైనవి బయలుదేరిన ఆ యుగంలో కావ్యాలపేర్లయినా తెలియక కాలగర్భంలో కలిసిపోవడం వింతగా వుంది.

కావ్యావళి కరవైపోవటంవల్ల ఆ అజ్ఞాతయుగంనాటి వచనసంప్రదాయాన్ని తెలుసుకోవాలంటే మనకు శాసనాలే ముఖ్యాధారం. అవైనా క్రీ. శ. ఏడవశతాబ్దికి పూర్వంవి ఇంకా దృష్టిగోచరంకాలేదు. ఇప్పటికి లభ్యమైనవాటిల్లో ప్రాచీనమైనది తూర్పు చాళుక్యవల్లభుడైన జయసింహునిది. ఇది క్రీ. శ. 633 నాటిది. ఆ శతాబ్దిలోదే మంగిదొంగరాజు లక్ష్మీపురశాసనం (క్రీ. శ. 675) పశ్చిమచాళుక్య విక్రమాదిత్యుని (క్రీ. శ. 655-680) ధర్మవరం శాసనంకూడా ఒకటి వుంది. ఇక ఎనిమిదవశతాబ్దికి వస్తే అహదనకరశాసనం కనిపిస్తుంది. తొమ్మిదవ శతాబ్దిలో గుణగ విజయాదిత్యుని (క్రీ. శ. 854-897) ధర్మవరము శాసనము, అద్దంకి శాసనము కనిపిస్తాయి. పదోశతాబ్దిలో వచనంలో వున్న ప్రత్యేకశాసనాలు కనుపించలేదు. గ్రామచిహ్నాలను సూచించటానికి వచనం వాడేవారు, శాసనమంతా సంస్కృతంలో వుంటే.

అజ్ఞాతయుగంలో వచనరచనా విధానాన్ని తెలుసుకోటానికి దిఙ్మాత్రోదాహరణాలు. "...సకలలోకాశ్రయ జయసింఘవల్లభమహారాజులాకున్ ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరంబుళ్ ఎణుంబొది అన్నెణ్టి అమ్మఃపూర్ణమ నాణ్డుం వ్లావిండిరాజుల

ముట్లు (రాజోద్యోగి) కలివిముడిరాజుల్ న్లావిండి సముద్రికై (సముద్ధరణాకై) నాకు బణిసేసిన......''

జయసింహావల్లభుని శాసనము.

''...మగిదొరజుల ముడ్లు విట్రిజుల పత్రిమరాజ్యంబున కడువం[డ్లు]ల ఇచ్చిన రెణ్డువటి మిరియమ్బు బోళజకు తెంగిరి పెడళిన రెణ్డువట్టి పదేన్డుంబు అడ్లుపట్టు దుర్గాదేవి నేలయు ఉఱువుటురి బోళరెన్డుటి ఒచువరుకిళిరేని బారణాసి వేగవిళాలు వేడ్లుము.

లక్ష్మీపుర శాసనము.

''......పరమేశ్వర భటారకున్ విజయరాజ్య సంవత్సరంబుళ్ ఇరుభదివెణ్డు అగునేటి కజుళు కోణిన్......ఇచ్చిరి దేని ఱచ్చువాన్లు''

విక్రమాదిత్యుని శాసనము.

ఎనిమిదవ శతాబ్ది శాసనభాగం కొంత. ''స్వస్తిశ్రీ బణ్డయూరు దెన్నిల్పిరి ఇపలుఱసి రాజగొణిన ఇన్దు ఱునకమ్బునకు''

అహదనకర శాసనంలోనుంచీ కొంత వచనభాగం.

''పృథివి వల్లవ పట్టనబున ఊరివారు సిరిగళ్ళ వడవరికి ఊరిస్వాముల్ ఇచ్చిన స్తితి రెణ్డువాడల పట్టనావురకు......సర్వ్వ బాదపరియూరువు ఊరు దాయసెసి (పంచి) ఇచ్చి దినికి వక్రింబు లెదు.''

తొమ్మిదో శతాబ్దికి వస్తే ఈ విధంగా వ్రాసేవారు.

''పాణ్డురంగు పరమ మాహేశ్వరుణ్డు ఆదిత్య భటారసికి ఇచ్చిన ఎనుబది వుట్ల అడ్లు పట్టునేల దమ్మపురంబున దమ్మవులు [విని] రక్షిఇచ్చిన వారికి అశ్వమెదంబున పలంబు అగు'' (అద్దంకిశాసనము.)

ధర్మవరపు శాసనము

''ఈస్వరున[కుం] గార్త్తికేయుండుంబోలె చౌవష్టికల విసారదు [ణ్డ] య్న అయ్యపయ్యము సకలశాస్త్రార్థ్ధ పారగులయ్న పెద పణ్డరంగులు అయ్యము పగ్గెడలుం గర [వ] మ్మన పణ్డరంగును ఈ ధమ్మ [నివ్వహ] నోద్యోగమ్మనకు''

పదో శతాబ్దానికి వస్తే తెలుగువచనం కేవలం గ్రామచిహ్నాలు తెలియజేయటానికి విరివిగా ఉపయోగించారు. కేవలం వచనంలోవున్న శాసనాలు ధర్మవరశాసనంలోని వచనాన్నే అనుసరించి వుంటవి.

ఈ అజ్ఞాతయుగంలో వున్న ప్రత్యేకత. ఉచ్చారణానుసరణంగా వ్రాయటం ముఖ్యమైంది. 'పృథివి' శబ్దము "ప్రిథివి" అని వుచ్చరించేవాళ్లు కాబట్టి ఆ విధంగానే వ్రాశారు. ప్రథమావిభక్తి ప్రత్యయాలు హలంతాలుగానే వున్నాయి. ధర్మ, పూర్ణిను, దుర్గ పదములు దమ్మ, పుణ్ణ, దుగ్గ, అని వికృతులుగా వ్రాయబడ్డాయి. ణ, న, స, శ, ష; ల, ళ లకు అభేదం కనిపిస్తుంది. విసంధిగా వ్రాయటము, ప్రథమ తరువాత గ, స, డ, దవాదేశ నిత్యత, కనిపిస్తవి.

అహదనకర శాసనంలోని "ఊరుదాయనేసియిచ్చి" అనేవాక్యంలో అసమాపకక్రియ సమాపకక్రియగానే ఉపయోగించారు. ఈఆచారం మళయాళ భాషలో ఇంకావుంది. ప్రథమావిభక్తి ప్రత్యయాలల్లో 'లు' కు బదులు 'ళ్' (సంవత్సరంబుళ్, ఊరిస్వాముళ్, భటారళ్, కొన్మ్రికళ్ మొదలైన పదాలల్లో) కారము 'ము' వర్ణానికి బదులుగా పూర్ణానుస్వారం లేకుండావున్న 'బు' (పట్టనబు, దశపరాఘబు) కనిపిస్తవి. ఆ యుగంలోని వచనంలో ప్రస్తుతం మనము అర్ధానుస్వారము పూర్ణానుస్వారము ఉపయోగించేచోట అనునాసికాక్షరం ప్రయోగించటం కనిపిస్తుంది. సాక్షులు అని వ్రాయటానికి 'సాక్షిమంతు'లని కాశ్యప గోత్రుడైన రేవణశర్మ అని చెప్పటానికి రేవణశర్మ కాశ్యప గోత్రజుడనీ వ్రాయటం కనిపిస్తుంది. అన్నెంటి (అను+ఏడు+న్టి) మొదలైన విశిష్ట ప్రయోగాలు కనిపిస్తాయి. 'పొలము' అనే పదానికి 'పులొంబు' అనేది ప్రాచీన రూపంగా కనిపిస్తుంది. అంటే ఆ పదంతరువాత వర్ణవ్యత్యయాన్ని (Metathesis) పొందుతుందన్నమాట. ఈ యుగంలో వచనరచనలోనూ పద్యరచనలోనూ ఒకవింత అక్షరంకనిపిస్తుంది అది " ( లేక ψ). చోఱు, మాఱు, ఱుమినకం పునకు, ఱచ్చువాన్రు మొదలైన శబ్దాలల్లో ఈ అక్షరం కనిపిస్తుంది. ఇది తరువాత 'ళ' కారంగాను 'డ' కారంగాను మారుతుంది. దీని ఉచ్చారణము ఫ్రెంచిభాషలోని J వర్ణోచ్చారణాన్ని అనుసరించి వుంటుంది. గుణగవిజయాదిత్యుని ధర్మవరం శాసనంలోని భాష వచనసంప్రదాయము నన్నయనాటికి కొద్ది మార్పు పొందినవి.

మనదేశంలో అనాదికాలంనుంచీ శాసనాలు గద్యపద్యాత్మకంగా వ్రాయటం అలవాటు. అంతే కాకుండా సంస్కృతంలో త్రివిక్రమభట్టు ఎనిమిదో శతాబ్దిలోనే దమయంతీకథ చంపువుగా వ్రాశాడు. ఈ చంపూమార్గాన్ని అనుసరించే నన్నయభట్టు మహాభారతం రచించాడు. అతనివచనం పద్యాలమాదిరిగానే ఎంతో హాయిదాతో నడుస్తుంది. నన్నయ వచనంలో సంస్కృతంపాలు ఎక్కువ. ఏవచనంలోకూడా ఆయన రసోచితంగా

ఆరోహణావరోహణ చూపిస్తాడు. నన్నయ వచన సంప్రదాయానికి ఒక ఉదాహరణం:

"శకుంతలకాంతయు సంతోషంబుగా దానికి కోరినవరం బిచ్చి గాంధర్వవివాహంబున నభిమతసుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్నుం దోడ్కొనితేర నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహామునివాలికిం బుత్తెంచెద." ఈవచనంలో శబ్దాలు కటువుగా కాకుండా సున్నితంగా అంగలమీద నుర్రించుకుంటూ వుండే హాయి చూపిస్తూ రచించాడు.

నన్నయతరువాత కొద్దికాలానికే ప్రత్యేక గద్యకృతులు పుట్టినట్లు కనిపిస్తుంది. 12వ శతాబ్ది మధ్యభాగంలోని పాల్కురికి సోమనాథుడు నాటికాలానికె గద్య ప్రబంధాలు విరివియై సంస్కృతపద బాహుళ్యంవల్ల జనసామాన్యానికి రుచింపకపోయాయని పండితారాధ్యచరిత్రలో—

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వ సామాన్యంబు గామి
జాను తెనుంగు విశేషము ప్రసన్నతకు"

అనీ, బసవ పురాణంలో

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట" అని

చెప్పినాడు. కాబట్టి 12వ శతాబ్దికే గద్యకృతులు అనేకం రచించినారనీ, అవి కృతకశైలిలో ఉండటంవల్ల ప్రజాదరణం కోల్పోయాయనీ తెలుస్తూవుంది. పన్నెండో శతాబ్దిలో శైవకవులు కన్నడంలో మణిప్రవాళ శైలి వదలివేసి సులభ శైలిలో అనేకవచనకావ్యాలు రచించారు మన తెలుగుదేశంలో ఆనాటి శైవకవులు వచన గ్రంథాలు వ్రాసేవుంటారు మన భాషలో. అవి జాను తెనుగులోనే వుండి వుంటాయి. ఆ కారణంవల్లనే తిక్కనశైలి జాను తెనుగు కావలసివచ్చింది. తిక్కన వచనంలో జాతీయత బాగా కనుపించటానికి కారణంకూడా అదే.

తిక్కన వచనం దేశీయ పదాలతో కొద్ది సంస్కృతం మేళవించి వ్రాశాడు. ఉదాహరణం.

"ఏము కలహం బొల్లక పొందుగోరుట తనకు మేలు. తన మనంబున దరికొను తృష్ణానలం బార్ప నోరు లడ్డంబు సారమింజేసి యేన బుద్ధిసెప్పవలసివచ్చె. తనయొద్దం గల యోధవరు లెయ్యెడలలేమిం దెల్లంబయినను మాకుం జేవోదు ధర్మంబుగల దది యునుంగాక యఖిలలోకసేవితుండైన శ్రీకృష్ణుండు పెనుబ్రాపుగావున మమ్ము..." నన్నయకొద్దిగా వెనుకపుట్టినా ప్రత్యేక వచనకావ్యాలు రెండు శతాబ్దులవి దొరకడంలేదు. ఇందుకు పద్యకావ్యాలమీద వున్న ప్రేమ గద్యకావ్యాలమీద మొదటి కవులకు లేకపోవటమూ, వీరశైవులు మొదలుపెట్టిన వచనరచన మతవైషమ్యాల వల్ల రూపుమాసేటట్లు కూడా చేసివుండడం బహుశః కారణాలు అయి వుంటాయి. ప్రస్తుతముదొరికే ప్రాచీన ప్రత్యేక వచనరచనలో మొదటిది ప్రతాపరుద్రచరిత్ర. కృతికర్త ఏకామ్రనాథుడు ఈ కవి కాకతీయప్రతాపుని ఆస్థానకవి అని స్థానికచరిత్రలనుబట్టి తెలుస్తూవుంది. ఈ వచనగ్రంథంలో చంపూకావ్యాలలోని వచనానికి మాదిరిగానే కావ్యావసానం వుండదు. వ్యావహారిక భాషాప్రయోగాలూ, వ్యాకరణ విరుద్ధభాషా వాడుతాడు. ఉదాహరణం: "ఇక్కడ ఏకశిలానగరంబుననున్న పారశీ రాజు మృతిబొందిన అతనితమ్ముడు జవానులుకు ఫకీరువేషంబున ఏకశిలానగరంబునజొచ్చి పురంబులంత తన సాధ్యంబుగాకుండజేసి తన అన్న సతీ సుతులకున్నూ తాను యెరుకసేసి వారిని ఫకీరువేషంబున పురంబు వెడలదీసుకొని తన రాజ్యంబునకు వచ్చి వాండ్లనునిచి" ఈవచనభాగంలో వ్యావహారికప్రయోగాలు విరివిగానేవున్నాయి. గ్రంథంఅంతా వ్యావహారికభాషలోనే వ్రాస్తే కాలాంతరాలవల్ల కృతకభాషగా మారిపోయినట్లుకూడా కనిపిస్తుంది. తరువాత శ్రీనాథ కవి సమకాలికుడు, తాళ్ళపాక అన్నమాచార్యులు, సంకీర్తనలక్షణం వచనంగా వ్రాస్తే దానిని అతని మనమడు ద్విపదగా చేశాడట. రాయవాచకంలో వీరనృసింహరాయల దినచర్యను గురించి వ్రాస్తూ స్థానాపతి, "విద్యానగరమందు వీరనృసింహరాయల వారు బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యులు నామావళులున్నూ, అధ్యాత్మసంకీర్తనములున్నూ, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షము, భారతసావిత్రి, దధివామనస్తోత్రము......ఇవిన్ని, మొదలైన నీతివైరాగ్య శతకం పురాణ శ్రవణమున్నూ" ఈ విధంగా వ్రాశాడు. ఇందులో భారతసావిత్రి తెలుగు వచనకావ్యం. ఈ కావ్యాన్ని ఎల్లకర నృసింహకవి తాను వ్రాశానని మార్కండేయ పురాణంలోని "ప్రచురవాక్యములచే రచించితివి కవిరాజు లౌనసంగ" అనే పాదంలో చెప్పుకున్నాడు. ఆ వీరనృసింహరాయలు చెన్నశౌరి అనే కవిని పోషించాడు. నృసింహ

పురాణంలో ఈ చిన్నన్నే ఆంధ్రభాషలో వచనకావ్యంగా బాలభారతం రచించా డని "బాలభారత మంధ్రభాషను రచించె కవీశ్వరులు మెచ్చ" అనే పాదంవల్ల తెలుస్తూవున్నది. ప్రబంధయుగానికి పూర్వమే ఎన్నో కావ్యాలు ఆంధ్రభాషలో రచితమై నశించాయి అన్నమాట. కృష్ణరాయలు రాజ్యానికి వచ్చాడు. కవులదృష్టి మళ్లా పద్యకావ్యరచనమీదికి పోయింది కొంతకాలం. క్రీ. శ 1559 లో విశ్వనాథ నాయకుడు మధురలో స్వతంత్రపరిపాలనం సాగించినాడు. అతని సేనాపతి 'రాయ వాచకం' వచనంగా రచించినాడు. ఈ వచన గ్రంథమే కుమారధూర్జటి కృష్ణ రాయ విజయానికి మాతృక అయింది. ఇందులో వచనం వ్యావహారికభాషలోనే వుంటుంది. చూడండి. "పట్టణములోగల అష్టాదశ వర్ణాలవారును అత్యంత సంతోష పరులై అతివైభవములతోడను నిత్యకళ్యాణములున్ను పచ్చతోరణములున్ను కలిగియున్నారని విన్నపం వ్రాయంగా దళనాయకులు విని రాయలవారికి విన్నపం చేశారు. అపిమ్మట విఠ్ఠల విరూపాక్షస్వామి ధ్వజారోహణమైవున్నది. రథోత్సవమునకు విజయం చేయవలెను; అని విన్నపం వ్రాయంగ దగ్గిర వున్న దళనాయకులు అతీకున్నే రాయలవారు విచ్చేసివున్నారు" ఈ విధంగా వాక్యావసానం లేకుండా వుంటుంది. పదిహేడు పద్దెనిమిది శతాబ్దాలలో దక్షిణదేశంలో వచనరచన విరివిగా జరుగుతుంది. ఈ రెండు శతాబ్దాల కాలంలోనూ వచనరచన అంతా వ్యావహారిక భాషలోనే నడిచింది. వచనసాహిత్యాన్ని పోషించిన వాళ్లలో ముఖ్యులు మధురనాయకులు. మధురచొక్కనాథుడు (క్రీ. శ. 1660-1682) తిరుకామకవిని పోషించాడు. అతను శృంగార సత్యభామా నాటకము, రుక్మిణీపరిణయము, అనే పద్యకావ్యాలు రచించాడు. అతనే ధేనుకామాహాత్మ్యమనే వచనకావ్యాన్ని తేటమాటల్లో రచించాడు. మధురనాయకరాజ్యాన్ని పరిపాలించిన విజయరంగ చొక్కనాథుడు (క్రీ.శ. 1704-31) మాఘమాహాత్మ్యమూ, శ్రీరంగ మాహాత్మ్యమూ అనే రెండు వచన కావ్యాలు కూర్చాడు. ఇతని సేనానాయకుడే సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు. ఇతడు 1710 ప్రాంతంలో జైమినిభారతము, సారంగధరచరిత్రము అనే రెండువచనకావ్యాలు రచించాడు విజయరంగని ఆస్థానంలో వెలగపూడి కృష్ణయ్యకవి వుండేవాడు. అతడు తన భానుమద్విజయ కావ్యంలో "సన్నుత వేదాంత సారసంగ్రహ శాస్త్ర మమరంగ వచనకావ్యంబొనర్చి" అనేపాదంలో వేదాంత సంగ్రహము వచనంలో రచించినట్టు చెప్పినాడు. ఈ రాజన్యుని కాలంలోనే శ్యామరాయకవి యథావాల్మీకిరామాయణము వచనంగా కృతిచేశాడు. ఇతడు విద్వత్కవి. 'సంస్కృతాంధ్రభాషా కవితా

నిర్వాహకుడు. ఈ వచన రామాయణాన్ని సవరసాలంకారంగా తెనిగించాడు. ఈ కవిమిత్రుడు వెంకటసుబ్బయ్య కవికూడా రామాయణ వచనకావ్యం రచించాడు. పులిపాక రామన్న వచన రామాయణం, శ్రీరంగమాహాత్మ్యమూ, ఇంతకంటే చాలా పూర్వంవి. ఈ కాలంలోనే శ్రీపతి రామభద్రకవి తెలుగు వచనకావ్యంగా స్కాంద పురాణాంతర్గత హాలాస్యమాహాత్మ్యాన్ని కూర్చాడు. చొక్కనాథుని దళవాయి, తుపాకుల అనంతభూపాలుడు తెలుగువచనంగా రామాయణాన్ని, భారతాన్ని, భాగవతాన్ని విష్ణుపురాణాన్ని కృతులుగాచేశాడు. పుష్పగిరి తిమ్మన వచనభాగవతం తెలుగు వచన కావ్యంగా ఈ కాలంలోనే కూర్చింది. తంజావూరు మహారాష్ట్రనాయకుల కాలంలో పేరుపొందిన 'అభినవకాళిదాసు' ఆలూరి కుప్పన వచనరచనలు చాలాచేశాడన్నాడు. మైసూరు చిక్కదేవరాయలు (క్రీ. శ. 1672—1704) దళవాయి కళువె వీరరాజు, అతని కుమారుడు నంజరాజు తెలుగులో వచననిర్మాతలు. వీరరాజు క్రీ. శ. 1680లో తన భారతాన్ని పూర్తిచేసినాడు. నంజరాజు వచనంగా కూర్చిన విష్ణుభక్తవిలాసము, కాశీమహిమదర్పణము, గరళపురీమాహాత్మ్యము, పేరుపొందినవే. వెంకటగిరి ప్రభువు వెలుగోటి యాచమనాయకుడు వేదాంత గ్రంథాలు అనేకం వ్యావహారిక భాషలో రచించాడు. గోపీనాథకవి ఓఢ్రభాషలోనుంచి రామాయణాన్ని తెలుగులో వచనంగా వ్రాసినాడు. 17,18 శతాబ్దులలోని భాషకు ఉదాహరణంగా కొన్ని వచనభాగములు:

"తదనంతరంబ్బ వసిష్ఠమహామునీంద్రుండు దిలీపమహారాజునుంజూచి మృగశృంగమహామునీంద్రుండు సలక్షణంబుగా అఖిలవేదంబులం జదివించి బ్రహ్మచర్యవ్రతంబ్బ నెరవేర్చి"

విజయరంగని మాఘమాహాత్మ్యము.

"చతుర్ముఖుండు ఆ దేవదేవు నుద్దేశించి స్వామీ నీవు నాయందు ప్రసన్నుండవగుట నిక్కంబేని నీ నిజరూపంబు నేటివరిలో ఒక్కనాడేనియు దివ్యకళ్యాణ విగ్రహంబు గాన శాయనైతివి"

శ్రీరంగమాహాత్మ్యము

ఈ రెండు శతాబ్దులలోని వచన రచనావిధానంలో వింతగానే వుంటుంది. ద్రుత ప్రకృతికసంధి, కావలసినచోట చేసేవారు; లేనిచోట లేదు. విసంధిగా వ్రాసేవారు. యడాగమము గిట్టను. ప్రథమావిభక్తి ప్రత్యయాలను తపంబ్బు, మనస్సు, కొండ్డంబ్బు

లలో మాదిరిగా ద్విత్వమొనర్చడం వుంది. ఉత్తుకు అచ్చుపరమైతే సంధిచేస్తే చేసే వాళ్లు. లేకపోతే వ్యవహారం దొర్లినట్లుగానే వ్రాసేవారు. పదాలమీద ఊత (accent) కనిపిస్తుంది, విన్నవించేశారు; కాయంగల మొదలైన పదాల్లో. ప్రథమ మీద గ, స, డ, వ వాదేశం విరివిగా కనిపిస్తుంది. దీర్ఘాలమీద నిండుసున్న ప్రయోగించేవాళ్ళు-వాండు, మూండుసు, వేండ, శబ్దాల్లో. ఆ శబ్దాలు వ్రాసేటప్పుడు తరువాత హలు మూండుష్ట, వేండ్ర, నాండ్రు మాదిరిగా ద్విత్వంచేసేవాళ్ళు. 'ఉ' కార 'ఒ' కారాలకు 'వ' కారం విరివిగా వాడేవాళ్ళు చేస్తే, వస్తే మొదలైన ప్రయోగాలు విరివిగావున్నాయి. వ, వలకు, 'ఋ' 'ఋ'లకు భేదంలేదు. ఉచ్చారణానుసారంగావ్రాసే వారు. బ్రహ్మకుదాన్ని 'బ్రహ్మ' అని ప్రయోగించేవాళ్ళు.

ఈ 17, 18 శతాబ్దులలో యక్షగాన నాటక వాఙ్మయం ఎంతో అభివృద్ధిపొందింది. ఆ నాటకాల్లో వచనం ప్రయోగించేవాళ్ళు. ఆ వచనంకూడా వ్యావహారిక భాష లోనే వుంటుంది. చూడండి కొన్ని ఉదాహరణాలు:

"అయ్యా! యీ సభలోయుండు రాజాధిరాజులారా! ఈ నకుని పరమ వేశ్యలవలె మంత్రి తంత్రి ఇంద్రజాలముచేసే తంటకరుసి కండలు తుండెలుతుండెలుగా కోసి కాకులకు గెద్దలకు వెయ్యకపోతే నేను సహదేవుడనుగాను."

మహాభారతవిలాస నాటకము

"రాజరాజనరేంద్రుని సుతుండైన సారంగధరుడు యెటువంటివాడో చూడవలెనని నిండా ఆపేక్షగలిగివుంటివి గనుక నేటిదినం చెలికాండ్లతోకూడా రాజవీధిని ఆటలాడుతూ వున్నాడు చూతువు మేడమీదికిరావమ్మా చిత్రాంగిదేవి...... కానరాని మేడిపువ్వము లయినా వెదికి కానవచ్చును. తెల్లటి కాకినైనా వెదకి కానవచ్చును. నీళ్ళలోవుండే చాపల అడుగులనైనా వెదకి కానవచ్చును. స్త్రీలహృదయం కనగూడదనునీతి కలదు. కాన నీవు రాజులేనిసమయమున మీ పినతల్లియైన చిత్రాంగి నగరికి పోకూడదోయి సారంగధరా."

సిద్ధకవి సారంగధర నాటకము

19 వ శతాబ్ది ప్రథమభాగంలో వచనరచన అంతా వ్యావహారిక భాషలోనే జరిగింది. కథావాఙ్మయమూ, శాస్త్రగ్రంథాలు, టీకాగ్రంథాలుకూడా ఈ భాషలోనే ఉన్నవి. సాందీప్రసుదార ఈ శతాబ్ద ప్రథమభాగంలో పైడిపాటి పాపయ్యా

కవికి ప్రోత్సాహం ఇచ్చి ద్విపద రామాయణాన్ని వచనకావ్యంగా వ్రాయించినాడు. ఈ కవి రచనావిధానానికి ఒక ఉదాహృతి:

"అంతట ఋష్యమూక పర్వతాంన్ని కనుగొని వోయీ జనకజా! యీ ఋష్యమూక పర్వతమంద్దు సుగ్రీవునికి నాంకున్నూ సఖ్యమైనది నిన్ను రావణుడు లంకకు యెత్తుక పొయ్యేటప్పుడు నీ వంట్టి సొమ్ములన్నియు తీసి యీ ఋష్యమూక పర్వతమంద్దు వడవేశిపోగా యీ సుగ్రీవుడు నీయొక్క సొమ్ములంన్నియు పదిలంచేసి వుంచి నాచేతికి తీసుకవచ్చి యిచ్చినచోటు కనుగొంట్టివా. చూస్తివా యీ యొక్క సరోవరం వో సుదతీ నల్లకలువల చాతనున్నూ మంచి నిర్మలోదకం చాతను వొప్పుచున్నది. తుంమ్మెదలు ఝుంకారంలు చేస్తూంన్ను తామరకొలనుంన్ను వ్రాలి మధుపానం చేస్తున్న రెక్కలు విసరుతూ యెగుస్తూవ్వున్నవి." బ్రౌనుదొర వ్యావహారిక భాషలో అనేక వచనాలు వ్రాయటమే కాకుండా రావిపాటి గురుమూర్తి శాస్త్రికి, జూలూరి అప్పయ్యపంతులకు ప్రోత్సాహం ఇస్తే వ్యావహారిక భాషలోనే టీకలు, ఉదాహరణ గ్రంధాలు, కొన్ని శాస్త్రగ్రంధాలు రచించారు. గురుమూర్తి శాస్త్రి వ్యావహారిక భాషలో బాలురఉపయోగార్థం వ్యాకరణం రచించాడు. చిన్నయసూరి బాలవ్యాకరణానికి పూర్వం బడుల్లో అదే వుండేది. ఈ శతాబ్దిలో యాదవాచార్యులు, గజేంద్రుడు మొదలైన కవులు వచనరచన చేశారు. యాదవాచార్యుడు ప్రహ్లాదయక్షగానం కూడా చేశాడు. ఈశతాబ్దిలోనే వచనంలో కధావాఙ్మయం పుట్టింది. ద్వాత్రింశత్సాల భంజికలకథలు, విక్రమార్కునికథలు, రామలింగనికథలు, శుకసప్తతికథలు, పంచతంత్రికథలు, మర్యాదరామన్నకథలు, పరమానందాయ శిష్యులకథలు, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ ఇటువంటివి ఇంకా యెన్నో వాడుకభాషలో వ్రాశారు. ఈ కథాసారస్వతంలో భాష జీవద్భాష. ఉదాహరణంగా కాంభోజరాజుకథలోనుంచి కొంతభాగం చూడండి:

"ఎందునిమిత్తము పాపాత్ముడైనాడంటే యేడుగురు భార్యలను వివాహం చేసుకున్నాడు. ఏడోభార్య మాణిక్యాలదేవిని పూర్వాపరముల విచారణ చేయకుండా ఘోరమైన అరణ్యంలో... ప్రాణాలు తీసినాడు గనుక ఆ స్త్రీహత్యగొట్టి రాజుగారికి ఘోరమైన వ్రణము లేచియున్నది. ఆ వ్రణము మాన్పేటటువంటివారు లేరురా తండ్రీ. ఒక పాపాత్ముడగు వైద్యుడు వచ్చి ఆ వ్రణమునకు ఏమి ఔషధము చెప్పినాడనగా..." ఈ కథావాఙ్మయంలో భాష ముఖ్యంగా కొన్ని కథలల్లో

ఎంతో అందంగా వుంటుంది. ఈ కథలల్లో మధ్యమధ్యా పదవాఙ్మయం కూడా వుంటుంది. ఉదాహరణంగా గాంధారి కథలో కొంతభాగం చూపిస్తాను.

"కాకరచెట్టులో బూచి వున్నదని సోయింత రాజుతో గాంధారి చెపుతూ వున్నది. వాడు కొట్టుతానని కత్తి తీసుకొని చక్కావస్తాడు. అవతలా ఇవతలా చూస్తాడు. ఎక్కడ చూచినా ఏమీ లేకపోతుంది. ఆకోపంచేత బాకు బండకువేసి పొడుస్తాడు. ఫెళ్ళున విరిగిపోతుంది. అది విరిగిపోంగానే అట్టే గోతిలోనుంచి దిగ్గున లేచి పోయి సోయింతరాజును పట్టుకొని ఆగోతిలో పడవేసి పైన యీ బండవేసి అట్టే అణగ దొక్కి పోదామని ఉపాయం చేసుకున్నాడు సుందరగిరిరాజు. గాంధారిచూచి పాడు తుంది ఎటువలెను—పదం:

అధనాథుడా రావె తుమ్మెదా
అల్లతడు వ్రాకిపోయె తుమ్మెదా
నావద్ద యెవరూ లేరు తుమ్మెదా
వచ్చి వాలాడిపోవె తుమ్మెదా
చెట్టువేసీ పాయె తుమ్మెదా
వో కావిలెవ్వరు లేరు తుమ్మెదా
రాతిక్రిందా వున్న తుమ్మెదా
నీనత్తి బయ్యదింపె తుమ్మెదా
కాసలిచ్చినాను తుమ్మెదా
బలిపీఠ గోట్యాను తుమ్మెదా."

అని పాడుతుంది ఎంతో అందంగా. వచనంలోవున్న ఆనాటికథా వాఙ్మయం అంతా ఎంతో వుత్సాహవంతంగా వుంటుంది. ఇటువంటి వాఙ్మయం నిరాదరణంవల్ల చాలా నశించింది. క్రీ. శ. 1800 మొదలు 1850 లోపుగా జరిగిన శాస్త్రరచన నాట్య శాస్త్రము, వైద్యము, కామకళ అన్నీకూడా వ్యావహారిక భాషలోనే రచించారు. అల్లూరి పురుషోత్తమకవి రచించిన కామశాస్త్రంలోనుంచీ ఆనాటి శాస్త్రరచనా వైఖరికి ఉదాహరణం చూపిస్తాను. "పద్మిని కుందనపు బంగారువలెగాని నల్లకలువల వలెగాని కాంతిగలిగి తామరపద్మములవంటి సువాసనగల శరీరము నెమిలిపింఛము వంటి నల్లనిజుత్తూ చంద్రునివంటి ముఖము కలువలవంటి కళ్ళూ సంపెగ రేకులవంటి ముక్కూ మదపుటేనుగవంటి నడకయున్నూ."

ఈ కవికన్నా ఇతర శాస్త్రకవుల జ్యోతిషం ముఖ్యంగా జీవద్భాషలో వుంటుంది. ఈ కాలములోనే వచనం ఏవిధంగా వ్రాయాలనే సందిగ్ధతవచ్చి, మాట్లాడే భాషలో వ్రాయటం మంచిదని వాళ్ళు అనుకున్నట్లున్నారు. అసలు పూర్వంనుంచీ వ్యవహార భాషలో వుంటే అటువంటి సందేహం ఎందుకు పుట్టిందనుకోవచ్చు. కొంతమంది కావ్యాలల్లో వచనాన్నీ వచనకావ్యాలల్లోని వచనాన్నీ మిళాయించేసి కృతకభాష తయారుచెయ్యటంవల్ల వచ్చింది. ఆ సమస్య వచ్చినప్పుడు వాళ్ళుచేసుకున్న నియమం ఏవిధంగా కనిపిస్తుందంటే ఎవరైనా ఛాందస బ్రాహ్మణుడుంటే ఆయనకూడా తాను మాట్లాడేటట్లే వ్రాయాలని అనుకున్నట్లుగా తోస్తుంది. ఉదాహరణం చూపిస్తాను. మృగయాత్రను వివరిస్తూ ఒక ఛాందసుడు:

"ఆ మృగయాత్ర లక్షణం యెట్లువంటిదంటేను విల్లుధరించిన వాళ్లున్ను కొందరున్నూ కత్తులను ధరించినవాళ్లున్ను కొందరున్నూ యుద్ధముఖ్యులైన వీరభటులు కొందరున్నూ యీ ప్రకారమైనట్టువంటి మహాపరిజనం కలవారై కుంచున్నూ మరిన్ని గీతావాద్యములతో కూడుకుంచున్న వాడై కుంచున్నూ మరిన్ని విల్లు బాణ చక్ర అసిగదాకుంతలు యివి మొదలుగాగలట్టువంటి ఆయుధాలచాతనున్నూ" అని యీవిధంగా వర్ణించాడు.

క్రీ. శ. 1850 తరవాత బాగా ఆంగ్లవాఙ్మయ ప్రాబల్యం మనభాషమీదికి వచ్చింది. క్రీ. శ. 1852 లో చిన్నయసూరి నీతిచంద్రిక వచనకావ్యంగా రచించాడు. క్రీ. శ. 1853లో మొదటికూర్పు సూరి జీవించివుండగానే ముద్రితంఅయింది. ఆ గ్రంథానికీ మనకు ప్రస్తుతం ఉపలబ్ధమయ్యే గ్రంథానికీ చాలా వ్యత్యాసం వుంది.

కృత్రిమ భాషాప్రాభవం మిగతా పండితులందరికీ అబ్బింది.

ఆ మార్గానుసారులే ముద్రణయంత్రాలయాలలో పరిష్కర్తలుగా ఉండడంవల్ల టీకా గ్రంథాలూ, కావ్యాలలో వున్న వాడుకభాషలోని ప్రయోగాలూ మార్చి గ్రంథ ముద్రించేశారు. చిన్నయసూరి ఏర్పరచిన కృత్రిమ సాంప్రదాయమే కొంత కాలం వచనరచనకు మార్గ మయింది. వీరేశలింగం పంతులు అక్కడక్కడ విసంధి గాను కొద్ది వ్యావహారిక భాషాప్రయోగాలతోను సంధి విగ్రహాలు వ్రాసినాడు. ఈ పందొమ్మిదో శతాబ్ది చివరభాగంలో పత్రికా నిర్వహణం వచన వాఙ్మయానికి గొప్ప దోహదం ఇచ్చింది. కల్పలత పత్రికకు పూర్వమే శ్రీ యక్షిణి, తత్త్వ బోధిని, వర్తమానతరంగిణి, సుజనరంజని, గోదావరీ, విద్యాప్రబోధిని, ఆంధ్ర

భాషాసంజీవిని, పురుషార్థ ప్రదాయిని, దినవర్తమాని, వ్యవహార తరంగిణి, హితవాది, సుధీరంజని, స్వధర్మప్రకాశిక, సకల విద్యాప్రబోధిని, బ్రహ్మాండరంజని, లోకరంజని, వివేకవర్ధని, జనవినోదిని, స్వదేశిని, మందారమంజరి, ప్రబంధకల్పవల్లి, ఆంధ్రప్రకాశిక, రాజయోగి, కళానిధి, హాస్యవర్ధని, సత్యసంవర్ధని, చింతామణి, ధీరంజని, కల్పలత మొదలైన పత్రిక లన్నీ వచనరచనకు తోడ్పడ్డాయి. ఈ పత్రికలవల్ల వ్యాసం అనే నూతనకావ్య భాగం తెలుగువచనంలో వచ్చిచేరింది. క్రీ.శ. 1872 నాటినుంచీ నాటక వాఙ్మయం బయలుదేరి వచన రచనాభివృద్ధికి పనిచేసింది. వీరేశలింగంపంతులు వచనంలో ప్రత్యేకత వున్న నవలా సాహిత్యాన్ని మన దేశంలోకి తెచ్చినాడు.

లోకరంజని పత్రికలోవుండే విషయాలను గురించి వ్రాస్తూ సంపాదకులు, "ఈ పత్రికలో నవరసములైన కథలుకూడా వుంటా"యని వ్రాశారు. కథావాఙ్మయం అందులో ప్రత్యేకంగా కథానికా సారస్వతం (చిన్నకథ) సాటిలేకుండా అభివృద్ధి పొందుతుంది ఈ శతాబ్దిలో. జీవితచరిత్రలు ఆత్మకథలుకూడా వచనరచనలో ప్రత్యేకతను సంపాదిస్తూ ఆవైఖరిని తెలుగులోకి తెచ్చినవాళ్ళను జీవన్మృతులను చేస్తూ వున్నాయి.

చిన్నయసూరి తెచ్చిన కృత్రిమ భాషారచన-చాలాకాలం వచనరచనకు ఒరపిడిగా ఉంటూ వచ్చింది. పూర్వంనుంచీ వస్తూవున్న మార్గాన్ని వదలివేసిన వచన రచనాపద్ధతి మంచిది కాదని ఆ అపమార్గాన్ని తప్పించి జీవద్భాషలో వచనరచన జరగాలని శ్రీ గిడుగువారుచేసిన కృషిమూలకంగా ఆ కృత్రిమభాష పోతూవుంది చాలా వరకు. సక్రమమైనమార్గంలో రచన జరిగితే మన వచనం సజీవంగా ఉండి ఇంకా కొన్ని భాషలకు మేలుబంతికూడా ఔతుం దేమో!

# మధువిహారం

ప్రేమతాపసులు మీరు
ఇతరుల ప్రేరిస్తారు
స్వీయుల రాణిస్తారు.
హృదయం ఆశ్వాసం.
అతనికోసమై అర్పిస్తారు.

తెప్పలు తేలిస్తారు
పరులను పీడిస్తారు.
ముందూ వెనకా
విహరిస్తారు మీరు.

ఏ వ్యూహాలకూ లొంగరు
ఆశాపూరిత హృదయంతో
ఆహరణశీలురు మీరు.
ప్రేమభావులకు రాజులో
ప్రేమించి ఇస్తారు;
        అదే మీజీవితం
        అదే మీప్రస్థానం.

నిశీథి నిశ్చల పరిణామాలు మీవి
మంచిని వంచించలేరు
వంచన విలువ చెయ్యరు
మీ ఆశ్వాసం మీ నిశ్చయం
సరళ జీవనం

మీ నీల కనీనికల కెంపు రేగిన
వారి గుండెల రేక చెదురును
జీవనసౌఖ్యం కమనీయంగా
జరుగుబాటుగా [illegible]పిస్తారు

ఏవో తలపులు గుమిగూడి
వంచించినా
చీకటి వెలుగులు చీకు చింతలు
అడుగడుగునకు అనుమానాలూ
అన్నీ తెర మరుపులుగా
పాసిపోయేవే.

మీదృష్టి ముందుకు సాగి
మార్గం చూపిస్తుంది
వెలుగు నీడలను పాకిస్తుంది
వెనక్కు నడవడం చేతేకాదు.

# క ళ వ ళి క

ఏవీ ఏవీ ఏ వేవి !
వినువీధిలో జయ ఘోషలు
హృదయం ఊరిస్తున్నవి...
        వా రెవరో...
        ఏరీ ఏరీ

చిలిక నాలిక గుడ్డలతో
చీత్కారపు ధ్వనుల్లో
కొండకోన దారుల్లో
నడుస్తున్నాడు, చరిస్తున్నాడు
        వా రెవరో...

భయోచ్చాలిత భూంకారం
బాధల ముంచే ప్రచండరావం
ఆకాంక్షిస్తున్నారు
ఆలక్షిస్తున్నారు
అవిగో, అవి
అవి యేమో...

వికావికలై వీగిపోయి
చలియించే
రుధిరవిహారం, సంధ్యామరుత్తులు
అప్రియ గానములు.

ఆనాడే
ఏనాడో వోనాడు
విశ్వం అంతా వికస్వరంతో
విస్మరించినది విలయంవాట
ప్రస్థానంలో నరసమూహం
కల్లోలంగా ముల్లోకములు
కదిలింది.

అభయప్రదానం లేదాయె
లేదన రగుల్కొనె
హృది బుగుల్కొనె
నవాభ్యుదయం
శుభప్రశంస
ఏమో,
ఏనాడో!

నాగలింగం వెంకటేశ్వరులు

# ఉత్తగోల

కా. సూ.

అయిష్టంగా ఉన్నవాళ్ల చేతులలోనుంచి ఉపకారం బలవంతంగా ఊడబెరుకుకున్నప్పుడు, వాళ్ళవల్ల మనకు కలిగే ఉపకారం ఏలాగున పరిణమిస్తుందో చూడవలెనంటే, చిత్తగించండి మా కళాశాలహాస్టల్. సంవత్సరం, ఒకవెయ్యితొమ్మిదివందల ముప్పైఎనిమిది, యూరపుదేశస్థులలెక్కలనుబట్టి; ఈ దేశమానాన్నిబట్టి, బహుధాన్య; కాశీవారికి ఏమవుతుందో తెలుసుకోవాలంటే ఈ సంవత్సరంనుండి, ముందుకో వెనుకకో నాకు జ్ఞాపకంచాలదుగాని, పన్నెండు సంవత్సరాలు లెక్కపెట్టుకోవాలి. కొత్తగాకాదు, సుమారు నూరుసంవత్సరములై మ్యూనిసిపల్‌వారి పరిపాలనకింద ఉన్నది వరాహపురం. కనుబొమ్మలాగు ఎదుగు, బొదుగులేకుండా అనేకవందల సంవత్సరాలు ఉండి ఈపట్నం, బద్ధకంగా చెవులు ఝాడించుకొని లేచి, ఎదుగుదాము అని నిండుగా నిశ్చయంచేసుకొనేసరికి, దానికి నెత్తికెక్కికూర్చొన్నది రైలుకట్ట, గోదావరికట్టకి తోడుగాను. ఈ మధ్యను, కృష్ణా, గోదావరులకు నడిమిసీమలో ఆకాశమండలంనుంచి స్వేచ్ఛాగానంచేసింది, తన చిత్తానికి నచ్చినట్టు, అడవిని పెరిగిన కోవిలఒకటి: "ఈ యేపునోయావు, ఆ యేపునోయావు, జోడావులకునడుమ నాయెంకి," "ఈ యేపునోయేరు, ఆ యేపునో యేరు, ఏళ్ళరెంటికినడుమ నాయెంకి", "ఈ కాడనో కొండ, ఆకాడనోకొండ, కొండకోనలనడుమ నాయెంకి", "ఈసాయనోసేను, ఆసాయనో సేను, సేలరెంటికినడుమ నాయెంకి," "నన్నుసూడుమన్నట్టుండు నాయెంకి," "నన్ను పోలుండుమంటాది నాయెంకి," "సూడ, రెండేకళ్ళనిపించు నా యెంకి," "గుండెజాలి పుట్టిస్తాది నాయెంకి" [1] అంటూను. దేశం అంతట్లా వినబడ్డది ఈగానం. దాని స్వారస్యం ఎరిగినవాళ్లు, ఆనందమయులైనారు. "ముందామెపాపిష్ఠి కండదిగనీక, ఎంకి మనదన్నారు, ఎత్తుకున్నారు. ఎంకొక్క దేవతై యెలిసెనన్నారు, యింటింటపెట్టారు యెంకి నేపేరు."[2] పెరగవలసినదేవపైతేనేమి, ఎంకిలాగు తనతో ఈడుజోడుగా ఉన్నపరిసరములమధ్యను పడితేనే దానికిసొంపు; వృద్ధిలోకివస్తుంది. నరివిత్తు మెరకనేలను మొలకెత్తదు. ఒకరికి శ్రేయస్సుఅయినది ఇంకొకరికి కీడు. ఎద్దు, ఎనుపోతులు రెండుగా చేరి లాగుతున్న బరువుబండి ఏవిధాన్ని సూటిగా సాగగలదు! 'నీవుకాదు, నేనే' అనుకొనే గోదావరికట్టకిన్నీ, రైలుకట్టకిన్నీ నడానతరుకుకొన్నా, పెరగవలెనని పూర్ణంగా ఉద్దేశించుకొన్న వరాహపురం గోచిపాతనుపోలి నిడుపుగా తయారు అయింది. ఈకొసనుంచిఆకొసకి, ఊరికిమధ్యను ఒకటే నడివీధి, ఈరికలాగు. దీనికి జంటలుగాఉన్న వీధులకు పొడవు అతితక్కువ. ఎదుగుదామంటే, ఒకవేపుగోదావరి

---

1, 2 అనుసరణం.

కిట్టి, ఇంకొకనైన్యా సైలుకిట్టి అమ్మవడపోసి వీట్లకు. ఈలాంటిపిల్లవీధిఒకదాంట్లో ఉన్నది కళాశాలహాస్టల్. మరోవిధంగాఉంటే, ఉన్నఊరికి అవమానం కలుగుతుందనికాబోలు. దీనినిర్మించినవారు, పొడుగ్గుఎంతసొంపుగాఉంటే వెడల్పుఅంత తక్కువగాఉండాలని, యోచించినట్లు కనిపిస్తుంది. నన్నువీధిమొదలుకొని గోదావరి కట్టుకన్నేవరకూ, అంగుళంఅయినా వెల్తిలేకుండా పిల్లవీధంతా ఆవరించుకుంది, ఈ హాస్టల్. పదిఅడుగులు చదరంగలిగిన గది, దీనికిముందు ఆరడుగులువరండా, గదికివెనక ఆనుకున్న గదిపంచపాళీ ఈమూడూ చేరేసరికి మా హాస్టల్ మహాభవనం వెడల్పంతా ఆవరించుకుపోయింది. గదులకుముందు బారుగాఉన్న వరండామీద రెండు పిల్లగోడలుపెట్టడంచేత హాస్టలుఅంతా మూడుభాగాలైనది. సమీపవీధిఅంటివున్న భాగం కళలను అభ్యసించేవారికి నిర్ణయించినది; మధ్యది మాకు, బోధనాపద్ధతులను నేర్చుకుందామనివచ్చినవారికి; కొట్టకొసది, గోదావరికట్టకు దగ్గరగాఉన్నది భోజనాల ఇల్లు. ఇదే భోజనాలఇల్లుగా ఎందుకుఉండాలో, మొదటిది ఎందుకుఉండకూడదో ఇద్దరికే తెలుసునని అంటూఉండేవారు ఒకప్పుడు: ఆమహాభవనం విద్యార్థులకు వాసయోగ్యమని నిర్ణయించినమహామేధావికిన్నీ, సర్వజ్ఞుడుభగవంతునికిన్నీ. వీరిద్దరిలో ఒకరు రెండవవారితో ఐక్యంఅయిపోవడంచేత ఆరహస్యంఏమిటో ఇప్పుడు ఒక్కరికే తెలుసును. అయితే, భోజనాలుఅయినవిమ్మట ఇష్టంవచ్చినవారు గోదావరిలోదిగి నిర్మలంగా చేతులుకడుక్కోవచ్చునని యోచించినారంటే కొంతకారణం ఉంటుందని అనుకునేవారు, విద్యార్థులలో హాస్యగాళ్ళుకొందరు. వాళ్ళవాళ్ళ ఇష్టానుసారం ఏలాగట పంచుకోనియ్యండి, గది, పంచపాళీ చేరి ముగ్గురికివసతి: జనం ఇద్దరికి మూడుకళ్లుఅన్నట్లు. మధ్యభాగంలో మొదటివాటాయందు నేను,మాకృష్ణమూర్తి,కృష్ణారావు ఉండేవాళ్లం. వేసంగిలో గదుల ఉక్కకు నిలవలేక ఎదురుగదులఎదుట వారు పక్కలువేసుకొని వరండామీద పడుకోవడం మామూలు. ఆమటా మ్యునిసిపల్ కౌన్సిలరుని అడిగితే హాస్టలుకి ముందునఉన్న బాట రోడ్డంటాడు. నిజమేఅయిఉండవచ్చును, ఈరోడ్డు పేరునఎంతో కర్చుకాపడం; లేకుంటే, అంతటివాడు అణాపైసలతోసహా రెండువేల మూడువందల నలభై అయిదురూపాయీల ఆరణాల ఏడుపైసలు అయిందని ఏలాగున జ్ఞాపకంఉంచుకొని చెప్పగలడు! అయితే రోడ్డుకిఉండవలసిన చిహ్నాలుఏమీ కనబడవు దానిలో, ఆ రోడ్డునివెయ్యడంతో జోక్యంఏమీలేని ఇతరులెవ్వరికీని. వానలకి కరిగి కారిన గోదావరికట్టవొండు ఆవీధిని ఎప్పుడూ నించిఉంటుంది. వానలుకురిసి గోదావరివరదలు వచ్చినకాలంలో చూడాలి ఈ వీధిఆధిక్యత. స్వర్గమునకు మెట్లుకడుతూఉంటుంది.

అందుకే కలరాజాడ్యమునకు లొంగి హతులైనవారికళేబరములకు ఇదేదారి. ఈజాడ్యంవాతనుబడకుండా ఏదో దొంగతనాన తప్పించుకున్న విద్యార్థులకు ఇహలోకస్వర్గమే, ఇల్లూ వాకిలీ బాడితో నిండిపోతవి. ఎంతకష్టములు అనుభవిస్తున్నా బ్రతికిఉండడంకంటె సౌఖ్యమేమున్నది! స్వర్గమేమున్నది! ఈ ఇహలోకస్వర్గానికి పక్కనే తహస్సీలుదారుకచేరీ, పోలీసువారికావలాలో ఉన్న ఖజానాకొట్లు, ఖైదీలకోసంనిర్ణయించినజెయిలు, ఏపొద్దునా మా హాస్టలువేపే చూస్తూఉంటవి, స్వర్గంవేపు మరేమీపని లేని నరకంలాగు. కచేరీహాతాకి చుట్టూగోడలకుమారుగా తీగలతీవరనేఉండడం మరీముఖ్యావచ్చింది. మాస్వర్గానికి మనుషులన్న మాటేలేదు; నరకంకంటబడనిఅంశమేలేదు. ఈ కచేరీకి వాళ్ళవాళ్ళపనులమీదకొత్తగావచ్చినవాళ్ళు "ఇదేమి ఈవింత, గుర్రాలశాలలకు గుమాస్తాలెత్తినారేమిటి! గుర్రాలు లోపలికి ఏలాగున దూరగలవు!" అని ఆశ్చర్యపడుతూఉంటే నిజంఎరిగినవాళ్లు "చీమలుపెట్టినపుట్టలు పాములకిరవైనా" రీతినే ఎగుమతిసరుకులకోసంనిర్మయమైనకొట్లు విద్యార్థులకువసతిగృహంఅయినవి" అని చెప్పుకొద్దేవారు ఎగుమతిసరుకులగిడ్డంగులము, గుర్రాలసాల కాని మాకు ఈమాటలువింటే చాలాసిగ్గుగా ఉంటూఉండేది. కళాశాలఆఫీసుకి ముదటి గుమాస్తా మాహాస్టలికి మేనేజరుఅయినా మోనాలంగనపతికి అట్టేచింత ఏమీలేదు. కర్చులేకుండా తిండిదొరికితే చాలును. మాపక్కగది రట్టున్నది. రమణయ్య, శాస్త్రి ఉండేవారుఅతనితోటి. తరువాతగది కృష్ణస్వామి, శేషయ్యగార్లది. దీనికి అటుపైని గదులలోచల్లానాలఅబ్బాయి, అవసరాలవారిఅబ్బాయి ఇంకాఎవరోఉన్నారు వరసగాను.

ఆరాత్రి ఎందుచేతనో గాని రాత్రిభోజనాలు ఆలస్యమైనవి. చేతులు తుడుచుకొంటూ కాలేజీకవంపుననున్న సందిలోకి ఉదకస్నానము, ఉడికినఎలుగుబంటినోట్లోకి పుట్టలో చీమలలాగు, భోజనాలు ముగించుకొనివాళ్ళ విద్యార్థులమందరమూను. ఉక్కకు తాళలేక చల్లగాలిబుక్కడానికి గోదావరికట్ట ఎక్కినారుకొందరు. మిగిలినవాళ్ళంఎవరి గూళ్ళకివాళ్ళం పోతున్నాము. మాగదికిఎదురుగుండా వీధిలో వరండాపక్కని నిల్చున్న వారుఎవరోగాని చీకట్లోకనబడలేదు—అన్నారు: "అన్నా, చాలారోజులైంది కాదూ మనంకలుసుకొని, ఎట్లావున్నావు!" అని. కంటితో చూచి పోల్చుకుందామంటే చిట్టచీకటి. గొంతుకవిని పోల్చుకుందామంటే, ఎవరైనా కావచ్చునన్నట్టుంది, స్వరానికి ప్రత్యేకించిన గుర్తులు ఏమిన్నీ లేకపోవడంచేత. పిల్లిలాగు చిట్టచీకటిలోకూడా చూచి పోల్చుకోగలిగిన వాళ్ళలో నేనుఎరిగినవాడు ఒక్కడే. "గోపాలం" అన్నాను. "ఓయ్" అన్నాడువాడు. దెయ్యాన్ని తెలుచుకోవడమే తెరువాయిగాని వెంటనే

ప్రత్యక్షం! "ఇదేమిటి, ఈలాగున వచ్చినావు" ఎందుకు, ఎప్పుడురావడం? అంటూ, నేను అతనిని తీసుకొని మా గదిలోకివెళ్ళినాను. "సమాజాన్ని గురించి, కొన్ని వ్యవహారాలు నాయుడుతో గట్టిగా మాటాడాలని వచ్చినాను. కొందవసంగతులు తరువాత చెప్పుతానుగాని నేటిరాత్రి ఇక్కడనే పడుకొంటాను, నాకొక్క పక్కగుడ్డ యిచ్చి గోరంతచోటుమాత్రం చూపించు" అన్నాడుగోపాలం. "సరే" అన్నాను. ఎరుక చెప్పవలసినవాళ్ళందరికి గోపాలాన్ని చూపించడంఅయిన తరువాత, మా గదికి ఎదురుగుండాఉన్న వరండామీద పక్కలుపరుచుకొని వాట్లమీద పడుకొని చల్లగా కబుర్లు చెప్పుకుంటున్నాము. అదృష్టవశాత్తూ మాకృష్ణారావు ఊళ్ళోలేడు; అతడు మామూలుగా పడుకోనేచోటు ఖాలీగాఉండడం గోపాలానికి పనికివచ్చింది. కృష్ణమూర్తికి గోడమూలను చోటు విడిచిపెట్టినాము. నాయుడు, సమాజం, అతడు దానికథ నడిపించడం, రెండోవాళ్ళమాట ఎంతసబబుగాఉన్నా పైకి ఎక్కనీయకపోవడం చెప్పాడు మాటలు వినడం, తనకు కిందివాళ్ళనెత్తెక్కి ఎంతపిండిదంచుతాడో, మీదివాళ్ళఎదట అంతనీచంగాను ప్రవర్తించడం, సమాజం వృద్ధిపొందవలెనంటే ఇటుపైని సమాజికులు తొక్కవలసిన దార్లు ఒకదానితరువాత మరొకటి చెప్తుతూ కాలంనడిపించాడు గోపాలం. ఇంతలో తనమూలని పక్కవేసుకొని పడుకొన్నాడుకృష్ణమూర్తి; అతని పక్కని నేను నాపక్కనిగోపాలం. ఆపక్కనిశేషయ్య, శాస్త్రి, రమణప్ప, రట్టన్న; ఆమీద ఇంకా ఎవరెవరో పడుకొన్నారు ఒకరితరువాతఒకరు, ఎగుమతికిసిద్ధంగా దేవదారుపెట్టెలలో పొట్లంగాఅమర్చిన సార్డీన్ చేపలలాగు.

చీకటి, దీపంలేదు. అంతా మేలుకొనేఉన్నాము. "ఒరే, అన్నా, గోలచెయ్యనా?" అన్నాడు రట్టన్న నాతోటి. "వద్దురా, అన్నా. అందరూ పడుకుంటున్నారు; తగువు పెడతారు, అలాంటిపని వద్దన్నానునేను. కాని తుంటరితనం చెయ్యడానికి వీడు నిశ్చయించుకున్నట్టు కిచకిచలాడడంవల్ల నాకుబోధపడ్డది ఒకనిమిషంఊరుకొని అన్నాడు, "శాస్త్రిగారూ, శాస్త్రిగారూ, నేనుఒకప్రశ్న వేస్తానుమిమ్మల్ని, కోపంరాదుగదా?," అని. "అయ్యో, కోపంఎందుకండీ, ఈభాగ్యానికి? అడగండీ, ఏమిటోచూదాము," అన్నాడు శాస్త్రి. "రాదుగద, రాదుగద, రాదుగద" అని ముచ్చుమువ్వాటూ ప్రశ్న వేసి, ముచ్చుమువ్వాటూ "రాదు, రాదు, రాదు," అన్నజవాబు విని "అయితే అడుగుదునా? నన్ను తిట్టిపొయ్యారుగద, ఆతరువాత తిడితే ఒప్పుకోనుసుమండీ," అన్నాడు రట్టన్న. ఇన్నిసార్లుఅడుగుతున్నాడే ఇతడు, ఇందులో ఏమోఉంటుంది అని అనుమానపడ్డాడు గాబోలు శాస్త్రి. ఇంతకుముందు దృఢంగా "వెయ్యండి" అని

చెప్పి, ఇప్పుడుమళ్ళీ "వద్ద"ని వెనకదీస్తే నలుగురిలో నగుబాట్లు అని యోచించి "వెయ్యండి నాకేమిభయం," అని మునపటికన్నా గంభీరంగా అన్నాడు శాస్త్రి. "అయితే చేగోడీలరుచి ఇంతకుముందే బాగా తెలుసునటే మీకు" అన్నాడు రట్టన్న. వాడినోటివెంట ఈపలుకులుబయటకు వడీపడడంలోనే ఇద్దరుతప్ప తక్కినఅందరమూ గొల్లుననవ్వినాము. ఈఇద్దరిలో ఒకడు గోపాలం. వీడికి ఏమీ బోధపడలేదుగనక నవ్వలేదు. రెండవవాడు శాస్త్రి— ఉడుక్కున్నాడుగనక నవ్వలేదు. తొక్కిన తాచులాగు లేచి, నోటికి అబ్బుపడిన తిట్లన్నీ తిడుతున్నాడు శాస్త్రి. అదుగో మొదటనే చెప్పినానే, నన్నుతిడితే ఒప్పుకోనని; 'నన్నుతిట్టన'ని ముచ్చముమ్మాటూ మీచేత వాగ్దత్తంచేయించుకొన్నానే ముందరే, ఇష్టంలేకుంటే "మీరు ప్రశ్న వేయనక్కరలేదు"ని నాతో చెప్పియుండవచ్చునే! అదుగో మళ్ళీతిడుతున్నాడే! అంటూనేఉన్నాడు, బొకబొకనవ్వుతూనేఉన్నాడు రట్టన్న. వీడునవ్వితే తక్కినవాళ్లం మరీమరీనవ్వినాము, కడుపుచెక్కలయ్యేటట్లు. మాకు నవ్వుహెచ్చైనకొద్దీ శాస్త్రికి ఉడుకుపోతుతనం దానితోసహాకోపం హెచ్చైనవి: వీటితో తిట్టుకూడాను. పాకం ముదిరిపోవడం చూచి, మాలోఒకళ్లిద్దరు, నలుగురునీ కేకలువేసి మోటట నవ్వులు చల్లార్చినారు. రట్టన్న ఏమీఎరగనివాడిలాగున దొంగగురకపెట్టుతూ పడుకున్నాడు. శాస్త్రి అరుచుకొని అరుచుకొని కోపంచల్లార్చుకొన్నాడు, పడుకొన్నాడు.

ఒక్కొక్కప్పుడు ఈ విద్యార్థిసమూహాలలో అతిఅమాయకమైన మాటలకు ముచ్చటైనవాటికి 'కూడాను' అపార్థాలు కల్పనఅవుతవి; ఎందుకో, ఎవరుకల్పిస్తారో ఎప్పుడో ఎవ్వరికీ తెలియదు. ఆమాట ఉచ్చరించగానే అందరునవ్వుకొంటారు. "తివాసీ వేసినాడు. మతాబాకాల్చినాడు. బాజాలువాయిస్తున్నాడు" కాకాపడుతున్నాడు. అన్నవన్నీ ఇలాంటివే. ఈజాతిలోకిచేరినది. "చేగోడీలరుచి." రట్టన్న ఉచ్చరించాడు, అందరమూనవ్వినాము; శాస్త్రిగారికి ఉడుకుపోతుతనంవచ్చింది; రట్టన్నను తిట్టినాడు. ఉత్త గోల; అంతే.

ఇంతటితో కథముగిస్తే బాగుండును; కాని రాబోయేనాటకానికి ఇది నాంది అయింది. అందరం నిద్రపోయినాము. చాలారాత్రికావడంచేత నిద్రపోయేముందర మనస్సుకలవరపడడంవల్ల చురుకైన మనస్సుగలవాళ్ళకి ఎవ్వరికీ మంచి నిద్ర పట్టిఉంటుందనుకోను. జాగ్రదవస్థవిడిచి సుషుప్తిలో ప్రవేశించిఉండరు చాలా మంది. ఇందులో మొదటివాడు గోపాలం. కల రావడంచేతనో, లేకుంటే మరే మైనా కారణంవల్లనో, నేనుచెప్పలేను; గోపాలం, పైకిఊడిపడని భారమైనస్వరంతో

"ఏ(((((''అని ఏడవడంసాగించినాడు. గుండెధైర్యశాలి శేషయ్య దానిని అందుకున్నాడు. ఇటుమీద, ఒకరితరువాత ఇంకొకరు. ''ఏ((''అంటే''ఏ((" అని ఏడుపూ కాకుండా అరుపూ కాకుండా ఉన్నస్వరంతో కేకలువేయడం మొదలుపెట్టినారు అందరూను. గోపాలం, శేషయ్యల కేకలుతోనే నాకుసగం తెలివివచ్చినది. బోరగిల పడుకున్నవాడిని తలఎత్తి చూచేసరికి నాతలాపుదిక్కున మాగదితలుపుదగ్గర నిల్చొని ఎవరో తలుపుతాళంతీస్తున్నట్టు నాకుతోచినది. తటాలునలేచి ఆమనిషిని నాసందెటలో ఇముడ్చుకొని కదలనీయకుండా పట్టుకొన్నాను. ''నేనయ్యా, కృష్ణారావుని, ఒంటిగంటన్నరరైలులో దిగినానయ్యా తలుపుతియ్యనీయవయ్యా, దొంగనుకాను,'' అంటున్నాడు అతడు నవ్వుతూను. ఈమాటలు చెవినిపడుతూనేఉన్నవి గాని, ఇంకా బాగా తెలివిరాలేదు నాకు. అందుచేత వాటిఅర్థం తలకెక్కలేదు. మరింతగట్టిగా నెరుముతున్నాను అతనిని. ''వదలవయ్యా. వదలవయ్యా'' అని నాలుగైదుసార్లు బిగ్గరగా అరిస్తేనేగాని నాకు బాగా తెలివివచ్చి విడచిపెట్టలేదు. గొర్రెలమందలో ఒకగొర్రెఅరిస్తే, అన్నిగొర్రెలూ అరిచినట్లు మిగిలినవాళ్ళంతా గోలచేస్తూనే ఉన్నారు. అప్పుడు వీళ్ళనికొట్టిలేపినాను. అందరికి తెలివివచ్చి అరుపులు చాలించేసరికి ఒకటిరెండునిమిషాలు అయిఉంటుంది. ఇదిఏమో బ్రహ్మాండం అనుకొని తహసీల్‌దారు కచేరీలోఉన్న పదిమంది పోలీసుజవానులు పరుగెత్తుకొని వచ్చినారు ఆవరణతీగెలుదగ్గిరికి. తగిన కారణంలేకుండా వారుఅరచినారనివీరు, వీరు అరచినారనివారు ఒంటిమీద తెలివిలేకుండా కేకలు వేయడమే సిగ్గు. తమలోటు ఇతరులకు తెలిసిపోయిందేఅని మరింతసిగ్గు. ఇట్టి హీనస్థితిలోనుంచి తప్పించుకోవడానికి మార్గం ఏమిటంటే: "నేనుకాదు మొదలుపెట్టింది నీవే" అని ఒకడు, "కాదు నీవే గాని, నేనుకాదు'' అని ఇంకొకడు అంటూ, ఒకరినిఒకరు నిందించుకోవడమేకాకుండా వారినిచూచివీరు, వీరినిచూచివారు నవ్వుకోవడమే. ఇద్దరిదీ తప్పేఅని ఇద్దరికీ తెలుసును కాని పోలీసువాళ్ళవంటి పైవాళ్ళను మభ్యపరచడానికి తగిన రహస్యం ఇదే, కాబట్టి దానిని స్వేచ్ఛగా ఉపయోగపరుస్తున్నారు అంతాను పోలీసుజవానులువచ్చేసరికి. "ఏమిటండీ" అన్నాడు జవానులలోఒకడు. "ఉత్తగోలయ్యా, మీపనిమీరు చూచుకొండ''న్నాడు బుచ్చబ్బి.

''రట్టన్న—శాస్త్రిగోలే దీనికికారణం; మనం పడుకోబోయేముందర జరిగినఈగోలవల్ల మనస్సు అందరికి కలవరపడ్డది. అదిలేకుంటే ఇదీలేదు; ఇదే హాల్యూసినేషన్, మరింకేమిటి" అని ఒకపెద్ద ఇంగ్లీషుమాటచాటున తనలోటు దాచుకున్నాడు గోపాలం. శేషయ్య దానిని సహీచేసినాడు.

# శ శి క ళ

అడివి బాపిరాజు

౧

సూర్య తనయా
దివ్య బాలా
నవ్య బాలా
నేనె నాథుణ్ణి
నేనె భక్తుణ్ణి
కాంతిలో తొలి
కళ్లు విరిసే
కాంతిలో, ఏ
కాంత సేవలా
నీలి తళుకే
నీలి కునుకై
నవ్వు మూర్తై
పువ్వు లోతుల
జారితివి నా
జన్మసరసిని
సూర్యతనయా
నవ్యబాలా
దివ్యబాలా

౨

నీలికలువ పుటాలల్లో
తేలిపోవు కోమలతలు
నీలిరత్న హృదయంలో
సోలిపోవు కాంతిసూక్తి
నెమలి గళము వంపుల్లో
నృత్యమాడు నీలినిగలు
నీలానంత రహస్యము
మూర్తించినవే నీ కన్నులు
ముగ్ధబాల సూర్యసుతా
దివ్యబాల సూర్యసుతా
నవ్యబాల సూర్యసుతా

౩

బంగారు ఉయ్యాల
పవ్వళించి నిదురిస్తు
తెలిపోతూ దిగుతు
తెలికొండ వాలితివి
ఓ దివ్యబాలికా
ఓ నవ్యబాలికా
ఓ కాంతిమాలికా

పొంగిపోతున్నట్టి
పొంకాల నీవళ్లు
విరుచుకొని, మేలుకొని,
తెరుచుకొని నీకళ్లు
నీలికాంతులచూపు
నింగి పరికిస్తావు
కోన పరికిస్తావు
తెలిమంచు ఖండాలు
తేలేటి శిఖరాలు
ఓ దివ్యబాలికా
ఓ నవ్యబాలికా

ఊర్పు విడుస్తూ
ఓ యనీ లే స్తిని !

౧౧

ఓ ఉగాది చెలియా !
ఏ మైపోతి గదే
నా ఊహల కందవు
నను నవ్వోదవే ?
ఒక కౌగిలి
ఒక ము ద్దిస్తిని
అర్పించిన కాన్క దాల్చి
అలమిన సంతోషమూని,
ఏమై న న్నెంచితివో
ఏదై నిను మాయ ముంచె
బతిమాలిన కోర్కెతోసి
ప్రణుతించిన పూజ విడిచి
మటుమాయ మ్మైపోతివి
మాయ నైతి ఆశల్లో
హృదయాన్నే చిదిమినావు
మధురిమలో చేదుకలిపి
మధురబాల
విధురమూర్తి
త్రాగుమ అని నవ్వితివే
దయ రాదై
దరిసినదే నీయెదలో !

౧౨

ప్రాణాలే కాంక్షలైన
ఈ నిశిని, గాటపుతమి
కనురెప్పల మూత లేని
నను జేరవా కోర్కెలవా
చంద్రబాల, చంద్రబాల
అని నే పిలిచెద
పలుక వటే
పలుకవటే !

౧౩

దూరాన్నే తోచినావు
తొలకరి మెరుపై
ధళ ధళ మని
సుభగ శ్రీదివ్యమూర్తి
విభావరీ ముకుళ మూర్తి
తప్తకనక వర్ణమూర్తి
సుప్తకాంక్ష దీప్తమూర్తి
నగ్నార్చిఃపుంజ మూర్తి
నవ్వుల బెళుకుల మాయల
ప్రియురాలా, ప్రియురాలా
చంద్రబాల, చంద్రబాల

౧౪

చిట్టి కెరటాలులా
చిన్ని చిన్ని కలలులా
ముంగురులు ఆడుతూ
మోముపై చెదరగా
లేతవెన్నెల వెలుగు
చూత సుమముల తెలుపు
చిరునవ్వులై పెదవి
వరము లందివ్వగా

దివ్య గంధర్వవై
తేజరిల్లిన బాల
నవ్య యౌవన మూర్తి
ఓ చంద్ర బాలికా!
ఓ సూర్యతనుజాత!

౧౫

ఏల కోపం వచ్చినదె నీ
కేల దయలే తప్పినవె
బాలికా నావైపు తిరుగనె
వీణా పాటల మంజు
వాణుల మించు చూపుల
నలచి చూడవు.
పూలతావుల అలల
మాలల మాటల్లో
కలచి వేయవు.
కాళిదాస మనోజ్ఞ కవితా
జాల గీతా ఝరుల మించే
బాహులతలతో
చిదిమి వేయవు
కదిపి వేయవు.
పచ్చకర్పూరాస వెన్నెల,
పసిడి సాయంతనం వెలుగుల
సంపగుల గంధాలు కలిపి
నిన్ను నే పూజింప వస్తిని
సొన్న సానీ, సొన్న సానీ!

౧౬

కళ్ళు పూవులు చేసి
ఒళ్ళు గుడిగా చేసి
ప్రేమకై వెళ్ళితే
మనసు ఆరతి చేసి
మాట గానము చేసి
భిక్షకై వెళ్ళితే
పూలు పళ్ళాన్నుంచి
పాలు పంచామృతం
పూజకై వెళ్ళితే
నిను జేరి పూజించ
నిను జేరి కీర్తించ
అన్ని కలిపివేసి
ఆత్మార్పణము చేసి
యోగివై త్యాగివై
రావోయి రావోయి
రావోయి అప్పుడే
అని నవ్వినది బాల
అని పలికినది బాల
శశికళా శశికళా.

౧౭

చీకటి వెనుకే వెలుగు ఉన్నది
నల్లని నీ కనురెప్పల వెనుకే
తళతళతళతళమని
పాపలు వెలుగును
వెలుగున ఇమిడీ
శక్తి ఉన్నదీ
తళ తళ తళ మను
పాపల్లోనే
పరవశత్వమై
మహా మధురమా
దివ్య ప్రణయము
తేజరిల్లునే!

# మేనక

## కల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు

### ప్రథమ రంగము

[విశ్వామిత్రుని ఆశ్రమపదమూ. ఋషుల జడలవంటి పొడుగైన మర్రిచెట్టు—ఊడల దగ్గిరిగా నల్లరాతిమీద విశ్వామిత్రుడు తపోనిష్ఠలో ఉన్నాడు. నల్లనిజడలు ఆయన బుజాలమీదపడి, మెరుస్తున్నవి. మేనకాది అప్సరసలు, చిరునవ్వులతో, వాలుచూపుల తోరణాలు కట్టుతూ ఆయనకు సమీపంగా ప్రవేశిస్తారు. మందమారుతానికి పుప్పొడి రాలుతుంది. గాలికి ఎగిరివచ్చిన పూలు పచ్చగడ్డిమీద అక్కడక్కడ పడుతవి. పద్మాసనముతో గంభీరముగా కూర్చున్న ఋషిని చూచి, మేనక మొదలైన అచ్చరలు నిశ్చేష్టరపడి, క్షణం ఆగి, వెళ్ళిపోతారు...ఇంతలోనే మరొక పక్కనుంచి ఇద్దరు ఆశ్రమ వాసినులు ప్రవేశించి ఋషికి దూరంగా నిలుచుని మాటాడుకొంటారు; ఆయన్ను గమనించరు.]

భ్రమరిక

ఏమే వాసంతీ!

వాసంతి

శాంతమైన ఈ ఆశ్రమపదంలోనూ, వనంలోనూ ఇదివరకు ఎన్నడూ చూడని సంరంభం బయలుదేరింది. నిన్నటిదాకా తపోనిష్ఠాగరిష్ఠులై, తీవ్రసమాధిలో ఉన్న మహర్షులు తారుమారు అయిపోయినారు. ఆశ్చర్యం, ఊహించలేని బాధపడుతున్నాను.

భ్రమరిక

వనం అల్లకల్లోల మయిపోయింది. దివిజలోక వాసిని ఎవరో అప్సరసలను వెంటబెట్టుకొని వచ్చిందని ఇందాక కులపతుల శిష్యుడు అంటూ ఉంటే, ఆలవాలంలో నీళ్ళుపోస్తూ విన్నాను అస్పష్టంగా.

వాసంతి

లోకంలో ఋషులు ఎక్కడెక్కడ తపస్సు చేస్తూ ఉన్నారో అని ఇంద్రుడు కనిపెడుతూ ఉంటాడు. ఋషులతపస్సులు భంగం చెయ్యడానికి అచ్చర జాగిలాలను తోలుతాడు. అనాదినుంచీ ఇంతే.

భ్రమరిక

శాంతమూర్తు లయిన ఆశ్రమవాసులకు కష్టాలు వచ్చినవి.

వాసంతి

సరస్సులో నీరు ముంచి బిందె బుజాన పెట్టుకొని మెట్లెక్కుతున్న నన్ను చూస్తూ దేవదత్తుడు తీగజొంపాలచాటున నిలబడ్డాడు. శిష్యులు ఆశ్రమ కన్యల విలాసాలు చూస్తూ ఎక్కడివాళ్ళు అక్కడ నిలబడిపోతున్నారు.

భ్రమరిక

కేతకీదళాలు కుసుమసాయకుని తీక్ష్ణమయూశాలవలె ప్రకాశిస్తూ, అంతేవాసుల అమా

యిక హృదయాలను చీల్చి వేస్తున్నవి. అదుగో! సహకారతరువును ఆలింగనంచేసుకుని మాధవీలత మొగ్గ తొడిగింది! చూశావా? ...

వాసంతి

ఈ మదన విజృంభణానికి మహర్షుల చిత్తవృత్తులు ప్రకోపిస్తున్నవి ...... ఆ విన వచ్చే కోలాహలమూ, మణినూపుర రణితమూ అప్సరసలదేనా! [ఇద్దరూ చెవులు ఒగ్గి వింటూ నిష్క్రమిస్తారు.]

మేనక

[ఇంకొక పక్కనుంచి చెలులతో ప్రవేశించి, విశ్వామిత్రుని చూచి సంశయిస్తూ నెమ్మదిగా] అమ్మో! భయంవేస్తున్నది! మునిచంద్రుల సాన్నిధ్యము కంపం కలిగిస్తున్నదే! ఏమి సమాధినైశ్చల్యం! హృదయ పుండరీకంలో ఉండే మహాజ్యోతిస్స్వరూపం మీదే లక్ష్యం ఉంచి బాహ్య విషయజ్ఞాన విముఖులైన పరమ తపోధనుల కఠోర సాధన నాబోటి చిగురుబోణివైపు మరలుతుందా? [ముఖం పైకెత్తి ఆలోచించి] భయపడడ మెందుకు? ... [ఉత్సాహం తెచ్చుకొని] మా పయోధిని, లావణ్య పయోరాశి, ప్రవరుడి దేహం బలవంతంగా బాహులతలతో కట్టివేసి, అతన్ని ఎంత శ్రమపెట్టలేదు! తెలివితక్కువ పిల్ల!... నేను మహర్షులను ఎంతో గౌరవిస్తాను. వారు ఎంత తపశ్శాలు లయినా మా లావణ్య సరస్సులో మజ్జనం ఆడాలి! మా కారుణ్య జ్వాలల్లో తప్తం కానిదే వారికి వన్నె ఎక్కడనుంచి వస్తుంది; సాధనార్ణవ కల్లోలంలో నురుగువలె తలకిందు లవుతున్నప్పుడు అందాల నావనై అందుతాను.

మొదటి అప్సర

అక్కా! ఎందుకుసంశయిస్తావమ్మా? అప్సరో బాహుపరిష్వంగంలో ఎంతమంది ముని పుంగవులు చిక్కుకో లేదు?

[నలుగు రప్సరసలు ఒకరి బుజాలమీద ఒకరు చేతులు వేసుకుని వాలుచూపులతో నవ్వుతున్నారు. చూర్ణకుంతలాలు ముఖాల మీద మలయమారుతానికి నయ్యాటలాడుతున్నవి. తరువాత నృత్యం చేస్తున్నారు. చిక్కుపడి కొద్దిగా తెగిపోయిన తార హారాల్లోంచి ముత్యాలు జలజలారాలి పడుతున్నవి. పాముకుబుసంవంటి పయ్యెదలు జారిపోయి స్తనకుట్మలాల్లో చిక్కుపడుతున్నవి. కాంచీ మేఖలలు ఘలఘల్లాడుతున్నవి. నడుములు మెరుపుతీగెల్లాగ చలిస్తున్నవి. ఒకఅచ్చర మధుపానమత్తురాలై పాడలేకపోయింది.]

మేనక

స్వామి అనుగ్రహానికి పాత్రం ఔతానో కానో అనే సంశయం పీడిస్తున్నది!

ఒకతె

[నవ్వి] నీవేమీ భయపడవద్దు. ఆ పరమ నైష్ఠిక చకోరం నీ ఆస్యచంద్రికాజాలం

ఆస్వాదించకుండా ఊరుకుంటుందా? మనకు సహాయంగా ఉన్న కామదేవుడు ముని మానస కాసారంలో కల్లోలం పుట్టించడా? ఈ చంద్రికాపూరం వల్ల వాళ్ళకు తాపం పుట్టదా?

మేనక

[విచారంతో] కామదేవునిది అంతా వామ మార్గం! దుస్సహావిరహాగ్ని నన్ను దహించి వేస్తున్నది. కఠోర విరాగి అయిన ముని హృదయారవిందంలో మార్పు ఏమీ కలిగినట్లు తోస్తున్నది. [కన్నీరు.]

ఇంకొక తె

వెర్రిదానా! అఖండవిద్యాసుధాశాంతిలో మజ్జన మాడుతున్న ఆయన చిత్తం నీ జఘన మేఖలా చక్రవాక ఝుణాత్కారం వల్ల కల్లోలమై పోతుంది. కళ్ళు తెరిచి నీ దివ్యదేహాన్ని తిలకించి నీ లావణ్యామృత సరోవరంలో ఆ పరమహంస అవగాహనం చెయ్యడా? మన సంగీతకం వల్ల మురజ ఘోషల వల్ల నాట్య హేలా ప్రాచుర్యం వల్ల మహర్షులు ధ్యానముద్ర విడి ఇవతల పడరా?

అందరు

తరుణ హృదయ విదళన మదనా!
కాముక చిత్త స్వైర విహరణా!
జయ రతివల్లభ! జయ మదనా!

మేనక

నా అనుమానం తీర్చవమ్మా అక్కా! కామదేవుడు నన్ను బాధిస్తున్నాడు గాని విశ్వామిత్రుల చిత్తంలో వికారం కలిగించ లేకపోతున్నాడే!

ఒక తె

ఇదా ఆందోళన! ఫాలనేత్రుని ప్రభవల్ల కామదేవుని కాయం కాలిపోయిందిగదా! అందుచేతనే అనంగుడై సంచరిస్తున్నాడు. ఈ విశ్వామిత్రుల తపోగ్ని జ్వాలలను పతంగం ఔతానేమో అని కామదేవుడు కాస్త ముందు వెనుకగా ఆలోచిస్తున్నాడు. ఐతే విశ్వేశ్వరునికి విశ్వామిత్రునికి సామ్యం ఎక్కడ? [మేనకకు ఉత్సాహం]

అందరు

[కలిసి వలయాకారంగా నృత్యం చేస్తూ పాట]

మునిజన చిత్తక్షోభ కారణా! మదనా!
యువజన హృదయాంతర చిర విహారణ
జయ జయ మన్మథ! జయ మదనా.

[అప్సరసలు మాలతీ జాతీ కుసుమాలు విశ్వామిత్రునిమీద విసురుతారు. మేనక కూడా వారితో పాటు నృత్యం చేస్తున్నది.]

తరుణ హృదయ విదళన మదనా!
కాముక చిత్త స్వైర విహరణా!
జయ రతివల్లభ! జయ మదనా!!

[అప్సరసలు విసిరిన పువ్వులు విశ్వామిత్రుని జడలలో చిక్కుకుని తపోగ్నికి వాడి రాలి పోతున్నవి. ఋషి చలించని దీపశిఖవలె ఉన్నాడు. అచ్చరలు కోటి నక్షత్రాల తళతళలతో నవ్వుతున్నారు.]

[ప్రవేశం కామదేవుడు. బంగారు శలాక వలె మెరిసే దేహము, చేతిలో ధనుర్దండము, తలనిండా రంగురంగుల పువ్వులు, ఒంటి నిండా పూలదండలు, చెక్కిళ్ళమీద మకరికా పత్రరచనలు, మహర్షి మీద బాణం విడిచేసరికి ఒంటినిండా పుప్పొడి రాలింది.]

కామదేవుడు

రమణీ ఘన వక్షోజ సానువుల
తరుణీ జన తాపాసల కీలల
అమరీ కపోల మణి దర్పణముల
భ్రమరీ గళ తంత్రీ నిక్వణముల
కోకిల కుల కల కాంచీ ఘోషల
నిర్ఝరిణీ మంజీర రావముల
సికతా జఘన దుకూలాంచలముల
నాట్యము చేసెద నోహోహో!

అప్సరసలు

జయ మన్మథ! జయ మన్మథ!
యువ హృదయాంతర విహారణ!
జయ మన్మథ! జయ మదనా!

కామదేవుడు

వ్రేలాడు మల్లె విరిదండ జడలో
చిక్కువడి జారు జాజుల దండలో
నిదుర యెరుగని కంటితుది యెరుపులో
వలపు చూపుల కులుకు సొగసు పసలో
కెమ్మోవి కెంపు జిగి తళుక్కు కొసలో
నాట్యమాడుదును నే నాట్యమాడుదును.

అప్సరసలు

విజయీ భవ విజయీ భవ
విజిత జగత్త్రయ మదనా!

[నాట్యం చేస్తారు]

కామదేవుడు

మణిమయ నూపుర
ఝణఝణ రావము
మంజుల పాదాం
బురుహన్యాసము
కంకణ ఝుంకృతి
సువర్ణ నాదము!
వరించితిని బో!
హరించితిని బో!!

బిరబిర నిటునటు
నడుగిడగా
పయ్యెద పెనగొని
జీరాడంగా
గిరగిర తిరిగెను
వేసలి మృదువుగ
గణగణ మ్రోగెను
మొలనూల్ గంటలు
వరించితిని బో!
హరించితిని బో!!

ఖండ బుద్ధికి తావేదీ మేనకా! పరిశీలన బుద్ధికి భౌతిక సౌందర్యం ఇష్టమౌతుం దేమో కాని చిత్ విశ్రాంతి లేక నీ లావ ణ్యాన్ని తిలకిస్తున్న నాకు బ్రహ్మానందాను భవం దూరం అయిపోయింది. సాత్విక చంద్రామృత తేజం వదిలిన నాకు చిత్త సమాధానం ఎక్కడిది?

అయ్యో! మేనకా! అరిషడ్వర్గాన్ని జయించి అతీతం కావడానికి చేసే తీవ్ర సాధన వ్యర్థమై పోయిందే! కోరికలులేని నాకు మనోరథలతిక జన్మించి చివుళ్ళు వేస్తున్నదే! [విచారంతో] మాయామేఘ పటలమునుంచి బాహ్యప్రపంచ సుఖ దుఃఖాలు శ్రోణీపాతంగా వర్షించి తీవ్ర మాయాఝంఝుకునన్ను జీర్ణపత్రం చేసిందే! ఎందుకీ చింత! ప్రీతి భావమలయానిలానికి హృదయం విపంచికవలె మోగిపోవలసిందే? అయ్యో! ఆ విజ్ఞానచంద్రోదయం అమృత తేజం నా అజ్ఞానమేఘ తిమిరంలో మరుగు పడింది.

మేనక

మనోహరా! సర్వలోకములూ భూమ్యా కాశాలూ జీవరాసులూ అల్లకల్లోల మైనప్పుడుకూడా ఈ వికృతహాసమే నీపెద వులమీద అంకురిస్తుందా? మనస్సును పోషించుకోవడమే ముఖ్యమా? హృదయ మందారాన్ని త్రుంచివేయడం భావ్యమా? మనోహరా! నితాంత రమణీయమై నిసర్గ రమణీయమైన యీ మధుమాసశోభను తిలకించండి. కాసారంగట్టునఉన్న సహకార పాదపాన్ని కౌగిలించుకుంటున్న లతా లోలాక్షి కుసుమ కోరకాలతో పులకరించి మధుశీకరాలు వర్షిస్తున్నది. సమీరణము సందేహముతో వీస్తున్నది.

[విశ్వామిత్రుడు పాషాణంవిడిచి పచ్చికలో పొగడచెట్టుకింద కూర్చున్నాడు. మేనక ఆయన్ని అనుకుని కూర్చున్నది. పయ్యెద జారిపోయింది. ఋషిభుజంమీద తనచెక్కిలి ఆనించి ఆయన ముఖంలో ముఖముపెట్టి చూస్తున్నది. గాలికి పొగడపూవులు వారి తలలమీద రాలినవి]

విశ్వామిత్రుడు

[ఆమెచేయి పట్టుకుని] ఈహస్తమునీదేనా! రక్తాశోక పల్లవముకంటె రమణీయమైనదే నీహస్తము! అధరపల్లవము మలయానిలా నికి చలిస్తున్నదే!

అప్సరసలు

[లతలమాటున] పాణిగ్రహణ మయినదే!

మేనక

మనోహరా! తరువులపైన కోకిలలు ముక్త కంఠంతో మంగళగీతాలు పాడుతున్నవి. ఆ హంస మిథునాన్ని చూడండి. బిసకిసల యాలు అందిచ్చుకుంటూ మృదుతరంగాల మీద సితసరోజం పక్కగా ఒయ్యారంగా పోతున్నవి.

విశ్వామిత్రుడు

కలహంసోత్తంసిత సితసరోజ విరాజితమైన దీ సరోవరం. నా మనస్సు పరమహంసోత్తంసిత సితకమల సహస్ర జ్యోతులతో నిండినది. కలహంస కూజితానుకారి ఐన మణి నూపుర కలకలము ఇంకా వినబడుతున్నదే!

మేనక

[మందహాసముతో] విస్మరించలేదా ఇంకా! మణి భూషణ శింజారవము మా అప్సరో బృందమువారిదే. వా రిప్పుడు నాట్యము చెయ్యకపోయినా ఆ మాధురి మీ చిత్తములో హత్తుకుపోయిందే !

అప్సరసలు

[లతలమాటున నవ్వుతూ] పాణిగ్రహణమైనదే మేనకా విశ్వామిత్రులకు !

మా కామితములు సిద్ధించెను లే
మా జతనమ్ములు ఫలియించెను లే
మేనక కోరిక లీడేరెను లే
చల్లని వెన్నెల జల్లుల
తీయని యామని మధువుల
విరిసిగ గొజ్జగి సెజ్జల
ప్రకృతియు పురుషుడు కలియగ
అయినది అద్వైత సిద్ధి
అయినది అద్వైత సిద్ధి!

△

ద్వితీయ రంగము

[విశ్వామిత్రుడు వెళ్ళిపోవడానికి సిద్ధముగా ఉంటాడు. చామనచాయ శరీరముమీద యజ్ఞోపవీతము కనబడుతూ ఉంటుంది. కనుబొమలు ముడివేసినాడు. పొగడకొమ్మలకు తీగలతో కట్టిన ఉయ్యాలలోనుంచి శిశువును మేనక తీసి ఎత్తుకొంటుంది. బిడ్డ కలవపూవులువిచ్చినట్లు నవ్వుతుంది ఋషి కుడిచెయ్యి ముఖానికి అడ్డంపెట్టుకొంటాడు.]

మేనక

ఈ వెన్నెలలో ఈ శిశువునూ నన్నూ విడిచి వెళ్ళిపోతారా ?

విశ్వామిత్రుడు

అసంపూర్ణమైన ఈ జీవనం అనుభవించ లేను. ఎంతకాలము మర్త్యలోకంలో ఉండి అమృతత్వము మానుకోను ? మనకు నేటితో సంబంధం సరి !

మేనక

సంబంధం లేదంటే పోతుందా మనోహరా! జీవితం అసంపూర్ణమా!

విశ్వామిత్రుడు

ఐహికవిషయ లంపటత్వము విడిచి జీవిత పరమావధికి అన్వేషిస్తాను. ఫలము కొమ్మను ఆధారం చేసుకొంటుంది; పండు మీదిచర్మము కండను ఆధారం చేసుకొంటుంది. కండకుఆధారం గింజ. పరిణతమయ్యే సరికి దానికి కండకు సంబంధం పోతుంది. ఎన్ని గాలిదుమారాలు కొట్టినా, చిలకలు ముక్కులతో పొడిచి రక్కినా పరిపక్వబీజానికి అపాయం లేదు. కఠోర తపసు చేసి

పొందిన జ్ఞానము పరిపక్వం కాకుండా ఐహిక సంబంధాలు నాకు అడ్డువస్తున్నవి.

మేనక

[నిర్విణ్ణురాలై శిశువును ఉయ్యాలలో పడుకోబెట్టి] జ్ఞానం ఆర్జించిన మీకు ఈ జగత్తులో కావలసి పదార్థాలు ఏవీ లేవా? ఏ సంబంధమూ, అనుబంధమూ లేవా?

విశ్వామిత్రుడు

నాకు లౌకిక ప్రపంచముతో ఏమి సంబంధ మున్నది వెర్రిదానా!

మేనక

మునీశ్వరా! మీరు వెళ్ళిపోతే తరువును ఆధారం చేసుకొని జీవించవలసిన లతవంటి నేనూ, బంధకారణమైన ఈ శిశువూ ఏమి కావాలి! కఠోరతపస్సువల్ల లబ్ధమైన ఆధ్యాత్మిక సంపద క్షయమై పోతుందనా వెరు తున్నారు? సంసార బంధం తెంచుకోడానికి ప్రయత్నం చేస్తూన్న మిమ్మల్ని చూస్తే నాకు జాలి వేస్తున్నది. చివురాకు సెజ్జలో తురాయివంటి అమ్మాయిని చూస్తే మీ హృదయం ద్రవించడం లేదా?

విశ్వామిత్రుడు

మోక్షార్థి ఐనవాడికి రాగద్వేషాలతో ఏమి పని మేనకా!

మేనక

జ్ఞాన మార్జించిన మీరు కేవలం గ్రంథ చక్షువులు.

విశ్వామిత్రుడు

తా నల్లుకొన్న గూటిలోనే క్రమక్రమంగా చిక్కుకుంటుంది సాలెపురుగు. మమకార వాగురలలో పడిపోయిన వాడికి స్వేచ్ఛ ఎక్కడిది? మాకు ఈ సంసారమే మహా పంజరం.

మేనక

బంధవృంతం తెంపివేయ దలుచుకున్నారు. ఈ కుసుమం ధూళిపాలై పోతుంది.

విశ్వామిత్రుడు

అంత ప్రమాదం రాదు.

మేనక

జ్ఞాన తేజస్సువల్ల మీ హృదయం కుసుమం వలె వికసించిం దనుకున్నాను. చూస్తే ముకుళావస్థలోనే ఉన్నట్టు కనబడుతుంది. శాస్త్రదృష్టి ఎంత ఉంటే ఏమి? జ్ఞానవీచికలో మునకవేస్తే ఏమి? పుష్పపరిమళం మాధుర్యమును ఆస్వాదించలేరు స్వామీ మీ వంటివారు!

విశ్వామిత్రుడు

నా ఆశయం గ్రహించలేక ఏమేమో చెపుతున్నావు. ఇక్కడ ఇక నిలవకూడదు.

[మేనక శకుంతలను ఎత్తుకుంటుంది. విశ్వామిత్రుడు శిశువుకేసి చూస్తాడు] ఇక్కడుండకూడదు. నడుస్తున్నాను మేనకా!

మేనక

[కన్నీళ్ళతో] నా అనురాగ తుషార కణములు ఎడారివంటి మీ హృదయంలో ఇంకిపోతున్నవి. మరుభూమికి మధుమాసం లేదు. ప్రేమకు తగిన ప్రతిఫలం ఇవ్వని మీ హృదయం ఊసరక్షేత్రం. అబ్బా! చేతులారా ఈ మాలికను మీ మెడలో వేసినాను. పుష్పమాలిక తెంపి పోదామనుకుంటున్నారు. [విశ్వామిత్రుడు నాలు గడుగులు వేస్తాడు]. మనోహరా! మనో...

[విశ్వామిత్రుడు నిష్క్రమిస్తాడు]

పూలమాల తెంప పోతివా

నాథా !

ధూళిలోన కలసి పోవదా ?
రేకు లూడి మధువు లిగిరి
వాడి వాడి పోవు నేడు
పూలమాల...
ఈ కానన దేశమందు
ఏకాకిని జేసితివా
పూల మాల...
జల జల జల మని కజ్జల
మలినాశ్రులు పారగ వని
సెలయేరై రోదించును
పూలమాల......

వన దేవత

కొనగోరుల మీటకు కన్నీటిని
విలపించుచు జార్చకు కన్నీటిని
వ్యథ జెందబోకు
విసుగెత్తిపోవు నీయెడద
ఎలుగెత్తి యేడ్వ
ఎలబ్రాయ మెల్ల సురుగు
కసుగందిపోవ మేను
ఎద కరిగిపోయి
వ్యథ పొంగు లెత్త
తరగల్లు కట్టి
కడలిగా ముంచెత్తు
రాగమ్మె పొంగి
మధుకుల్య యగుచు
సుధ ఉబికి యుబికి
మధుమయ మౌను

[మేనక శకుంతలను చూస్తూ చీరచెరగుతో కన్నీరు తుడుచుకుంటుంది]

ప్రాక్సతీవదన
చంద్ర దీధితులు
పాండుర మయ్యె
తారహారముల
తరగిపోయినది
చెలువం బెల్లన్.

Δ

తృతీయ రంగము

[అదే వనం. ఉషస్సు. సమీప హిమశైలం మీద సూర్యుడు మంకెనపువ్వు కాంతులు విరజిమ్ముతూ దూదిపింజలవంటి మబ్బులను చీల్చుకుని మెరిసిపోతున్నాడు. మంచు రంగు రంగుల్తో వెలుగుతూ కరిగిపోతున్నది. తురాయిచెట్టువద్ద నల్లరాతి బండమీద మేనక విచారంతో చెక్కిట చెయ్యిజేర్చి కూచునిఉంది. కన్నులు జేవురించి ఉన్నవి.

సిగపాయలు చెవులను కొంతకప్పి బుజాల మీదా వీపుమీదా పాదులు పాదులుగా పడుతున్నవి. ఆర్ద్రపుర్వూలవలె తురాయి పువ్వులు ఆమెపక్కన రాలినవి. ఆమె లేచి శకుంతలను ఒళ్లో పెట్టుకుని విచారంలో మునిగిపోయింది.]

మేనక

మానవ హృదయం వజ్రకఠోరం అని ఇది వరకు నేననుకోలేదు. నామనోహరుడు—'నా' అనుకోనక్కరలే దిక—రాగబంధము గొడ్డలిపెట్టుతో నరికి బాధ్యత వదులుచ్చుకుని పోయినాడు. శకుంతం శూన్య విహాయసంలో కెగిరినప్పటికీ భూమిమీదికి రావలసిందే కాదా!

మనోహరా! ఈ లావణ్యజ్యోతిని ప్రేమ సుధావాహినిని వదులుకుని అందు బాటులో లేని అవ్యక్త పదార్థాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్నారు. శూన్యావర్తంలో గిరిగిరా తిరిగిపోతూ నిశిత తర్క కంటకాలు నీ మనస్సును శతధా గుచ్చుతుంటే సంశయ విపర్యయాందోళికలలో అనుక్షణమూ ఊగులాడుతూ అహంకారమూలం జ్ఞాన పరశువుతో మొదలంటా నరికివేయ యత్నిస్తూ అన్వేషణలో దారి తెలియక బాధపడుతున్న మీకు నా రాగదీపిక మిణుగురువలె మార్గం గోచరింపజేయదా? అన్వేషణ సరణిలో కుసుమసుకుమారమైన నా హృదయం పాన్పువలె పరిస్తే పాద విన్యాసములతోనైనా సంభావించరా? లోకోత్తరాహ్లాదజనకం మాయా సంతమస హారణం ఐన సౌందర్యజ్యోతి విశ్వామిత్రులకు చైతన్యం కలిగించదా?

[కళ్లు మూసుకుని చేతులు జోడించి ఆయన్నే ధ్యానించి] నిశ్శ్రేయసప్రాప్తికి మీ రొక్కరే హృదయాన్ని వేరుజేసుకుంటున్నారు. మహేంద్రుడు ఏనాడు విశ్వామిత్రుని తీవ్రతపోజ్వాలలను లావణ్యసుధారసంతో చల్లార్ప వలసిందని పంపినాడో ఆనాడే నా హృదయం ఋషికి దత్తమైపోయింది. నా స్థితి గ్రహించిన రంభ పరిహాసంచేసి తన కెంగేలితో నా బుగ్గమీద చిటికె వేసింది. ఊర్వశి అసిత ద్యుతులతో అంగరాగం పూస్తూ "అక్కా! అప్పుడే నీ హృదయం పరాయత్తమైందేమే!" అని వేళాకోళం చేసింది. ఈ కనకకలశాలపైని ఉన్న కమలదామం వాడిపోవ సాగింది.

[నిట్టూర్పుతో] మహేంద్రా! ఈ అవస్థ మీఆజ్ఞవల్లనేగదా సంభవించింది. ఐతే ప్రకృతి మాత్రం నెచ్చెలి ఐపోయింది నన్నుచూచి యామిని నీలవిహాయస హృదయం కరిగిపోయి తారకాశ్రువులు జార్చింది. ఈ ఉషోరాగంలో ఆ హిమశైలం కరిగి కన్నీరు వాకలై ప్రవహిస్తున్నది. తపోవనములో వృద్ధతరువులు జీర్ణపత్రాలు రాలుస్తూ నామీద అనుకంప చూపుతున్నవి. ఈ పాషాణ హృదయములు సయితము

ద్రవించి బీటలువారిన వనస్థలిని ఘృణాన్నిర్ఝరిణితో ఆర్ద్రిములు చేస్తున్నవి.

[శకుంతలను ముద్దుపెట్టుకుని కన్నీరు నిండగా] చిన్నితల్లీ! నీముద్దుమొగము, నీహాసచంద్రికలూ చూస్తూ నిన్ను విడిచి పోవడమెలాగు? నిన్ను దిక్కులేకుండా విడిచిపోతే చూచేవారెవరు? దేవలోకంలోకి నిన్ను ఎత్తుకుపోతే నిలింపకామినులు నన్ను గేలి చేస్తారే! ఏంచెయ్యను? నిన్ను వదలడానికి బాహువులకు కార్కశ్యము హృదయానికి శిలాజడిమ ఎక్కడనుంచివస్తవి తల్లీ! [బిడ్డను ముద్దుపెట్టుకుని] ఓవనదేవతా! నాబిడ్డను నీ ఒడిలో పెట్టిపోతాను. శకుంతములారా! ఈశిశువుకు మీరే దిక్కు!

ఈ యుపాధిచే ఘటిల్లు
నీర్ష్యా మోహాదికములు
రాగ విరాగమ్ములు
అభిమానమ్ములు
బాహిరమా దేహముచే
ప్రభవించెడు భావమ్ములు
భేద మెల్ల సమసిపోవ
శాంతి నాకు ఘటియిల్లును.

కోయిలపిండు

రావమ్మ మాలతీ! రావమ్మ మల్లికా!
రా రండు సేవకై శుకశారికములార!
మధురాణి వనరాణి
వచ్చె, రండో చెలులు!
తెండోయి కానుకలు!
కాకలీ మధు ఝరీ
కల్లోలములతోడ
వరపుష్ప మధుగంధ
వాసనాలహరితో
తమ్మిపూవులలోని
తరళముక్తాళితో
మల్లికా మకరంద
రసశీకరాళితో
మధుమాస చంద్రికా
హాసదీధితులతో
రండు సేవింతాము
రండోయి చెలులార!

పుష్పకన్యలు

[వలయాకారముగా నాట్యంచేస్తూ]

పులకించె జగమెల్ల
విరియించె దిశలెల్ల
రసమయమ్మై జగము
రాణించి వికసించె.
మధువు లొలికించెనే
వలపు నురియించెనే
సుమసాయకము బూని
హృదయమును జీల్చెనే.
తెండు మీ హృదయాలు
తెండు తారుణ్యమ్ము
జగమెల్ల వివశమై
సొమ్మసిలిపోవంగ.
అందముల జిందు మక
రందముల వెల్లువల
విందు లిడు పుష్పాదులు
కందోవల కెంతో

డెందము లమందరస
మందుకొని యూగెన్
అందముల మీరి చెలు
వొందు విరులందున్
మందగతి వీచు మల
యానిలము లోహో!

[వనదేవత కుసుంబాతళుకుచీరదాల్చి తిలక పుష్పము నొసట దిద్ది చూత ప్రవాళోష్ఠముతో సెలయేటి మర్మర మంజీర నాదములతో చంచద్ద్విరేఫాళి దృగంచలాలతో సాక్షాత్కరించింది. వనదేవత ఆజ్ఞానుసారం శకుంతములన్నీ శిశువు ఉయ్యాల చుట్టూ చేరుతవి. క్రమంగా వెన్నెలకూడా వచ్చింది.]

శారికలు

చిన్ని నిద్దురపోవె
పొన్న నిద్దుర పోవె
చెదరి నీ ముంగురుల్
నుదుటిపై వ్రాలగా
కమలపత్రాలతో
వీవనల్ వీతుమే
మలయ గంధము నీదు
మెయినిండ పూతుమే
బంగారు నాతల్లి
రతనాల నాపాప
నిదురపోవే కన్న
చిన్నారి పొన్నారి.

భ్రమరీ గణం

నింగిపై వ్రేలాడు
ఆణిముత్తెపు సరుల్
చల్లగా కురిసేటి
పండువెన్నెల తెరల
చివురాకు డోలికల
నిదురపోవే తల్లి.
నెమ్మోము చందురుడు
సమ్మోద మొసగగా
నింగిపై తారకలు
నిదురించు చుండగా
దెసలు పరవశమాచు
తళతళలు చిల్కగా
వెల్లివిరిసిన అమృత
పూరంబు జారగా
నిదురబోవే కన్న
నిదురబోవే చిన్న.

[శకుంతల నిద్రపోయింది. సెలయేరు కొండ రాళ్ళమీదుగా పడుతూ ముత్యాలపొడి వలె రవ్వల తుంపురులు ఒలుకుతూ తెల్లటి నురుగు రాళ్ళకుతగిలి విచ్చిపోతూ ఉండగా మందగానంచేస్తూ సమతలాన ప్రవహిస్తున్నది. నీళ్ళకదలికలో చంద్రుడు ఖండ ఖండము లౌతున్నాడు. మేనక శకుంతలను అమృతపు చూపులతో కడసారి చూసింది. నితంబములమీద నీలకేశములువాలి ఇసుకతిన్నెలమీదనీరు ప్రవహిస్తున్నట్టు ఉన్నవి. ఆమెనేత్రాలు కన్నీళ్ళతో నిండి చంద్రకాంతిలో మిలమిలలాడుతున్నవి. క్రమక్రమంగా ఆమె వెన్నెలలో లీనమై పోయింది.]

△ సమాప్తం △

# కావ్య ప్రమేయము 3

## జమ్ములమడక మాధవరామశర్మ

### నాయిక : నాయకుడు

రసశాస్త్రీయ యోగ్యతనుబట్టి నాయిక నాయకుడుకూడ కావ్యప్రమేయ కోటిలో చేరతగిఉన్నారు. ధాత్వర్థాన్నిబట్టి ఫలభాజనుడు నాయకుడని నిర్ణయము. అందుచేత అన్నిరసాల్లోనూ నాయకుడి అవసరం ఉన్నది. ప్రత్యేక రూపంతో యువతికూడ సకల రససంబంధం కలిగే ఉంటుంది. నాయికా నాయకుల సంబంధం అన్నిరసాల్లోనూ అవసరంకాదు. శృంగారహాస్య కరుణరసములందు అవసరం. శృంగారంలో అపరిహార్య సంబంధం ఉన్నది. యువతీ సంబంధం లేకుండా హాస్యకరుణాలను నిరూపించవచ్చు. శృంగారస్థాయి అయిన రతి, పరస్పరాస్థాబంధరూపము. అక్కడ యువతి నాయిక. ఆ నాయికాప్రతిపాదనము ఆలంకారిక గ్రంథాలలో అనేకరూపములను పొందింది. నాయికా చేష్టలు నానావిధాల నిరూపింపబడినవి. నాయికా నాయకుల సంబంధాన్ని అనుసరించి ''దూతీ కర్మ ప్రకాశము'' ఆవశ్యకమైంది. నాయికా నాయకుల ఘనిష్ఠ సంబంధాన్ని అనుసరించే కామశాస్త్రమంతా సాహిత్యరంగములో ప్రవేశించింది. పురుషార్థ చతుష్టయంలో ధర్మపురుషార్థమునందు స్త్రీ పురుషుల సంబంధము అతిశయితంగా ఉన్నా ధర్మాన్ని అనుసరించిన విధానము కావ్యగోష్ఠిలో ప్రధానం కాలేదు. అందువలన కావ్యబంధాలలో కర్తవ్యాకర్తవ్యబోధ వెదుకవలసినదిగా అయిందని శ్రోత్రియులు అనుకోవటానికి అవకాశం కలిగింది. కావ్యమువలన లోకసంగ్రహము అపేక్షితమైనట్లు ధర్మసంగ్రహంకూడా ముఖ్యాపేక్షితమే. ఉపదేశపథాన్ని కావ్యము అతిక్రమింపరాదు...అని అనుకొనే గ్రథయితలు ప్రకృత విషయ వికాసాన్ని భావించి తదనుకూలంగా రచనలను అలవరచుకొంటే, కావ్య ప్రయోజనం ఏమిటి ? కావ్యం ఎందుకు ! అనే ప్రశ్నలు పుట్టటానికి అవకాశం లేదు.

### శబ్దము : అర్థము

కావ్యప్రమేయాలలో చేరతగిన అర్థము త్రివిధమని ఆలంకారికులు నిర్వచించుతున్నారు. శబ్దాన్ని అనుసరించిన అర్థమే కావ్యప్రతిపాద్యము. అందువలన శబ్దానికి కలిగే భేదాలు అర్థానికికూడా సంబంధించుతవి. వైయాకరణులు, తార్కికులు, మీమాంసకులూ శబ్దార్థ తత్త్వాలను పరిశీలించి అభినివేశంతో విపులరచనచేశారు.

సాహిత్యోపాసకులకు శబ్దార్థతత్త్వ సమీక్ష అంతగా ప్రధానంకాదు. అందువలన ఆలంకారికులుకూడా ఆ విషయంలో ఎక్కువగా ప్రయత్నించలేదు. శాస్త్రకారులు వాచక లక్షకాలను మాత్రం అంగీకరించారు కాని వ్యంజక శబ్దాన్ని ఒప్పుకోలేదు. అందువలన వ్యంగ్య ప్రస్థానంవారికి వ్యంజకశబ్దనిరూపణం ముఖ్యమయింది. కావ్యం వ్యంజక ప్రధానం కావాలని నిర్దేశకుల నిర్ణయము. కావ్యశబ్దము శాస్త్రశబ్ద విలక్షణము. కావ్యంలో స్వల్పార్థప్రతిపాదనకు ప్రచురవచనరచన, స్ఫారార్థమునకు కతిపయ పదరచన త్రాసులో తూచినట్లు తగిన అర్థ ప్రతిపాదనకు తగిన శబ్దరచనలు కవి వృషభ సందర్భ నియంతా ఉంటవి. వాచకము, లక్షకము, వ్యంజకము, గమకము, ప్రత్యాయకము, ద్యోతకము అని శబ్దా లారువిధాలు. ఇవి క్రమంగా వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము, గమ్యము, ప్రత్యాయ్యము, ద్యోత్యము అనేఅర్థాలను తెలియ చేస్తవి. మొదటి రెండూ తప్ప సామాన్యంగా అన్నీ వ్యంజకరూపాలే అని మమ్మటామల అభిప్రాయము.

శబ్దమును అర్థమును తెలియజేసే శక్తికలదై ఉంటుంది. ఆ శబ్దములో ఉండే శక్తి వృత్తి, వ్యాపారము- అనే పదాలతో వ్యవహరింపబడుతుంది. వాచక లక్షక వ్యంజక శబ్దాలలో అభిధ, లక్షణ, వ్యంజన అనే శక్తులు (వ్యాపారములు) ఉంటవి. వీటిని ఆలంకారికులు సాహితీగోష్ఠికి ఉపకరించే పద్ధతిలో విమర్శించి నిరూపించారు. అయినా వ్యంజనానిరూపణము వీరికి ముఖ్యము. వ్యంజన లేదనే వాదాన్ని, అది మిగతావాటిల్లో అంతర్భవించుతుంది అనే వాదాన్ని నిరసించి ఆలంకారికులు వ్యంజనావిశిష్టతను ప్రతిపాదించారు. ఆనందవర్ధనసమున్మీలితమైన యీ వాదాన్ని తరువాతి ఆలంకారికులు బాగావిమర్శించి సిద్ధాంతపరిచారు. ఈ వాదంలో వైయాకరణులు విప్రతిపన్నులుగారు. శబ్దార్థాలు కావ్యప్రమేయాలుగా ఎన్నబడినా కావ్యశరీరత్వమును పొందినవి. కేవల శబ్దమే కావ్యమని కొందరివాదము. శబ్దార్థ సాహిత్యము కావ్యవ్యపదేశార్హమని బహువాదము. ఆ విమర్శనము ప్రకృత మవసరం కాదు.

## గు ణ ము లు

గుణస్వరూప వివేచనానికి ముందుగా పాఠకభావకులకు ఒక విషయమును జ్ఞాపకం చేయవలసి ఉన్నది. చార్వాకుల మతంలో ఆయా అవయవాలతో కూడుకొన్న దేహంకంటె అతిరిక్తమైన ఆత్మ లేదు. తదితరమతాలలో ఆత్మ దేహాతిరిక్తము.

ప్రాచీనాలంకారికులు కావ్యస్వరూపం కంటె కావ్యాత్మ భిన్నంగా లేదని తలచినట్లు గోచరిస్తుంది. ఆనందవర్ధనానుయాయులు, కావ్యంలో ఆత్మస్థానీయమైన ఒక తత్త్వం ఉన్నదని అంగీకరించుతారు. గుణాలకు విశిష్టస్వరూపం ఉన్నదని వామనమతము. దండి వామనుల మతాలనుబట్టి సామాన్యంగా గుణము కావ్యాత్మ అని తలచటానికి అవకాశం ఉన్నది. వారు నిరూపించిన కావ్యముయొక్క స్వరూపకుక్షిలో గుణము చేరే ఉన్నది. అదే కావ్యాత్మ అయింది. అందువలన చార్వాక తుల్యత్వం వారికి చెప్పితే సహృదయులు కోపించరాదు. భరతుడు పదిగుణాలను చెప్పాడుకాని వాటికి విశిష్టస్వరూపాన్ని తలచలేదు. అతనిమతంలో గుణాలు దోషవిపర్యయాత్మకాలు. వాచికాభినయాన్ని ముఖ్యంగా నిరూపించదలచిన భరతుడు గుణస్వరూప నిర్వచనంలో శ్రద్ధవహించలేదు. అందువలన గుణాలు రీతులతో సంబంధించినవో రసాలతో సంబంధించినవో భరతుడు ప్రతిపాదించడు. కాని అతనికి రసముఖ్యత అత్యంతము అభిమతము. దోషగుణాదులన్నీ ఏవిధంగానయినా రసాన్ని ఉద్దీపింప చేయాలని అతనిమతం. అందుచేత గుణాలకు రససంబంధము అతనికి అనభిమతము కాదనవచ్చు. గుణాలను భరతుడు దోషవిపర్యయరూపాలనుగా తలచినా కొన్ని స్వతంత్రగుణాలుగా ఉన్నవి. ఆలంకారికులు భరతుడు పేర్కొన్న గుణాలపేర్లను అంగీకరించినా లక్షణవిషయంలో భిన్నగతులను చూపుతున్నారు. శబ్దగుణములనీ అర్థగుణములనీ భరతుడు విభాగముచూపలేదు. అయినా అతనిగుణాలు కొన్ని శబ్దగతాలు, కొన్ని అర్థగతాలు. దండి ఇష్టార్థవ్యవచ్ఛిన్నపదావళి కావ్యమని అంగీకరించుతాడు. ఆ పదావళీమార్గము వైదర్భిగౌడీరూపాన ద్వివిధమని నిర్వచించి వాటి వివేచనానికి గుణాలను నిరూపించటంచూస్తే గుణాలకు ఆత్మత్వమును అంగీకరించినట్లు స్పష్టమవుతుంది. గుణాలకు రీతి సంబంధం దండికి ఇష్టమయినా ఆ విషయాన్ని స్పష్టం చేయలేదు.

వామనుడు "రీతిరాత్మాకావ్యస్య" అని అన్నప్పటికీ గుణాత్మతావాదాన్ని నిరసించాడన నవసరం లేదు. గుణవిశిష్టము వామనాత్మ. విశిష్టగుణము దండిఆత్మ. ఉద్దేశవిధేయాలను అనుసరించిన ప్రాధాన్యాప్రాధాన్యాలు దండి వామనులమతాల్లో గోచరమవుతూఉంటవి. వామనమతంలో గుణాలు దోషవిపర్యయస్వరూపాలు కావు. గుణాలకు విశిష్టత్వం ఉన్నది. అవి ప్రత్యేకరూపాలు. అందువలన దోషాలే గుణవిపర్యయరూపాలు. గుణాలు నిత్యములు; తమంతటతాము కావ్యశోభను సంపాదించటానికి సమర్థాలు. కావ్యగుణాలకు వామనుడిచ్చిన ప్రాధాన్యం సాహిత్య

రంగంలో మరవజాలనిది. శబ్దార్థాలకు రెండిటికీ కావ్యత్వమును అంగీకరించిన వామనుడు గుణాలను శబ్దార్థగతాలనుగా విభజించాడు. మొత్తము వామనుని గుణాలు ఇరువది.

ఆనందవర్ధనాదుల గుణనిర్ణయమె అర్వాచీనులకు ఆదర్శప్రాయమైంది. వ్యంగ్యవ్యవస్థాపనాచార్యుడైన యీ ధ్వనికర్త గుణవిషయక ప్రాచీనవాదాలను అంగీకరింపడు. ఈ మతంలో మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అని గుణాలు మూడు. ఇవి రసధర్మాలు. భరతుడికి అభిమతమైన రసధర్మతావాదానికి ఈతడు మెరుగు పెట్టాడు. గుణిరూపమైన పదార్థమున్నప్పుడే గుణము ఆత్మలాభము పొందుతుంది. గుణి రసము - గుణాలు మాధుర్యాదులు. ఇవి రసధర్మాలె ఆయినా శబ్దగతాలనటం ఔపచారికము. గుణాలకు శబ్దగతత్వార్థగతత్వాలను ఈత డంగీకరింపడు. వామనాదులు పదిగుణాలను అంగీకరించటం పొరపాటని మమ్మటుడు సూచించాడు.

భోజరాజు పద్ధతి భిన్నగతులతో ఉన్నది. ఆ రాజుగుణాలు ఇరవైనాలుగు, శబ్దగుణాలైన 24 వాక్యార్థగతాలై మళ్లా పరిగణింపబడుతున్నవి. ఇంకా 24 దోషగుణాలు పద దోషాలకు 24 విధాలుగా గుణీకరణం. వాక్యదోషాలకు గుణక్లృప్తి. ఇట్లా భోజుడు విపులంగా గుణాలను విమర్శించాడు. ముఖ్యంగా తాను మొదట నిర్వచించిన 24 గుణాలలో కొన్ని బాహ్యాలు కొన్ని ఆంతరగుణాలు కొన్ని వైశేషికాలు. మొదటివి శబ్దాశ్రయాలు, రెండోవి అర్థాశ్రితాలు, మూడోరకం దోషాభావరూపాలు. కొన్ని గుణాలను దోషవిపర్యయరూపంగా తలిచాడు. అట్లాగే కొన్ని దోషాలుకూడా ఈతనిమతంలో గుణవిపర్యయ స్వరూపాలు. ఈ వాదం భావకులకు చిత్రంగా కన్పడవచ్చు. ఇందులోని తత్త్వాన్ని ఇంకొక స్థలంలో జ్ఞాపకం చేస్తాను.

విద్యానాథుడు 24 గుణాలను అంగీకరించటంలో అభిప్రాయ విశేషం లేదు. రాజమార్గాన్ని అనుసరించినా సమగ్రంగా ఆ పద్ధతిని స్వీకరించలేదు. ధ్వనిపద్ధతులను భోజుడు ప్రత్యేకంగా అంగీకరించలేదు కాబట్టి 24 గుణాలను ఆతడు నిరూపించటం అంతగా అనుచితం కాదు. వ్యంగ్యప్రస్థానాన్ని అనుసరించికూడా విద్యానాథుడీ విధంగా చేయటం నిరుపాఖ్యము. విద్యానాథుడు రాజాశ్రితుడు. తనగ్రంథంలో రాజవంశంవారి మతాన్ని నిరూపించితే ప్రతాపరుద్రుడు సంతోషించి సంతోషింపచేస్తాడని తలచి విద్యానాథుడు ఈ విషయానికి ఒడికట్టాడు. ఈ విషయాన్ని విజ్ఞులు శీలించుతారని విశ్వాసము.

## దోషములు

దోషాలు గుణవ్యత్యయరూపాలని కొందరి అభిప్రాయము. భరతుడి నిరూపణం చూస్తే అవి ప్రత్యేకస్వరూపం కలవిగా కనుపడుతవి. మనుష్యప్రవృత్తి సహజంగా దోష దృష్టితో ఉంటుంది. అందుచేత ముందుగా దోషాలను చెప్పటం ఉచితమే అవుతుందేమో. రసాపకర్షకత దూషకతాబీజము. ఈ అభిప్రాయము భరతుడికి సమ్మతం కాకపోదు. శబ్దమూ అర్థమూను స్వగతభిన్నపద్ధతిని బట్టి రసాన్ని అపకర్షింపవచ్చు. అందుచే శబ్దదోషార్థదోషవిభాగపద్ధతి స్వారసికము. భరతుడు నిర్ణయముచేసిన దోషముల్లో ఈ విశేషము కనపడుతునే ఉన్నది. అయినా ఆతడు ఆ విభాగాన్ని నిరుక్తం చేయలేదు. భామహాద్యలంకారకారులు భరతుడు నిర్దేశించిన దోషనామవిషయ నిర్దేశాలను సామాన్యంగా అంగీకరించినా విశేషచర్చలలో భరతుణ్ణి అతిశయించారు. నామమొకటే అయినా లక్షణపరిష్కారములో భరతుడిని అతిక్రమించి భిన్నగతులను చూపించుతున్నారు. భామహుడు ప్రతిజ్ఞాహేతు దృష్టాంతహాని దోష మని అన్నాడు. న్యాయశాస్త్రప్రక్రియాసంబంధంలో ఉండేది కర్కశం. దాన్ని తెలిసికొన్నందువలన కావ్యంలో ప్రయోజనం లేదు. అందుచేత అది దోషముకాదని దండి. భామహుడి పరిగణనలో కావ్యతత్త్వాన్ని అనుసరించిన దోషములు, కావ్యబాహిరదోషాలూ గోచరించుతవి. పద - వాక్య - పదార్థ-వాక్యార్థగతములుగా విభాగించేసి అర్వాచీనులు దోషసంఖ్యను అధికంచేశారు. కేవలం రసానికి సంబంధించిన దోషాలనుకూడా మమ్మటాదులు నిర్ణయించారు. కొన్ని దోషములకు గుణీభావమును గూడా ఆలంకారికులు చెప్పారు. దోషాలలో కొన్ని నిత్యాలు, కొన్ని అనిత్యాలు. దోషాలను పరిగణించి పాఠకులకు విసుగు కలుగచేయటం ఇష్టం కాదు. ప్రాచీనుల దోషపరిగణనం స్థూలంగా ఉన్నది. క్రమక్రమంగా సూక్ష్మపరిశీలనం చేసిన ఆలంకారికులు అనేక దోషాలను వెదికారు. దోషము సర్వకాలంలోనూ దోషమేకాని అదోషంకాదు. కొందరి పరిశీలనంలో కొన్ని పొడగట్టకపోవచ్చు. అనేక మానసిక నిబంధనలతో కూడు కొన్న శాస్త్రీయ నిబంధనలు కావ్యరంగంలో ప్రవేశం పొంది కలతపెట్ట సాగిన కాలంలో సాహితీద్రష్టలు వేరువేరు దోషాలను వెదికికూర్చారు. ఈ దోషములు ప్రాచీనపరిగణనలో లేనంతమాత్రాన వాళ్ళకు న్యూనత లేదు. మహిముడు నిపుణపరిశీలనం చేసి నూతనాన్వేషణం చేసాడు. నేటికాలంలో ప్రాంతీయ సాహిత్య సంబంధంతో భాసించు ప్రబంధములో అనేకాచుంబితదోషాలను పురోభాగులు

వెదకవచ్చు. భిన్న భాషీయ విశేషాలలో ఉన్న కలగలపు కవితలలో గోచరించు దోషా
లకు నూతన నామములను ఉంచవలసిన అవసర మున్నట్లు కవితా పద్ధతిని తరచిచూచే
భావకుల మార్గాలవలన తెలుస్తూనే ఉన్నది. భిన్నభాషా సంప్రదాయమువలన
గోచరించు దోషాలనుకూడా మమ్మటుడు దోషాలనుగా పరిగణించాడు. గౌరవ
బుద్ధిలో ప్రమాణభూతులైన ప్రాచీనుల దోషాలను దోషములుకావు అని
అనలేను. దోషాలు సర్వథా పరిత్యాజ్యాలని దండి మొదలయినవాళ్ళ అభిప్రాయం.
కావ్యం నిర్దోషం కావాలని వాళ్ళ పట్టుదల. కొంచెపుపాటి దోషాలున్నా హానిలేదని
విశ్వనాథాదు లంటారు. రసబాధాభినివేశం ఉన్నకవి రసయితకు తన్మయీభావం
కలుగజేసినపుడే కవిపదానికి అర్హుడు. అట్లాంటికవి రసమాపకములు కాని దోషాలను
అవ్యుత్పత్తి కృతంగా దొరలించినా భావకులు ఉద్వేగపడరు.

## అ లం కా రా లు

అలంకారాలు కావ్యాంగాలు. శబ్దార్థాలను ఆశ్రయించి యివి కావ్యశోభను సంపా
దించుతవి. అలంకారాలు చమత్కారాపాదక కోటిలో చేరినవి కాబట్టి అప్రధా
నాలు. అలంకారము చమత్కారకమేకాని చమత్కారరూపంకాదు. చమత్కార
మును సంపాదించే సామగ్రీకలాపము వీటిలో ఉంటుంది. చమత్కార ప్రియులైన
సహృదయులకు ఇవి అవశ్యం ఉపాదేయాలు. చమత్కారస్వరూపం వ్యంగ్యం. వ్యంజక
సామగ్రిసంపాదనమే ఆవశ్యకం అని ఆలంకారికుల అభిప్రాయము. అలంకారాలు
వ్యంజకాలే. అలంకారాలకు వ్యంగ్యతకూడా ఉన్నది. అయినా అది భూతపూర్వగతిని
ఆశ్రయించినవాదము. శ్రమణుడికి బ్రాహ్మణ్యాదికము లేకపోయినా బ్రాహ్మణ
శ్రమణుడనే వ్యవహారమున్నది. ఈతడు పూర్వావస్థలో బ్రాహ్మణ్యము కలవాడు
అనే అర్థ మీ స్థలంలో అభిమతం. అట్లాగే వ్యంగ్యాలంకారాలు; ఇవి ఒకప్పుడు అలం
కారాలుగా ఉన్నవి అనే అర్థం ఇక్కడ స్ఫురించుతుంది.

అలంకారాలసంఖ్య ఆలంకారికుల దృష్టిలో వ్యవస్థను పొందలేదు. మొదట నాలుగే
అలంకారాలు అని అన్నవారున్నారు. క్రమక్రమంగా సంఖ్య పెరిగి ది. కువలయా
నందంలో "శత మలంకారా లక్షయిత్వా నిదర్శితాః" చమత్కార మార్గము నియతం
కాదు. అంతఃకరణంలోని భావకవితను అనుసరించి మార్గాలలో నవ్యత ప్రకాశిస్తూ
ఉంటుంది. కల్పనల్లో సంకీర్ణత ఉండదనను కాని ప్రతిభా దారిద్ర్యం లేనప్పుడు
అసంకీర్ణత, వివిక్తత - వైజాత్యము ఉంటుందనక తప్పదు. సాంకర్య మున్నప్పుడు

కూడా చమత్కారబీజాలు అన్యాదృశంగానే ఉంటవి. చమత్కృతికి పరిమితిలేదు. వాగ్వికల్పాలు అనంతాలు. అందువలన చమత్కారాలలో వ్యవస్థ కుదరదు. "సహస్రశో హి మహాత్మభి రలంకారప్రకారాః ప్రకాశితాః ప్రకాశ్యంతే చ - అనంతాహి వాగ్వికల్పాః తత్ప్రకారా ఏవ చాలంకారాః" ముందు కాలంలో కూడా ప్రతిభాశాలులు ప్రకాశింపచేయగలరేమో! సహృదయత ఒకరిసొత్తుకాదు. శాస్త్రజన్యం కాదు. అది సంస్కార సిద్ధము.

అలంకార శబ్దానికి రెండు వ్యుత్పత్తులను ఆలంకారికులు సూచించారు. ఆ రెంటిలో "అలంక్రియతే అనేనేత్యలంకారః" అనే నిర్వచనమే స్వీకరణీయము. ఈ విషయాన్ని నా 'అలంకార శాస్త్రం' అనే రచనలో మనవిచేసాను. శబ్దార్థాలలో కూడుకొన్న వర్ణనా విశేషము స్వేతరవిషయాన్ని అలంకరించాలి. అలంకారాలు అలంకార్య పరతంత్రాలు కావాలి అని నియమం. ఈ నియమాన్ని అనుసరించితేనే అలంకార స్వరూపం సునిరూపితం అవుతుంది. ఇతరార్థాన్ని అలంకరించక స్వవిశ్రాంతమే అయితే అలంకారం కాలేదు. కమనీయ కామినీకుచకలశాలను అలంకరింపకుండా ఉన్న పెట్టెలోనిహారాదులు అలంకారాలుకావు. అలంకార్యస్వరూపము లబ్ధస్థితికమైతేనే అలంకారాలు శోభాహేతువులు. "అలంకారోహి చారుత్వహేతుః ప్రసిద్ధః". కావ్యములో వ్యంగ్యమే అలంకార్యము. కటకకేయూరాద్యలంకారాలు శరీరావయవసంగతాలైనా చేతనాత్మయే అలంకార్యం. అచేతనమైన శవశరీరము కుండలాదులతో కూడుకొన్నా శోభించదు. అక్కడ అలంకార్యమైన చేతనాత్మలేదు. అలంకార్యములో కూడా ఔచిత్యము అపేక్షితము. పరమహంసపరివ్రాజకశరీరము హారాదులతో కూడు కొంటే హాస్యావహము కాకపోదు. అచటి అలంకార్యము కటకాదులచేత భూషింపతగినదికాదు. ఈలోకరీతిని సహృదయులు కావ్యంలో సమన్వయించుకోవాలి. కావ్యాలంకారాల్లో వ్యంగ్యం అలంకార్యంగా వుండాలి. ఆ వ్యంగ్యం ఔచితీభూషితం కావాలి. ఈ విధంగా తలిచితే వ్యంగ్యానుగతాలంకార రచన కొంతవరకు వ్యవస్థితం కాకపోదు. అనుశాసకులు వ్యవస్థ ఉన్నదని అనగలరేకాని దానిని నియమింపలేరు. ఆ వ్యవస్థను వ్యంగ్యసౌందర్యమును బట్టి తెలుసుకోవాలి. వ్యంగ్యం వ్యవస్థితం కాదు. దానిసౌందర్యంకూడా అనుభూతిలో మాత్రం గోచరించుతుంది. అలంకార్యము అవ్యవస్థితం అయినప్పుడు అలంకారముల్లో వ్యవస్థ కుదురుబాటును పొందలేదు. అయినా ఒకరీతి వ్యంగ్యాన్ని అలంకరించటానికి సర్వాలంకారములు సమర్థాలే అని అనటానికి సాహసించే భ్రాంతలు ఉండరు. విజాతీయ సౌందర్యముతో కూడుకొన్న వ్యంగ్యం

అలంకార్యంగా ఉన్నప్పుడు దాన్ని శోభింపచేయటానికి అలంకారశతకం కూడా అవసరం కావచ్చు. అందువల్ల నేను కేచిదాహ్యాపి వికల్ప్యంతే కస్తాన్ కాక్షోపన్యాస వత్యుక్తి అని [illegible] అన్నాను. ఈ కావ్యము ఎట్లా శోభించుతుందో ఆ విధంగా కవి వచనలను [illegible] పాండిత్య ప్రకటనకై పటపట మనిపించరాదు. అలంకారమెప్పుడూ [illegible] కారాదు. అది కాకపోయినా సముగ్రతాసిద్ధికై దాన్ని సాగదీస్తే వ్యంగ్యకీర్తి వక్రీమవుతుంది. వివక్షితార్థ గౌరవమును అనుసరించి కూర్చిన క్లిష్టాలంకారమైనా శోభాదాయకము అవుతుంది. సహజాలంకారమైనా రసానుగుణమైతే పరిత్యజించవచ్చు. పండితులు కోపపడరు. రసనిర్వాహ్యానికి తాన హృదయత కవీశ్వరుడికి శోభించుతుంది. కేవలం అలంకారాలమీద ప్రయాణం ప్రతిభాదారిద్ర్యంతో కూడుకొన్న పట్టువల. ప్రాచీనాలంకారికుల అభిప్రాయంలో "అలంకృతిరలంకారః". వారి మతంలో దోషహానము గుణాదానములవలన కావ్యంలో గలిగే సౌందర్యమే అలంకారము రసచమత్కారాన్ని కూడా వారు అలంకారంగానే భావించారు. అలంకారశబ్దము వారికి భావ ల్యుడంతమే. ఇట్టి నిర్ణయంలో కూడ కొన్నా, వారు శబ్దార్థాలంకారములను నిర్ణయించటంలో సందేహింపలేదు. అనుప్రాసోపమాదుల విశిష్టచమత్కారం కలుగుతుందని అంగీకరించినవారు చమత్కార హేతుత్వమును అలంకారాలకు ఉన్నదని ఒప్పుకొన్నట్లే. కాగా వారిమతంలో కూడా 'సౌందర్యహేతు రలంకారః' అంతేకాని "సౌందర్య మలంకారః-అలంకృతిరలంకారః" కాదు. అందు వలన 'అలంక్రియతేఽనేనేత్యలంకారః'అనే వ్యుత్పత్తి అనిష్టం అయినా అంగీకార్యమే. అందువల్లనే కాబోలు వామనుడూ రెండురకాల వ్యుత్పత్తులనూ సూచించాడు. సత్యాన్ని దాచలేడు.

ఒకే అలంకార శబ్దానికి రెండువిధముల ఉత్పత్తి సహృదయులకు సమ్మతంకాదు. ఇట్లాంటి ద్వైవిధ్యము విభ్రమకము, ప్రయోజనరహితమూను. కార్యకారణాలకు ఒకే తిగుమంత్రము ఔచిత్యాన్ని కూర్చదు. ప్రాచీనులకు అలంకార్యంలేదు. ప్రధాన వ్యంగ్యరసచమత్కారంకూడా వీరిమతంలో అలంకారమే. ఈ సంప్రదాయం ఉచితం కాదు. "సత్వసావాత్మైత్వవాత్మనశ్చమత్కారహేతుః." కావ్యానికి అలంకారమే ప్రధానమనే మతాన్ని అనుసరించిన ఆలంకారికుల్లో జీవం కనపడదు. ఆనందవర్ధనుడికి పూర్వకాలంవాళ్ళలో సామాన్యంగా చమత్కారస్వరూపం సునిరూపితం కాలేదు. ఆనందవర్ధన రసమయ రచన తరువాతి సాహిత్య నిర్మాతలను భావనాపథంలో విహరింపచేసి భావకులుగా రసికులుగా మార్చింది. అభినవగుప్తునిలోచనము భావకలోచనమై

కావ్యలోకంలో వివేకం కలగచేసింది. మమ్మటపాదుని ప్రణాళిక మాననీయమై అదే సాహిత్యశాస్త్రం అనిపించింది కుంతల వక్రితలో కూడా ఆనందోన్మీలిత చైతన్యం మారువేషం వేసికొన్నది. అనుయాయుల అనువాదరచనల్లో చైతన్యము గళితము కాలేదు. సామాన్యముగా ఇన్నిగ్రంథా లవసరమా ? అని సహృదయలోకం అనుకో లేదు. 'శ్రేయసి కేన తృప్యతే.'

అలంకారము అలంకార్యమనే విభాగం ఆనందానుశిష్టమై అలరారింది. ఆతని ధ్వని అంతటా మారుమోగింది. భిన్నభిన్నవాదాలలోకూడా ఐక్యము కుదురుకొన్నది. అలంకార ప్రపంచంలో విచిత్రతఉన్నదని సహృదయుల అనుభవం. దివ్యతత్వానికి భౌతిక సమన్వయం అలంకారాల్లో కన్పించుతుంది. ఈ విషయము సామ్యగర్భాలంకారాల్లో స్పష్టము. ఉపమానోపమేయకృతమైన విచ్ఛిత్తివిశేషంతో కూడుకొన్న వాటిలో దివ్యాస్వాదాన్ని మనకు కవి అందచేస్తున్నాడు. భౌతికవస్తువులకు పరస్పర సంబంధం కొన్నిట్లోను దివ్యసంబంధం కొన్నిట్లోను భౌతికదివ్యసామరస్యం కొన్నిట్లోనూ రసయితలకు గోచరమవుతుంది. అలంకారాలు కావ్యంలో సుశ్లిష్టసన్నివేశంతో ఉంటేనే చమత్కారాపాదనచేయకలుగుతవి. సుకవీశ్వరులకు అలంకారాలు అయత్న సంపాద్యాలు, అలంకారాలన్నీ అలంకార్యమును శోభింపచేసేవిగా ఉండాలి. శబ్దాలంకారములకు ఆలంకారికులు అంతగా ప్రాధాన్యం ఈయలేదు. వాటిలో విచారించాలిసిన సూక్ష్మాంశం లేదని దీక్షితభావము. ప్రతిభాదరిద్రుడైనకవి శబ్దాలంకార ప్రియుడవుతాడు. రసాక్లిష్టచేతస్కుడు వాటిని అయత్నసిద్ధాలుగా చేస్తాడు. శబ్దాలంకారాల్లో శోభ దరిద్రాణంగా ఉంటుంది. శబ్దదారిద్ర్యపీడితుడు, వాడిన శబ్దాలనే వాడుతూ భావకులను బాధపెట్టుతాడు. శబ్దముల అనుపూర్విలోనూ వాటి సుందర గమనికలోనూ రమణీయనాదంలోనూ కమనీయత ఉండదనే రసయిత ఉండడుకాని కవి సహృదయులకు వాటిలో క్లేశం ఉన్నది.

అర్థాలంకారాలు భావ్యమాన సుందరాలు, భావనలో చక్కని పొదుపు పొందిన అలంకారాలు వ్యంగ్యరూపాపన్నాలు అవుతవి. ప్రతీయమానము మాదిరి హృదయానికి ప్రవణతను ఆపాదించి అమృతహ్రదంలో రసయితను ముంచెత్తుతవి. ఆలంకారికులకు అలంకారాల్లో అభినివేశం అధికం కావటానికి ఇది హేతువు

కావచ్చు. వారు నిబంధించిన శాస్త్రంకూడా అలంకారశాస్త్రమె అయింది. ఇతర శాస్త్రప్రమేయమును కొంతవరకు జీర్ణంచేసుకొన్న ఆలంకారికులు ప్రమాణాలంకారాలనుకూడా పరిగణించారు. వాటిలోని సౌందర్యం శాస్త్రహృదయగమ్యము. అర్థాలంకారాలచర్చ ప్రాచీనదృష్టిలో సౌందర్యముఖంగా ఉన్నది. అర్వాచీనులు శాస్త్రధూళితో ఆ సౌందర్యాన్ని కప్పిపుచ్చారు. రసగంగాధరము కొంతవరకు సౌందర్య నికషోపలము. అదికూడా అసమగ్రంకావటం సౌందర్యపిపాసువుల దౌర్భాగ్యం. భామహుడు అలంకారసుందరతను అవగాహనంచేసుకొన్నవాళ్ళల్లో అగ్రగణ్యుడు. అలంకారాలే కావ్యజీవితము అనే ఊహ ఆతడికి ఉన్నదని మనం ఊహించవచ్చు. ఔచిత్యశోభితం అయిన అలంకారఘటన, సౌందర్యవిషయంలో నిద్రాణస్వభావం ఉన్న ప్రతిభాదరిద్రులకు శక్యంకాదు.

(ఇంకా వున్నది)

# ఆకాశ గంటలు

## దేశిరాజు కృష్ణశర్మ

౧

ఆకాశంలో గంటమ్రోతలు
గంటమ్రోతలు
గణగణమంటూ గంటమ్రోతలు
పాతాళంలో చావులసందడి
భూలోకంలో పుట్టేసందడి
నాకమార్గమున నడిచేసందడి
సందడి, సందడి
గణగణమంటూ సంకడి
సందడి

౨

చచ్చేవారికి పుట్టేవారు
చచ్చినవారే పుట్టినవారు
భూలోకంలో చావులహోమం
చావులహోమం
మారణయుద్ధం చావులహోమం
పడమట యుద్ధం తూర్పున యుద్ధం
భూమ్యాకాశం పొలిమేరలలో
సాగరమధ్యం సంగరభూమిగ
యుద్ధం యుద్ధం యుద్ధం యుద్ధం

౩

చావుపుట్టుకల సంగడి తెల్పెడి
మానవ జీవిత రంకుల రాట్నం
క్రిందుమీదుగా గిరగిర తిరగగ
ప్రపంచ రంగపు పొలిమేరలలో
ఆకాశహర్మ్యపు ఆదిశిఖరంలో
గణగణమంటూ గంట మ్రోగినది.
హెచ్చరికంబుగ
నిరామయంబులో
నిప్పచ్చరంబుగ
నిర్గుణవీధిలో
నిరాశ కేళిగ
గంట మ్రోగినది
గంట మ్రోగినది
గణగణమంటూ గంట మ్రోగినది

౪

ఎద్దడిరోజులు ఎత్తుకరాగా
మాయబుద్ధులూ మంత్రిమర్మములు
హీనమార్గములు హేయపు చూపులు
కాకోలంబుగ ఘీంకారంబుగ
మాయప్రపంచం మారుపడ్డది
మునుపటిలోకం క్రిందటిరోజులు
మారిపోయినవి మారిపోయినవి
మారినసందడి మారుతు సందడి
సద్దుకువచ్చిన సందడి సందడి
సందడిరోజులు తొందరపడండి
ఎద్దడికాలం ఎత్తుకపదండి
గంట మ్రోగినది
గణగణమంటూ
ఆకాశంలో గంట మ్రోగినది

౫

నీలాకాశపు అంచుల ధగధగ
నీలిమబ్బులకు లోపల భగభగ
మెరసిపోయినది మండిపోయినది
నాగరికత్వం విజ్ఞానావధి
మానవలోకం మంటప రంగం
ఆకాశమధ్యం గుడిపై శిఖరం
రోదసిమధ్యం గుడిలో మార్గం
మాయమర్మములు మాపినగుడిలో
దాస్యభారములు రాజ్యకాంక్షలూ
ఆశాకేళియు బీదన త్రసము
గంటమ్రోతలయి గణగణ మ్రోగగ
మారుమ్రోగినది లోకంబంతట
క్రుంగిపోయినవి జీవవృక్షమున
మానవకాంక్షలు చేదుఫలములు.

౬

బ్రహ్మాండమంతటా పాయలై వరదలై
గట్లు తెంచుకపారు నాజూకునగిషీలు
నాగరికతత్వాలు రాజనాలై పండి
అడుగడుగునానిల్చి ఎదురెదురుగావచ్చి
మానవమర్యాద మంటపభూమిలో
నాగరికమనియేటి నవ్యగుడిలో నాడు
విజ్ఞానమనియేటి విగ్రహాలై వెలయు
మానవ దాస్యంబు అష్టాంగపూజగా
నాటినాటికి పూజ నిర్గుణధ్యానమై
సాగిపోతున్నది సంఘమర్యాద

నేటికో ప్రళయంబు ఏదారినోవచ్చి
నాగరికగుడిలోన నీటుగానిలుచుండి
మ్రోగింపుచున్నది మువ్వలగంట.
చిరుమీను ఈతగా చిరుసోనవానగా
పాకిపోతున్నది పెద్దమ్మతల్లి.
మైకంపు తెరగప్పి మాయగుడిలో నేడు
మానవదాష్ట్యంబు మాటపట్టింపులో
వినిపించుకోదంట గంటలమ్రోత.
కనిపింపరాదంట కానున్న నాశనము.
మ్రోగినమ్రోతగా మ్రోగుతున్నదిగంట.

గణగణమంటూ గంటమ్రోతలు.
ఆకాశంలో గంటమ్రోతలూ
గంటమ్రోతలు.

△

# — జూ —

## విశ్వనాథ సత్యనారాయణ

కలలు చమత్కారంగా ఉంటవి. మెలకువ వచ్చినతరువాత విచారిస్తే మనస్సుకు కొన్ని కష్టం కలిగిస్తవి. కొన్ని పీడకలలు వస్తవి. పీడకలలు వచ్చిన తరువాత మేలుకోగానే దోషపరిహారార్థం రామనామమన్నా చేసుకుంటే మంచిదంటారు పెద్దలు. ఆ పీడ కలలువ్రాసి ప్రచురిస్తే ఎంత దోషమో ? ఆ పరిహారమెల్లాగో !

కవితాలోభము చెడ్డది. ఏదో చమత్కారం ఉంటే సరి వ్రాయుమని బాధ పెడుతుంది. పైగా కలలలో దారీ తెన్నూ ఉండదు.

ఒక సంగతి జరిగిందంటే వీలూ చాలూ ఉండదు. చూడండి. నేనూ శ్రీకృష్ణదేవ రాయలవారూ నన్నయగారూ ముగ్గురము బయలుదేరినాము. ఎక్కడికి ?

నేను స్వర్గలోకానికి బయలుదేరినాను అనుకుంటూ! వారిద్దరూ ఏవో అధోలోకాలకి వెళ్ళుతున్నట్లుగా నవ్వుతారు.

విమానం వచ్చింది. ఎక్కమన్నాను. నన్నయ్యగారిని చూచి రాయలువారు నవ్వినారు. నేను 'విమానంకాదా' అన్నాను. నన్నయ్యగారు మొగం అదొకరీతిగా పెట్టి "ఇదొక పెద్దచేప. దానిమీసాలుచూచావా? మనం దాని కడుపులో కూర్చోవాలి. అది యెగురుతుంది. పాతాళలోకానికి వెళ్ళుతున్నాము ?" అన్నారు.

మేము దానికడుపులో కూర్చున్నాము. మాతలి చేపమీసాలు మెలివెట్టినాడు. చేపకు కోపమువచ్చి బిగ్గరగా ధ్వనిచేసింది. అతను కూడా యెక్కాడు. చేప రివ్వున ఎగిరింది.

నేను విమానం పైకి వెళుతున్నది, అంటే వారు అడుగుకి వెళుతుంది అంటారు.

విమాన మేమయిందో మేమెప్పుడు దిగినామో యెల్లాచేరినామో తెలియదుగాని మేమొక మహానగరములో ఉన్నాము. నేను నన్నయ్యగారితో 'అయ్యా! నన్నీ నగరానికి ఎందుకు తెచ్చారు'అన్నా. వారు 'ఈ ఊళ్లో ఒక జంతుప్రదర్శనశాలఉన్నది. అది చూద్దాము' అన్నారు. నేను ఇంగ్లీషులో దానిని 'జూ' అంటారుఅన్నాను. నన్నయ్యగారు నావంక నిదానించి చూచినారు. ఏమిటి అల్లాచూస్తారు అన్నాను. ఆయన నవ్వి యిల్లా అన్నారు. "నేను అదృష్టవంతుడనుగనుక విష్ణువర్ధన మహారాజు ఆస్థానంలో ఉన్నాను. లేకపోతే!" 'లేకపోతే!'

'చెప్పమంటావా! నేనెక్కడో తెలుగుపండితుడుగా ముప్పదిరూపాయీల జీతం తెచ్చుకొనేవాడను. నీవు విశ్వవిద్యాలయంలో ఏ ఎనిమిదివందలో తెచ్చేవాడివి.'

అది చమత్కారం. కలలో నాకు నేనంత జీతం తెస్తున్నట్లే అనిపించింది. అంతేకాదు: నేను నన్నయ్యగారికన్న గొప్పవాడ ననిపించింది.

'జూ'కి బయలుదేరినాము. శ్రీరాయలవారు కనిపించలేదు. రాయలవారేరని నన్నయ్యగారిని అడిగాను. నన్నయ్యగారు 'వారక్కడకు రారు. మనకు తప్పదు.' అన్నారు.

'ఎందుకు తప్పదు?'

'నేను కవిని, నీవు నాకన్న గొప్పకవివి అందుకని.'

మూర్ఖుడను కాకపోతే ఆయన నన్ను వెక్కిరిస్తున్నాడని తెలియలేదు.

బయలుదేరినాము. 'జూ' దగ్గరకు వెళ్ళినాము. నన్నయ్యగారు పేదవాడని నాకు తెలుసు. ఆయనకు రాజరాజ నరేంద్రుడిచ్చిన అగ్రహారము భుక్తము జరిపేందుకు భారతీయప్రభువు ఎచ్చటఉన్నాడు? అందుచేత టిక్కెట్లు నేనే కొన్నాను. లోపలికి వెళ్లాము.

వెళ్ళటంతోటే మొట్టమొదట ఏవో చేపలు చూచినాము. వానితరువాత తాబేళ్ళు చూచినాము. తరువాత చిన్నచిన్నమృగాలను చూచినాము. తరువాత కోతులు కనిపించినవి. నన్నయ్యగారు 'ఇక్కడ ఆగవలెను' అన్నారు.

నేను దారిపొడుగునా జంతువులను పెట్టిన బోనులమీద 'లాటిన్' భాషలోను, ఇంగ్లీషుభాషలోను వ్రాసినమాటలను తర్జుమా చేసి నన్నయ్యగారికి చెప్పుచున్నాను. ఆయన వింటున్నాడో లేదో! నేను చూడలేదు. ఒకసారి చూస్తే వినటంలేదు. ఆయనకు యీ తర్జుమాచేసి చెప్పటంలో 'ఆయనకు యింగ్లీషురాదు. నాకు వచ్చు' అన్న గర్వభావం నామనస్సులో ఉంటూనే ఉంది. ఆయన నామాటలు వినటంలేదని నాకు తెలిసేటప్పటికి నాకు ఆశ్చర్యం వేసింది. మరింకెవ్వరైనా అయితే వాడు మూర్ఖుడని అనాగరకుడని అనుకొనే వాడనే. కాని నన్నయ్యగారిని గురించి ఎట్లా అనుకోను? నేను కాకుండా యింకొకడెవ్వడైనా అయితే నన్నయ్యగారిని కూడా మూర్ఖుడే అనుకొనేవాడు. కాని భగవంతుడు నాకటువంటి అజ్ఞానం యివ్వనందుకు లోలోపల సంతోషించాను.

'ఇక్కడ ఆగమన్నారెందుకు?' అని అడిగాను.

నన్నయ్యగారు 'ఇచ్చటనుంచి మనుష్య సృష్టి బయలుదేరుతున్నది' అన్నారు. కోతులు కిచకిచలాడుచున్నవి. ముంజేతులు ముడిచి వికారముగా గోక్కుంటున్నవి.

మేము బయలుదేరినాము.

మొదట ఒక పంజరములో ఒక నీగ్రోజాతి స్త్రీ పురుషు లున్నారు. ఆ పంజరంపైన ఒక బల్ల కట్టి దానిమీద వారిని గూర్చి వ్రాసినారు. ఆ నీగ్రో స్త్రీ పురుషులు వివస్త్రలుగా ఉన్నారు. వారు మమ్ము జూచి కొట్టవచ్చినారు. నేను 'ఎందు కట్లా కొట్ట వస్తారు?' అని యడిగినాను.

అన్నట్లుగా మావెంట 'జూ' అధికారి వచ్చినాడు. అతను సమాధానం చెప్పినాడు. 'వీళ్ళని కొందరు మనుష్యులు తీసుకు

వచ్చి జంతువుల లాగా ప్రదర్శిస్తున్నారు. అందుచేత వాళ్ళకి ఏమనుష్యులనుచూచినా కోపంగానే ఉంటుంది' అని.

మరికొంతదూరం పోయినాము. అక్కడ ఒకబోనులో యింకొక యిద్దరు నీగ్రోలున్నారు. వాళ్లు దొరలకుమల్లే లాగూలు, కోట్లు, టోపీలు పెట్టుకున్నారు. నాకు నవ్వు వచ్చినది. నన్నయ్యగారు 'ఎందుకు నవ్వుతావు?' అన్నారు. నేను 'ఒక్కొక్క జాతికి ఒక్కొకరకము దుస్తులు అందము. వీళ్ళకు యీదుస్తు లేమీ అందముగా లేవు!' అన్నాను.

నన్నయ్యగారు నవ్వినాడు. ఆయననవ్వే చమత్కారము. ఆ నవ్వు పరిహాసానికో, చమత్కారానికో, అంగీకారానికో తెలియదు.

ముందరికి నడిచినాము. ఒక పంజరముమీద బల్లపైన 'ఎర్రహైందవులు' అని వ్రాసి ఉన్నది. లోపల ఎవ్వరూ లేరు. అక్కడనే యింకోచోట యింకొక బోనులో ఎర్ర హైందవులని యిద్దరున్నారు. స్త్రీపురుషులు. వారును దొరలవలె దుస్తులు వేసికొని ఉన్నారు.

మరికొంతదూరము పోయినాము. అచ్చట ఒకపెద్దబల్లమీద 'యిచ్చటనుండి హిందువుల భాగము' అని వ్రాసిఉన్నది.

నాకు కోపం వచ్చింది. 'మన భారతీయులను కూడా పంజరాలల్లో పెట్టారా?' అన్నాను. నన్నయ్యగారు నవ్వినారు. ఎందుకు నవ్వినారో నాకు తెలియలేదు. కాని అంతలో చమత్కారముగా — కల కదా — నేను కూడా ఒకబోనులో ఉన్నాను. నాకు కోపం చచ్చేటంత వచ్చింది. కోపముకొద్దీ బోను ఊచలు చేతితో గుద్దాను. చేతులు నెత్తురువచ్చినవి. దూరాన్నుంచి ఎవరో నవ్వుతున్నట్లు తోచింది. అటుతిరిగి చూచినాను. అవతల ఒకబోనులో నాస్నేహితులు చాలామంది ఉన్నారు. వాళ్ళందరూ నన్ను చూచి "ఎందుకోయీ! అల్లావిరగతోస్కుకొంటావు? సుఖంగా ఉండలేవా? దొరల మూలంగా వేళకు యింత అన్నం తింటున్నాము. సుఖపడుతున్నాము. కాలుతీసి కాలు యివతల పెట్టనక్కరలేదు. నీవు యీ 'జూ' నుంచి యింకో 'జూ' కి వెళ్లాలంటే రైళ్ళమీద తీసుకువెళతారు. విమానాలమీద తీసుకువెళతారు." అన్నారు.

ఇంతలో మళ్ళీ నేనూ నన్నయ్యగారూ కలిసి వెళ్ళుతున్నాము. భారతీయులలో రకరకాలవాళ్ళని రకరకాలబోనులలో ప్రదర్శిస్తున్నారు. మొట్టమొదటిబోనులో వంగదేశీయులున్నారు. వాళ్ళు చూచిపోవటానికి వచ్చిన దొరలతో 'షేక్ హాండు'లు యివ్వటం, ఆమామాషీ మాట్లాడటం చేస్తున్నారు. 'నేను వాళ్ళకు ఎందుకా యింత సరదా' అనుకున్నాను. 'జూ' అధికారిని అడిగాను. అత నన్నాడుగదా 'ఈ జూకి తరువాత వీళ్ళను అధికారులను చేస్తారు అని వాళ్ళనుకొంటున్నారు !' అని.

'కాబోలు' అనుకొని నేను ముందుకు నడిచాను.

ఒకచోట 'ఆంధ్రులు' అన్న బల్ల కనిపించింది. నా ప్రాణం నిలువునా నీరైంది. ఆ బల్లమీద యిల్లా వ్రాసిఉంది. 'ఆంధ్రులు అని ప్రత్యేకంగా ఒక జాతికాదు. వీళ్ళు మద్రాసీలలో ఒక భాగం. తుళులు, కొడగులు, సవరలు మొదలైన అడవిజాతుల వారి భాష వీళ్ళభాష ఒక్కటే. వీళ్ళు కూడా హిందూదేశములోని యితరజాతుల వాళ్ళకు మల్లే ఒకరిని చూచి అనుకరించటం చేస్తారు. కోతులలోనుండి మనుష్యులు పుట్టినారు కాన వీరును కోతులకిమల్లేనే ఎవరిటి వాళ్ళని అనుకరిస్తూ ఉంటారు. ఈ జాతికి పౌరుషంలేదు. ఓర్పుగలజాతి. అందుచేత బానిసతనానికి పనికివస్తుంది. వాళ్లలోకొందరికి అధికారమిస్తే వాళ్లచేత తక్కినవాళ్ళని అదుపులో ఉంచవచ్చు. ఇది హిందూ దేశస్థుల అందరి లక్షణ మని చెప్పవచ్చు. కాని ఆంధ్రులకు మరీ ప్రత్యేకలక్షణము.' దీనితో నాప్రాణము నిస్సారపడిపోయింది. తరువాత యింకా చాలా బోనులు చూచినాను. ఒకచోట 'సోవియట్ ఆంధ్రులు.' ఇంకొకచోట 'సోషియలిస్టు ఆంధ్రులు.' ఇల్లా అనేకులుగా ఆంధ్రుల్ని ప్రదర్శిస్తున్నారు. వాళ్లని చూస్తే ఆంధ్రులనుకోటానికి వీలులేకుండా ఉంది.

ఉన్నది ఉండగా ఉయ్యాలరుమీద మేదూరు వచ్చి పడినదని వాళ్ళల్లో ఎవరికో నేను కవినని తెలిసింది. అందులో ఒకడు కళ్లెఱ్ఱజేసి నావంక చూశాడు. 'నీవు మాసంగతి వ్రాశావా జాగ్రత్త!'అని నన్ను బెదరించాడు.

నేనూ, నన్నయ్యగారూ, కలసి వెళ్ళుతున్నాము. దారిపొడుగునా నన్నయ్యగారిని చూచి నవ్వుతూనే ఉన్నారు. ఆయన నడినెత్తిన గోష్పాదమంత జుట్టు, ధోవతి, ఉత్తరీయము, మొగమున గంధాక్షతలు. చొక్కాలేదు. క్రాపింగులేదు. దొరటోపీ లేదు. ఇంగ్లీషురాదు. ఇంక ఆయననుచూచి ఏ బోనుదగ్గరకు వెళ్ళినా నవ్వటం, వెక్కిరించటం.

నేను 'యిది యేదేశమా?' అని అనుకున్నాను. ఊరుబయటకు వచ్చేటప్పటికి ఒక పెద్దనది ప్రవహిస్తున్నది. ప్రక్కనే సముద్రంలో పడుతున్నది. 'ఇది స్వర్గమైతే, యిది మందాకిని. ఇచ్చట సముద్ర ముండదే!' అనుకున్నాను.

మళ్ళీ అనుకున్నాను 'ఇది భోగవతి. ఇది పాతాళలోకము. సాగరులు సముద్ర మిచ్చటనే కదా త్రవ్వినారు.'

ఇది ఏలోకమని నన్నయ్యగారిని గూర్చి అడుగబోయినాను. ఆయన కనిపించలేదు.

ఆరాత్రి రెండుగంటలవరకు నిద్రపట్టలేదు. అప్పుడు నిద్రపట్టి తెల్లకు తెల్లవారి ఈ కల వచ్చింది. మేలుకొనేటప్పటికి ప్రొద్దున్నే ఎనిమిదిగంటలైంది. పగటికలకు పాటిలేదు. అయినా లేచి అరచేతిలో 'శ్రీరామ' అని వ్రాసి కళ్ళకద్దుకున్నాను. అంతే.

# నా ప్రేయసి

**మొక్కపాటి సుబ్బారావు**

ఏడ్వ నేడ్వ, నే నేడ్వను
నా ప్రేయసి దుఃఖించును.

నా ప్రేయసి నను గాంచిన
కన్నీటిని గుర్తించును.

గుర్తించిన, నా యధరము
రేఖల్లో దుఃఖంబును—
మనస్సులో దుఃఖించును.

పాప మెంత బిగియ
బట్టుకొన్న నా ప్రేయసి
ముఖముమీది చారలలో
అగుపించును దుఃఖ రేఖ.

నా ప్రేయసి దుఃఖించిన
నోర్వజాల నోర్వజాల!

నే నిముసము నిదురించిన
నిద్దురలో నా ప్రేయసి
నిమిరి హస్త నైపుణ్యము
తో దుఃఖము తొలగించును
శాంతిపడును నా హృదయము
చల్లని హస్తము నిమురగ.

మరల నూతనోత్సాహము
జనియించును నా మోవిని—
అంత కాంచ నా ప్రేయసి
ఆనందము ఒలికించును

ఇప్పటికిని నా ప్రేయసి
నను గాంచిన వెనుతడవను

మరల మరల వేమారులు
వెనుమళ్లే కామేశ్వరి
అను బిగువున కనుబిందువు
వెడలనీయ నింక నేను

అమ్మయ్యో నా ప్రేయసి
దుఃఖించును దుఃఖించును!
నా ప్రేయసి దుఃఖించిన
నోర్వజాల నోర్వజాల!

△

నిలువున నీరై
నిలిచిపోయితిని
ప్రేయసి ప్రేమకు
పలుక సందులకు.

ఉబుకున నెగసిన
ఉత్సుక కెరటం
విరుచుకు ముణకన
విలయపరచినది
ప్రేయసి ప్రేమకు
పలుక సందులకు.

—౨౨

దీన కాంతులను
తేలిపెడి చూపుల
తిరుగ కన్నులను

తేరి చూడగను
నిలువున నీరై
నిలిచి పోయితిని.

తెరచిన కన్నుల
తెరపి లేకయే
తేర జూచితిని

తెలుపని మిన్నుల
ప్రేయసి ప్రేమకు
పలుక నందులకు.

నిలిచిన మేనున
చలనము లేకయె
చోద్యము నేకన
పొమ్మనిల్లగను
నిలువున నీరై
నిలిచిపోయితిని.

△

హృదిని నిల్పిన ప్రేయసి, నీవె
వద్దు పొమ్మన నేమి చేయుదు ?

కలల గాంచెడి ప్రేయసి, నీవె
కలత పెట్టిన నేమి చేయుదు ?

కన్ను చూపుల ప్రేయసి, నీవె
కాంతు లిచ్చెద వేమి చేయుదు ?

కనులు మూసిన ప్రేయసి, నీవె
కానుపించెద వేమి చేయుదు ?

కిలకిలా నా మోవి నవ్వులె
కలచి హృదినే విచ్చజేసెను !

చికిలి నీ చిన్నారి కన్నులె
చిటిలి నను చేరబిలిచెను

నల్లనా నీ మేనిరంగే
నన్ను బిలచును వేగిరమ్మన.

హృదిని నిల్పిన ప్రేయసి, నీవె
వద్దు పొమ్మన నేమిచేయుదు !

కలలగాంచెడి ప్రేయసి, నీవె
కలత పెట్టిన నేమి చేయుదు !

△

# తెలుగు కవిత్వములో

# "ఫాషనులు"

## నోరి నరసింహశాస్త్రి

ఫాషనులనేది కవిత్వములోకూడా ఉన్నదా అని కొందరుసందేహపడవచ్చు. మానవుడికి సంబంధించిన ప్రతిదానిలోనూ ఫాషను ఉన్నది.

పూర్వాంధ్రకవులలో 'ఫాషను'అన్నప్పుడు ఏ శ్రీనాథునితోనో "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనీ యతులిత మాధురీ మహిమ!" అనిమహాసభలో కూడా ప్రస్తావన వచ్చేటంత ప్రసిద్ధముగా విలాస పురుషుడైన ధూర్జటితోనో, అనేక కథలు చెప్పగానే పిన వీరభద్రునితోనో ప్రారంభిస్తానని మీరు ఊహించవచ్చు. వాళ్ళుకూడా ఫాషనులు కనపరచిన వారే కాని తెలుగు కవులలో కెల్లా మొదటి ఫాషను తెచ్చిన నవనాగరికుడు నన్నయ భట్టు.

ఏమిటి! "అవిరళ జప హోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు, నానా పురాణ విజ్ఞాన నిరతుడు" అయిన ఈ నన్నయభట్టు శుద్ధ ఛాందసుడుకాడా? బ్రాహ్మణాతిశయము సంగతీ, వర్ణాశ్రమ ధర్మరక్షణము సంగతీ అనుమానమేమీలేకుండా సర్వసామాన్య విషయంగా ఎక్కడపడితే అక్కడ వర్ణిస్తూ వచ్చినాడు. రాజరాజనరేంద్రుణ్ణి వర్ణిస్తూ ఆరో పద్యములోనే "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ" నొప్పుచు అనీ, తర్వాత పద్యములోనే "విప్రకులమునెల్ల బ్రోచుచు" అనీ, "అగ్రజన్ములకు నను గ్రహమున చారుతర మహాగ్రహారంబు లిచ్చుచు" అనీ అన్నాడు. ఆయనకు ఇష్టమైన నాలుగైదు వస్తువులలో, "భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతి" ఒకటి అన్నాడు. భారత శ్రవణాభిరతివల్ల "అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబు నుత్తమబహువేదవిప్రులకు దానముచేసిన తత్ఫలంబు తథ్యము సమకూరు" అన్నాడు. ఊరికే సభాపర్వంలో పుటలు తెరవగానే ఈవాక్యము కనబడ్డది. "దిగ్విజయోపార్జితంబులయిన ధనంబుల బ్రాహ్మణసంతర్పణంబును ధర్మమార్గంబులం జాతుర్వర్ణ్య రక్షణంబునుంజేసి సామ్రాజ్యంబునం బ్రకాశింపుము" అని ధర్మరాజుతో నారదు డన్నట్లున్నది. ఇంతగా బ్రాహ్మణాతిశయము తిక్కనకూడా చెప్పలేదు. ఇక నన్నయభట్టు చెప్పినదా పురాణము. ఇటువంటి అచ్ఛ సనాతనుడైన నన్నయ భట్టే తెలుగు కవిత్వములో మొదటి

ఫాషను తెచ్చినాడా! అని సందేహము ఎవరికయినా కలగడము ఆశ్చర్యముకాదు.

అయితే ఈ నన్నయభట్టే రాజసభలోని సభ్యులను—సభికులంటే తగాదా వస్తుందేమో—వర్ణిస్తూ సభలో "మృదుమధుర రస భావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులును" ఉన్నారని వర్ణించినాడు. మహాకవుల రచనలు వర్ణిస్తూ "భావ భాసురమైన"వనీ, "నవార్థ వచనము"లనీ చెప్పినాడు. ఆయన ఇప్పుడే గనక ఉంటే తప్పక 'భావ కవిత్వమూ', 'నవ్యకవిత్వమూ' ఆదరించేవా డనుకోవడములో అనుమానము ఉండదు. ఒక్క సమాసములోనే రెండూ ఉదాహరించినాడు.

ఇంతకూ ఆయన భావకవిత్వమందు అభిమానము చూపినా అటువంటిది వ్రాయలేదు కాబట్టి ఆయన తెచ్చిన 'ఫాషను' ఏమిటి? ఈ ప్రశ్నకు జవాబు చెప్పే ముందు మీరు అసలు తెలుగు భాషలో భారతము వంటి గ్రంథము పని పెట్టుకొని చెప్పడమనేదే అప్పటి పూర్వాచారపరాయణులకు ఎంత హాస్యాస్పదముగా ఉండేదో కాస్త ఊహించుకోవలె. ఇప్పటికి ఇంచుమించు వెయ్యి సంవత్సరాలబట్టీ విద్వాంసులు కవిత్వముచెప్పి పండిత పామరులను మెప్పించినారు గదా! కాని ఇప్పటికీ కూడా కేవల సంస్కృతపండితులకు తెలుగు కవిత్వమంటే ఎంత నిరసనభావ ముంటుందో తెలుసునా? అటువంటివారిలో తెలుగు వారితో తెలుగు కవిత్వము సంగతి ప్రస్తావిస్తే వాళ్లేమంటారో తెలుసునా? "మాకు తెలుగులలో అంత ప్రవేశము లేదండీ" అంటారు, ఇంగ్లీషు చదువుకొన్న కొందరు "మేము తెలుగులో వ్రాయలే"మని అంటున్నట్లు. ఆ సంస్కృత పండితుల దృష్టిలో తెనుగు కవిత్వయోగ్యమైన భాషకాదు. చివరకు అది 'తెనుగు' కూడా కాదు. "తెలుగులు!" నిత్యబహువచనము— మినుములు పెసలు వలెనే అదన్నీ.

కాళిదాసాదులుకూడా ఆదరించక తప్పక పోయిన ప్రాకృతాన్నే పూర్వపండితులు 'అపభ్రంశము' అన్నారు- గ్రామ్యమన్నట్లు. ఒక ప్రాకృతాన్ని 'పైశాచి' అన్నారు. ఇక తెలుగో! ఆ అపభ్రంశానికి అపభ్రంశము కొంతా, పైశాచికి వికృతికొంతా, సంస్కారహీనమయిన — అంటే సంస్కృతముకాని — అచ్చ తెలుగు కొంతా ఈ భాషలో కలిసింది. ఈపనికిమాలిన తెలుగు భాషలో మహాభారతమువంటి ఉద్గ్రంథము రసవంతముగా వ్రాయడానికి ఉపక్రమించినా డంటే నన్నయ దెంత సాహసము! అప్పటి కాలములోని అచ్చ సనాతనులు నన్నయభట్టును భ్రష్ట బ్రాహ్మణుణ్ణిగానో చదువురాని నవనాగరీకపు కవిగానో భావించి ఉంటారు ఇంత ఎందుకు? ఆయన

రాజాశ్రియము సంపాదించి తెలుగులో కూడా పుస్తకము వ్రాస్తున్నాడంటే- ఇప్పటి కాలపు కవిత్వము చదవకుండానే, కవులు ఎవరో తెలియకుండానే, హేళనచేసేపూర్వ పండితులూ పండితమ్మన్యులూ లేరూ ? - అట్లాగే ఆకాలపు పెద్దలు నన్నయభట్టును ఏమని హేళనచేశారో ? వ్యాస మహర్షి చెప్పిన మహాభారతము తెలుగులో రసవంతంగా వ్రాస్తాడట ఈ బ్రాహ్మడు !

ఏమయితేనేమి ? ఆ బ్రాహ్మడు పురాణాలు తెలిగించే ఫాషనే నిరాఘాటంగా కొంతకాలముపాటు సాగిపోయింది. రైళ్లూ విమానాలూ వంటి రయ సాధనాలు లేని ఆ పూర్వపురోజులలో ఫాషన్లుకూడా ఇప్పటంత తొందర తొందరగా మారేవి కావనుకొంటాను. ఇట్లా ఉండగా శ్రీనాథుడు పురాణాలతోపాటు నైషధీయ చరితము కూడా తెలుగుచేశాడు. దానితో కవుల దృష్టి సంస్కృత కావ్యాలమీదికి మళ్లింది. అట్లాగే శిశుపాలవధ, కిరాతార్జునీయము, మేఘదూతము, కుమారసంభవము మొదలైనవిన్ని అప్పటికాలపు కవులు తర్జుమా చేసిఉంటారు.

ఇంతలోకే ఈ తర్జుమా లెందుకు ? ఇతివృత్తము కాస్త పూర్వపుది పెట్టుకొని మనమే స్వతంత్రంగా సంస్కృత కవులవలె కావ్యాలు వ్రాసేతామని ఎవరికో ఒకరికి బుద్ధిపుట్టింది. ఎవరికి ఆ బుద్ధి ముందు పుట్టిందో చెప్పలేము కాని తెలుగు దేశములో ఈ రకముకావ్యాలు ఫాషనుచేసినది పెద్దన్న; వీటికి ప్రబంధాలని పేరు రావడముకూడా ఒక ఫేషనే.

ఈ ప్రబంధాల్లో శ్లేషపద్యాలుచేర్చి ప్రతి పద్యాన్నీ సానలుదీరిన జాతిరత్నంగా చేస్తూ రామరాజభూషణుడు వసుచరిత్ర చెప్పి శ్లేషకవిత్వము ఫాషనులోనికి తెచ్చినాడు. అందుమీద పిల్ల వసుచరిత్రలు పుట్టుకు వచ్చినవి !

భట్టుమూర్తివ్రాసిన పుస్తకాన్ని మించవలెనని పింగళి సూరన రాఘవపాండవీయమువ్రాసి ఒక్క కావ్యములో రెండు కథలు రెండెడ్లబండీవలె నడిపించే కొత్త ఫాషను - కాదు, అది రెండుబళ్ళకు ఒంటెద్దు కట్టి నడిపించే ఫాషను - తెచ్చినాడు. అక్కడనుంచీ నలయాదవ రాఘవపాండవీయాలు వగైరాలు ఒంటెద్దుకు నాలుగు బళ్లూ ఐదుబళ్లూ కట్టి తోలడము సాగించారు.

ఇది ఇట్లాఉండగా, ఒక పనిలేని కవికి అచ్చ తెనుగు కావ్యము వ్రాయవలెనని బుద్ధి పుట్టి వ్రాస్తే ఇంకొకడు నిరోష్ఠ్యకావ్యము వ్రాశాడు. ఇట్లా ఎవరి ఊహాకొద్దీ వాళ్లు కొత్తకొత్త ఫాషన్లు తెలుగు కవిత్వములో వెదజల్లసాగినారు. ఇదంతా "భవికవుల" సంగతి !

ఈరకంగా "భవికవు"లంతా కవిత్వసంసార సాగరములో పడి తన్నుకులాడుతూఉంటే

"శివకవులు" వారి దోవను వారు క్రొత్త ఫాషన్లు కవిత్వములోకి తీసుకు రా మొదలు పెట్టినారు. సోమనాథుడు బసవపురాణము ద్విపద కావ్యముగా జాను తెనుగులో వ్రాసినది మొదలుకొని శివకవులకు తెలుగులో ద్విపద సంస్కృతపురాణాలలో అనుష్టుభుకు పర్యాయమైపోయింది. వీళ్లు ఇంకా ఎన్నెన్ని రకాలలో పదాలు, పాటలు ఫాషను చేసినారు. అవిచాలాభాగము కాలగర్భములో అంతరించినవి.

తిక్కనసోమయాజికి ఆయన పితృదేవతను ముందుపెట్టుకొని హరిహరనాథుడు ప్రత్యక్షమై భారతము పూర్తి చేయమన్నాడు. భక్తాగ్రేసరుడైన పోతన్న గోదావరిలో గ్రహణస్నానము చేసి ఉంటే దివాస్వప్నములో శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షమై భాగవతము తెలుగులో వ్రాయమన్నాడు. తరువాత కొద్దికాలానికే కళింగ యాత్రకు పోతున్న కృష్ణదేవరాయలకు శ్రీకాకుళనాథుడు స్వప్నములో సాక్షాత్కరించి శ్రీవేంకటేశ్వరునిపేర ఆముక్తమాల్యద వ్రాయమన్నాడు. అప్పకవికి కృష్ణాష్టమినాటి రాత్రి కామేపల్లి చక్రపాణి కలలో కనబడి చెప్పి మర్నాటికి మతంగనివాసిఅయిన బ్రాహ్మణుని ద్వారా అయిదు వందల సంవత్సరాలనాడు పోయిన పుస్తకము పంపించినాడు! అప్పకవికి కలలో కృష్ణుడు చెప్పినమాటలు అసందర్భంగా ఉన్నవని మన 'సర్వవిమర్శకులు' అంటున్నారుకాని అది అప్రస్తుతము. ఇక కంకంటి పాపరాజుకు భగవంతుడు ప్రత్యక్షమై ఉత్తర రామాయణము వ్రాయమన్నాడు. "నావిష్ణుః పృథివీపతిః" అన్నట్లు 'నాథ స్త్రీః కవిశేఖరాత్' అని వాడుకలోనికి వచ్చిఉంటుంది. ఇక ఆపైని తామువ్రాసిన కావ్యము కృతిపొందడానికి సిద్ధపడ్డ ప్రభువులూ, మంత్రులూ దండనాథులూ దొరకని ప్రతికవికీ భగవంతుడు కలలో ప్రత్యక్షమై తన పేర పుస్తకాలు వ్రాయించుకొన్నాడు. దీన్నిబట్టి భగవంతుడికి తెనుగుభాషమీద ఎంత అభిమానమో బుజువు అవుతుంది' ఇక చివరకు నా పద్యాలుగోపటనో పదిహేనోపటనో నేను వ్రాయప్రారంభించిన ప్రబంధము కూడా విష్ణుమూర్తి కోరికవల్ల ఆయనకే అంకితము చేసినట్లు జ్ఞాపకము. "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్" నాకెందుకు అనుకున్నాను. ఆ ప్రబంధము అంకితము పుచ్చుకోడానికి అంతకంటె తెలివిమాలినవాడు నా కప్పట్లో దొరకలేదు! ఆ ప్రబంధము ఏది అని ఎవరయినా అడుగుతారేమో! శ్రీ శివశంకరశాస్త్రి నాచేత ఒక చిన్న ఏకాహము చేయించారు. అందులో ఆయనే స్వయంగా హోతగా ఉండి ఆప్రబంధము అగ్నిహోత్రుడికి ఆహుతి చేయించి, హవ్యవాహుడిద్వారా శ్రీ మహావిష్ణువు తిరుహస్తాలకు అందేట్లు చేసినారు. ఆ ప్రబం

థము పేరూ, ఇతివృత్తమూ మరిచిపోయినాను.

ఆధునికులలో కొక్కొండ వెంకటరత్నం పంతులు, వేదము వెంకటరాయశాస్త్రి, వాసుదాసు, వసురాయకవి, తిరుపతిశాస్త్రి ప్రభృతులు ఎన్నో ఫాషన్లు తెచ్చినారు. అయితే వారిలో తిరుపతి వెంకటేశ్వరులు పూర్వాంధ్రకవిశిఖామణులలో చివరవారనీ, నవ్యాంధ్రకవులలో మొదటివారనీ నాఉద్దేశము. వారు అవధానాలు ఫాషను చేసిన సంగతి జగద్విదితముగదా! ఇంక జంటకవిత్వ మొకటి వారు తెచ్చిన ఫాషనే. రామకృష్ణకవులు, వెంకట పార్వతీశ్వరకవులు, కొప్పరపుకవులు, శంకరదీక్షితులు (అంటే చింతా భీమశంకరము, చింతా దీక్షితులు) సత్యాంజనేయులు (అంటే విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు) శేషాద్రిరమణకవులు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావులు ఇంకా ఎంతమందో లెక్కలేదు. వెంకటశాస్త్రిగారు తెలుగుపద్యాలు చక్కగా చదివే కొత్తపద్ధతికూడా ఒకటి ఫాషను లోకి తెచ్చినారు. ఇది ఇప్పటికీ తెలుగు దేశమంతా వ్యాపించే ఉన్నది.

ఈ సందర్భములో కొప్పరపు సోదర కవులు తెచ్చిన ఫాషను చెప్పడం మరవరాదు. వారు ఆశుధార చెప్పుతూ దేశములో సంచారముచేసిన మొదటి రోజులలో వారెంత పండితాదరము గడించారో చిన్న వాళ్లకు చాలామందికి తెలియకపోవచ్చును. వారు మొదటిసారి గుంటూరువచ్చినప్పుడు నాకు పది పదకొండేళ్లు ఉంటవి అనుకొంటాను. నేను సభకు వెళ్ళలేదు. అయితే సంస్కృతాంధ్ర పండితులైన మానాన్నగారు ఆ సభకువెళ్ళివచ్చి ఇంట్లో వారిని మెచ్చుకొంటూ అన్నమాటలు నా కిప్పటికీ జ్ఞాపక మున్నవి. చాలాసేపు పరిపరి విధాల మెచ్చుకొని చివరకు సాక్షాత్తు రామకృష్ణులే అవతరించి వచ్చినారని అన్నారు! వారు ఫాషనులోకి తెచ్చిన ఆశుకవిత్వముతో పూర్వాంధ్రకవిత్వము అంతరించినది.

ఇక నవ్యాంధ్రకవిత్వములో ఫాషన్లు:

నవ్యాంధ్రకవిత్వము రాయప్రోలు సుబ్బారావుగారు ౧౯౧౩ వ సంవత్సరములో 'తృణకంకణము' ప్రకటించడముతో ప్రారంభమైనదని అస్మదాదుల మతము. దాని ప్రకాశకులు తమ పీఠికలో ఇట్లన్నారు;

"మన భాషయందలి కావ్యప్రపంచమును శాసించిన లాక్షణికులు కవిత్వమునకు పాత్రములగు విషయములకు సైతము నన్నుల్లంఘ్యమగు ప్రాకారి నిర్మించి విడిచినందున పాశ్చాత్యాదర్శముల ప్రాద్బలము దొరకునంతవరకు మన కవులు పాడిన పాటలనే పాడవలసినవారైరి...."

"కాలప్రభావమున నట్టివి భూగర్భమునుండి వెలికిదీయబడి గతకాలపుం జరిత్రసరణిం దెలుప నుపయుక్తంబు లగుటకయి వస్తు

ప్రదర్శనాగారముల నిలుపబడు విగ్రహా దుల గతిం జెందుస్థితి నుండుట యొక్క కొన్ని కారణంబులచే విషాదకరంబె....''

"లాక్షణికులు మాత్రము సర్వాధికార ధూర్వహులుకారు; సాధారణముగ భాషా సాంప్రదాయముల లక్ష్యమున నుంచుకొని కవులు తమ రచనల సర్వస్వాతంత్రులయి మెలగిరి......."

నవీన మార్గరచనలలో ముఖ్యమయినది 'లిరిక్' అను ఆంగ్లేయ రచనకు సరివచ్చు 'భావగీతము'. కవితనకు సురుచిరమగు నొక భావమును గొని అందు తన హృదయము నిమిడ్చి రచించు. ఇందు కథయు వర్ణనలు నుపాంగములు. పెరవైపులకు జింతలంబరపి యల్లుట యనవసరంబగుట నీవిధ రచనల కవిహృదయ మొక్కవిషయంబున కేంద్రీకృతమయి మిక్కిలి యాహ్లాదకరంబగును.

"దైవనియతిం బ్రసక్తమైన 'నిర్గత ప్రణయము' విశుద్ధప్రేమముగా ప్రతిఫలించు 'ప్రకృతిరహస్యమే' ఇందు వర్ణింపబడినది.'' ఈమాటలు ఇంత విరివిగా ఉదాహరించ డముకు కారణమున్నది.

తృణకంకణము, కష్టకమల, స్నేహలతా దేవి, తెనుగుతోట, స్వప్న కుమారము ౧౯౧౩—౧౯౧౪ సంవత్సరాలలో ప్రక టించినారు. అందులో 'తృణకంకణము' అభినవ కవితామండలి ప్రకటించినట్లు లేక పోయినా 'కష్టకమల' సూచికలో ఆమండలి వారు తృణకంకణముకూడా తమదే అని అది ద్వితీయప్రచురణమనుటలో సూచించి నారు. అంతకుమునుపటి 'లలిత'ను ఉదాహ రించలేదు.

నా కప్పుడు ౧౨, ౧౩ ఏళ్ళుకాబట్టి, నే న ప్పుడు ప్రబంధయుగములో ఉన్నందువల్లా ఆప్రచురణలు నాదృష్టిలోకి రాలేదు. అయితే శ్రీ శివశంకరశాస్త్రితో స్నేహ మయిన తరువాత ౧౯౧౭లో వాటికోసము ప్రత్యేకము బెజవాడవెళ్ళి రామమోహన గ్రంథాలయములో చదివినాను. నా కాపుస్త కాలు దొరకడము పేదకు పెన్నిధి దొరికి నట్లయింది. ఇంతటి కవి తెలుగుదేశంలో పుట్టినాడా అనిపించింది. ముఖ్యంగా అందు లో తెలుగుతోట ఎన్నిసార్లు చదివినానో చెప్పలేను. ఆధునిక కవులలో రాయప్రోలు వారి గ్రంథాలతో ముగ్ధులు కానివాళ్లు ఎవరూ లేరనడము అతిశయోక్తి కాదు.

అంతకుమునుపే నవ్యకవిత్వము ఉన్నా అది ప్రచారములోకి తెచ్చి భాషనులోకి తెచ్చి నది మొదట రాయప్రోలువారే. తృణ కంకణపీఠిక ప్రకాశకులు వ్రాసినట్లున్నా సుబ్బారావుగారేనో, వారి మిత్రులలో ఎవరో ఒకరు వారి ఊహాలకు అనుగుణము గానో వ్రాసినారని నానమ్మకము. కాబట్టి దానిబాధ్యత వారిదే.

అందులోనుంచిపైని ఉదాహరించినవాక్యా లవల్ల నవ్యకవుల లక్షణాలు స్పష్టపడతవి.

అందులో మొదటిది లాక్షణికులమీద దండయాత్ర. పాశ్చాత్యకవిత్వ పద్ధతుల మీదఆదరము. పూర్వకవిత్వముమీద నిరసనలేకపోయినా నిరసనమువలె స్థూలదృష్టికి కనపడే మాటలు వాడడము. ఆధునికుల మీద అభిమానము కవుల నిరంకుశత్వము ఉద్ఘాటించడము. ఇంతేకాదు. నవ్యకవిత్వ మిత్రులు కొందరూ, శత్రువు లందరునూ నేటి కవిత్వాన్ని ‘భావకవిత్వము’ అంటు న్నారు. ఆ మాట వాడకపోయినా ఆ పీఠికలో ‘Lyric’ అనే పదాన్ని ‘భావగీతము’ అని అనువదించి ‘భావకవిత్వము’ అనే పదానికి మార్గదర్శకు లైనారు. మళ్లీ ‘కష్టకమల’ సూచికలో ‘మే మీ నవ్యకవితా ప్రచారమునకు ముందడుగు మోపినప్పటి నుండియు వలయు ప్రోత్సాహ గౌరవము లబ్బినందుల కెంతయు సంతసించుచున్నాము,’ అని ప్రకాశకులువ్రాసినారు. కాబట్టి వారే ‘నవ్యకవిత’అనే నామము వాడినారు. అందులోనే ‘భావపరిచయము’ అనే శబ్దమువాడి ‘భావము’ మీద ప్రత్యేకాభిమానము చూపినారు. తెనుగుతోటలో ‘పాడుమమ్మ గీతాసఖి భావపదము’ అనేపాదము ౯సార్లు ఉచ్చరించి గీతాసఖ్యముచేసినారు.

నవ్యకవులకు ప్రణయము, ప్రకృతి, వాటి రహస్యాలూ చాలా ఇష్టమైనవని మీకు తెలుసును. పైని ఉదాహరించినవాటిలో చివరమాటలు మళ్ళీ ఎత్తి వ్రాస్తున్నాను. ‘దైవనియతిం బ్రసక్తమైన నిర్గతప్రణయము......’ఇందు వర్ణింపబడినది.

నేటి కవిత్వము అర్థముకాదు; అందుకే అది అభావ కవిత్వమని ప్రతిపక్షు లంటు న్నారు. అందులో కూడా కొంత సత్యము లేకపోలేదు. పై వాక్యానికి ఎవరైనా అర్థము చెప్పండి! తృణ కంకణము చదివిన తరవాత ఆ కథను బట్టి ఆ వాక్యము అర్థము ఊహించవలసినదే కాని ఊరకే ఆ వాక్యము అర్థముకాదు.

నవ్యకవులలో ఇంకో ఫాషను ఉన్నది. ద్వివచనములో గాని బహువచనములో గాని సభ్యులు లేకుండానే కవితామండలి స్థాపించడమునకు కూడా వారే ప్రథము లనుకొంటాను.

నవ్యకవులకు ప్రత్యేకమైన కవితాసామగ్రి ఉన్నదని అందరికీ తెలుసును. ఈ మధ్య అతి నవ్యకవులు (Ultra-moderns) తెస్తున్న సామగ్రి మాత్రము ఆయనకు తెలియదు కాని, మిగతా నవ్యకవుల కవితాసామగ్రి అంతా రాయప్రోలువారే మొదట ఫాషనులోకి తెచ్చినారు. ఈ కవితాసామగ్రిలో మొదటిది భావాలు. తర్వాతది ప్రణయము. మూడోది ప్రకృతి. దాని వెంబడి ఇంకా ఎన్నో ఉన్నవి. కోయిల ఒకటి. కోయిలమీద పద్యాలు వ్రాయని నవ్యకవి లేడు. ఇక నీరదకుమారులు కుమారహారిణులు, కవికుమారులు, మాధు

అవగి

కర కుమారులు, బ్రాహ్మణ కుమారి, లేగొల్ల కొమిరె - ఇన్ని ఎందుకు! కుమార శబ్దము ఎన్నిచోట్ల వాడవచ్చునో అన్ని చోట్లా వారువాడివేసినారు. ఇంకా కవితా సామగ్రిలోని పూదోటలు, మావిఇగుళ్ళు, శిరీషపుష్పాలు, మధువు, లతలు, కన్నెలు, రాధ, కృష్ణుడు - ఇవన్నీ రాయప్రోలువారు తెచ్చిన ఫాషనులే. నవ్యకవులకు 'షెల్లీ' మీద అభిమానము ఫాషను చేసినదికూడా వారే. చివరకు మాటలన్నీ అర్థమైనా భావము గోచరించకుండా చెప్పే కవిత్వముకు కూడా వారే అక్కడక్కడ దారి చూపించినారు. వారి తెనుగుతోట అనే కావ్యము నాకుఅభిమానమైనది. అందులో పూర్తిగా తేటగీతి వాడినారు. తేటగీతిలో ఉన్న సొగసు అంతా వారందులో చూపించినారు. 'ఆధునిక కవిత్వమంటే తేటగీతాలు వ్రాయడమా?'అని మా నాన్నగారు అడిగేవారు. ఆ ప్రశ్న తోచినది మానాన్నగారికి ఒక్కరికేకాదనుకొంటాను. నవల అంటే ముందు బాటసారిని వర్ణించడమని అయిపోయినట్టు నవ్య కవిత్వ మంటే కొంతకాలము తేటగీతి వ్రాయడ మయిపోయింది.

తేటగీతి అనేటప్పటికి వెంకట పార్వతీశ్వర కవులు వెంటనే జ్ఞప్తికి వస్తారు. వారి గీతాలు కూడా చాలా మధురంగా ఉంటవి. అయితే వారు తేటగీతి రచనలో కొత్త ఫాషను తెచ్చినారు.

ఎంత ఆనంద మున్నదో ఎవరికెరుక
ఎంత సంతోష మున్నదో ఎవరికెరుక
ఎంత ఆహ్లాద మున్నదో ఎవరికెరుక
ఎంత ఆమోద మున్నదో ఎవరికెరుక
ఎంత హర్షంబ దున్నదో ఎవరికెరుక.

ఈ విధంగా ఒక్క మాట మార్పుతో హాయిగా పంక్తులకు పంక్తులు, పేజీలకు పేజీలు పెరిగిపోయేటట్లు గీతాలల్లడము లోకానికి నేర్పినారు. ఇంకోపద్ధతి కూడా పద్యాల అల్లికలో తెచ్చినారు.

మధుర చంద్రికలలో మధురామృతంబు
మధురామృతంబులో మధురరసంబు
మధురరసంబులో మధురభావంబు
మధురభావంబులో మధురరూపంబు
మధురరూపంబులో మధురతేజంబు......

ఈ విధంగా అన్యోన్యాశ్రయమైన పదాలూ ముక్తపదగ్రస్తాలూ ఫాషను చేసినారు.

వారు తను 'ఏకాంతసేవలో' అవ్యక్త మాధుర్యము లోకములో వెదచల్లినారు. అర్థముమాత్రము నిలవదీసి అడగకూడదు. ఇంతలో ౧౯-౨౦లో సాహితిపత్రికవచ్చింది. సాహితీసమితిలో సభ్యులు ఒక్క శివశంకర శాస్త్రి మాత్రమే కాదు. సమితికవుల వల్లనే నవ్యకవిత్వానికి ఒక స్థైర్యము సమకూరింది అనడము అతిశయోక్తి కాదు. సమితిసభ్యులలో ఒకణ్ణి కాబట్టి సాహితీసమితిని గూర్చి ఎక్కువ చెబితే రసవంతముగా ఉండదేమో అని టూకీగా పోనిస్తాను. పూర్వాచారపరాయణులైన మా కొమాం

దూరి కృష్ణమాచార్యులుగారు 'తాలింఖానా' కవిత్వము వాడుకలోకి తెచ్చినారు. ఆయన వలెనే ఆయన పద్యాలుకూడా మాంసలంగా ఉంటవి. ఆయన ఆధునిక కవులందరివలె సన్నగాలికి ఎగిరిపోయేటట్లు ఉండరు. నాబోటివాళ్ళు నలుగురు ఆయన చాటున దాక్కొని ఎంత ప్రభంజన ధాటి నుంచి అయినా తల దాచుకోవచ్చును. 'విరహోత్కంఠితలో' —

> "జరఠాదిత్యమరీచికోజ్జ్వలములై
> శైలాగ్రముల్ రంజిలెన్
> సరసీజోదరబద్ధషట్పద లస
> ఝ్ఝంకార గీతామృత
> స్ఫురణన్ దుర్భరకర్ణతాప మొదవెన్
> ఫుల్లాబ్జ పత్రేక్షణుం
> డరుదేరం దడవాయె మన్మథధను
> ర్జ్యాఘోష మెట్లోర్చెదన్.
> "విలసత్కోమల నీలమేఘ రుచితో
> పీతాంబరాచ్ఛాదితో
> జ్జ్వలదివ్యాంగముతో విశాలదృఢవ
> క్షఃపీఠభాగంబులో
> బలభిద్వారణతుండకాండ నిభమౌ
> బాహుద్వయస్ఫూర్తితో
> లలనా మన్మథు డేగుదెంచునని యే
> లా వ్యర్థసంభావనల్."

ఇటువంటి పద్యాలు ఆధునికకవులు వ్రాశారంటే త్వరగా నమ్మరు. ఆయన 'కుసుమాంజలి' 'హర్ష చరిత్రము' అంతా ఇట్లాగే ఉంటవి. ఆయన నాయికలో! గాఢనితంబ భారలు, కుచకుంభ విజృంభణలు, పుంభావ క్రియాదక్షులు. అయితే ఏమి? ఆరోగ్యహీనులు ఎక్కువమంది ప్రబలుతున్న ఈ రోజులలో ఆయన తెచ్చిన ఫాషనులు నిలవడంలేదు.

ఇంతలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మాలో చేరి కవిత్వములో 'ఏడుపు' ఒకటి ఫాషనులోకి తెచ్చారు. ఆయన సరిగ్గా కృష్ణమాచార్యులవారికి కవుంటర్పార్టు (Counter part). ఆయన కృష్ణపక్షము ఎరగనివారెవరూ ఉండరు. అయితే దాని కంటె ముందు 'కన్నీరు' అనే పుస్తకము వ్రాశారు. అందులో పాటలు సర్వసామాన్యంగా తెలుగుదేశంలో బ్రహ్మసమాజ మతస్థులు అంతా పాడుతూ ఉంటారు. అక్కడినుంచీ కవులంతా ప్రణయంతోపాటు ఏడుపుకూడా సాగించినారు. ఇప్పుడు కృష్ణశాస్త్రి చాలించినా ఇప్పటికే పత్రికలలో ఏడుపు వినబడుతూనే ఉంటుంది. పెద్దన్న ఏడ్చాడు, తిమ్మన్న ఏడ్చాడు, భట్టుమూర్తి ఏడ్చాడు, శ్రీనాథుడు ఏడ్చాడు. దేవులపల్లివారితోపాటు ఏడవని నవ్యకవి లేడు. కాని కృష్ణశాస్త్రిగారు అందులో స్పెషలిస్టు.

> "మీరు మనసారగా నేడ్వనీరు నన్ను
> నన్ను విడువుడు
> వెక్కి వెక్కి రోదింతును......
> ఏడ్చినైతు నెలుంగెత్తి ఏడ్చినైతు" అన్నాడు.

విశ్వనాథ సత్యనారాయణగారు తెచ్చిన ఒకటి రెండు ఫాషన్లు చెప్పవలె. పద్యాలలో

ఆముక్తమాల్యదలోవలె ఎక్కడివో మారుమూల పదాలు వాడడమే కాకుండా పద్యాల నడకలలో క్రొత్తపోకడలకు విశ్వనాథవారు పెట్టిందిపేరు. సంస్కృతములోకంటె ఆంధ్రభాషలో ఉన్న ప్రత్యేకతే ఇది అని ఆయనమతము. ఆ సిద్ధాంతము సరియైన దనడానికి ఆయన్ని అనేక నవ్యకవులు అనుకరించడమే సాక్ష్యము.

ఇట్లా వీరంతా భావాలు ఎట్లాఉన్నా భాష మాత్రము గ్రాంథికభాష అనండి, కృతకభాష అనండి, ఆ భాషలో వ్రాస్తున్నారు. పూర్వాంధ్ర కవిత్వములో భవికవులతో పాటు శివకవులు ఉన్నట్టుగానే ఇంకొక రకము కవిత్వముకూడా సుబ్బారావుగారి కవిత్వముతోపాటు బయలు దేరింది.

గురజాడ అప్పారావుగారు వ్యావహారిక భాషలోకూడా సరసమైన కవిత్వము చెప్పవచ్చునని తమ పద్యాలవల్ల ఋజువు చేశారు. అందుకు వృత్తాలకంటె దేశీయమైన ఛందస్సులు అనుకూలమైనవని అవి వాడుకలోకి మొదట తెచ్చినారు. మన ఇళ్ళలో ప్రతిముసలమ్మకూ వచ్చిన 'గుమ్మడేడే గోపిదేవీ' అనేపాట ఉన్నదే - అది ౧౮మాత్రలుగల మాత్రాచ్ఛందస్సు-దానికి ముత్యాలసరమని పేరుపెట్టి తేటగీతికి క్రొత్త పోటీ తెచ్చినారు. వారు ఇంకా ఇతర మాత్రాచ్ఛందస్సులుకూడా వాడుకచేశారు.

అమ్మలగన్నా అమ్మల్లారా
విన్నారమ్మా ఈ కథనూ.

పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా
కొండకి నడుమా కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొకటున్నది
కొలనిమధ్యనూ కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మా
ఆయావేళల పూసే పూవులు
ఆయావేళల అందిచ్చి
బంగరు దుర్గను భక్తిలో కొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా.

ఈధోరణిలోనే బసవరాజు అప్పారావుగారు కూడా పాటలు వ్రాయడం మొదలు పెట్టినారు. చివరకు నండూరి సుబ్బారావుగారు వచ్చి శిష్టవ్యవహారభాషలోనే కాక పనిపాటులు చేసుకొనేజనము మాట్లాడే భాషలో కూడా ఉత్తమ కవిత్వము చెప్పడము సాధ్యమవుతుందని 'యెంకిపాటల'వల్ల నిరూపించినారు. దానిమీద ఎన్ని గాలికుమారాలు రేగినా, ఎవరెన్ని తిట్టినా అది నవ్యకవిత్వములో నిశ్చలంగా నిలిచిపోయింది. ఈ క్రొత్తఫాషనులో ఎంతోమంది 'కిన్నెరి' అనీ 'సీత' అనీ ఇంకా ఏమేమో పేర్లతో ముగ్ధనాయికలను సంబోధిస్తూ పాటలు అల్లడం సాగించినారు.

అప్పటినుంచీ శివకవిత్వమూ భవికవిత్వమూ ఏకమైనవి. ఈ నవ్య సాహిత్య పరిషత్తు వచ్చింది. అన్ని ఫాషనులలోకీ సరి క్రొత్త ఫాషను శ్రీ. శ్రీ. తెచ్చినాడు. పాపము! రాయప్రోలు సుబ్బారావుగారు కష్టపడి

చదివి ప్రబంధాల్లోనుంచి వీరి తెచ్చిన కవితా సామగ్రి అంతా దూరంగా ఒక్కసారి గిరాటు పెట్టినాడు. కొత్తసామగ్రి అంతా Ultra modern కవిత్వములో నుంచి కొట్టుకు వస్తున్నాడు. అతని 'మహాప్రస్థానము'లో కుళ్ళిన ఎముకలు ఉష్ణరక్త కాసారము చూపి, 'శివరాత్రిప్రభ'లో పునుకల గలగలలూ, అజకపాలం, డొక్కుడు బుకుబుక్, అశ్వరభలతో వినిపించాడు. శ్రీ శ్రీ తెచ్చిన కవితాసామగ్రి ఆయన కావ్యాలలోంచి వెతికి చెప్పవలసిన అవసరంలేకుండా నవకవనానికి ఏయే సామగ్రి కావాలో ఒక్కచోట కూర్చిపెట్టినాడు. 'నవకవిత' అనే కావ్యంలో—

'సింమారం, రక్తచందనం
బంధూకం సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా
రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళిక నాలుక
కావాలోయ్ నవకవనానికి

ఘాటెక్కిన గంధక ధూమం
పోటెత్తిన సప్తసముద్రాల్
రగులుకొనే రాక్షసిబొగ్గూ
బుగులుకొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి

రాంబందుల రెక్కల చప్పుడు
పొగగొట్టపు ధూంకారధ్వని
అరణ్యమున హరీంద్రగర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్రవిరావం
ఝంఝానిలషడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.'

గణపతిశాస్త్రి నవ్వుతూ ఇది 'శ్మశాన కవిత్వం' అన్నాడు. శ్రీ శ్రీని మించుతూ శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి' అనే కావ్యమాల వ్రాస్తున్నట్టున్నాడు. వారి 'దేశమాత'లో—

'ఎండాకాలం
పగళ్ళు సెగళ్ళు
మండే రోడ్డు
కాలం కాలిన గుడ్డపేలికై
ధూళి రేగినది.
............
వీధికాలువను బురదనీటిలో
విశ్రమించిన శ్వానాథు డొక్కడు......'

'సంక్రాంతిపండుగనాడు' అనే కావ్యములో
'కాలిన ప్రేయసిదేహం
చమురుకంపు ఈ లోకం'

అన్నాడు.

'కపాలమోక్షం' అనే కావ్యంలో

'భూతపిశాచాల్ బొబ్బరిల్లినవి
........................
తురకల గోరీలందూ
క్రైస్తవుల సమాధులలోనూ
హిందూ శ్మశానవాటుల
కపాలము(లు వికవిక నవ్వినవి

పుణికలు పులకరించినవి
కంకాళమ్ములు ఘల్లున మ్రోగినవి
........................
కపాలమోక్షం! కపాలమోక్షం!!'

ఇంతలో దేశిరాజు కృష్ణశర్మ 'దయ్యాల పెళ్ళి' చేస్తూ—

'అర్ధరాతిరి అడివిమార్గం
ఆవులించిన అంగలోకం' అనీ
'దయ్యాలు భూతాలు ప్రేతపిశాచాలు
శాకినులు ఢాకినులు కామినులు భైరవులు
బ్రహ్మరాక్షసి తండ్రి భ్రూణహత్యలతల్లి'

వీళ్ల చేత' హెహేభాయి హోహోభాయి
ఆహోహం, ఒహోహం 'అనిపించాడు.

'భవిష్యత్తు'లో—

"చింతల్ల తోపులో జీర్ణించె తొలిపొద్దు
ముండ్లలో పొదలలో రొదతోడి సొదలలో
గుబురుకొన్నదికోర్కె తమిలిపోయెను తెలివి
వల్లకాడునపురెగ్రి పాటపాడింగి." అన్నాడు

ఎంత పూర్వాచార పరాయణులు కూడా ఇది కవిత్వ మనక తప్పదు. ఈ బీభత్స మంతా ఏమిటని అంటారు. అయితే ఆలంకారికు లందరూ రసాలు ఎనిమిదన్నా, తొమ్మిదన్నా, పదన్నా అందులో బీభత్స రసముకూడా ఒకటి అని అంగీకరించారుగా! ఇంతమందినీ చెప్పి రుక్మిణీనాధ శాస్త్రి తెస్తున్న భాషను చెప్పకపోతే అతనికి కోపంవస్తుంది. అతనూ ఈ బీభత్స కవిత్వం కొంత వ్రాశాడు. దానితోపాటు అతను ఆధునిక కవుల Parody లు వ్రాశాడు. అనగా అచ్చతెలుగులో చెప్పవలసివస్తే కోతికొక్కిరాయకవిత్వ మన్నమాట. ఇతరుల కవిత్వాన్ని వెక్కిరిస్తూ అనుకరణ పద్యాలు వ్రాసేదీ, వాళ్ళెవరైనా పది అంటే మళ్ళీ నలభై పెట్టేది. అందులో అతను బాకీ ఏమాత్రమూ ఉంచుకోడు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ మధ్య సామ్యవాదులను టోపీవేయడానికి కొత్త భాషను తెస్తున్నారు. అది 'ఆకలి.' వారు 'ఊర్వశి'ని విడిచి, 'ప్రవాసము' చేసి ఇప్పుడు 'ఆకలి' చేపట్టినారు.

అయితే ఇంతమంది ఇన్ని భాషనులు తెస్తే సాహితీసమితి సభ్యుడవైన నీవేమి భాషను తెచ్చినావని నన్నడుగుతారేమో! నేనిప్పటికి ఏభాషనూ తీసుకురాలేదు. కాని ఒక్కటిమాత్రము భాషను చేయాలని ప్రయత్నిస్తూన్నాను. నేను వేదాలంటే, శాస్త్రాలంటే చెప్పుకోలేదు. కాబట్టి నాకు వాటిమీద ప్రమాణబుద్ధి ఎక్కువ. ఈ ప్రమాణబుద్ధి, అంటే సనాతనత్వము భాషను చేయవలెనని ప్రయత్నిస్తూన్నాను. ఎదురీతగా ఉన్నది. ఈ నవనాగరపుభాషను లన్నీ పోగా పోగా కొన్నాళ్ళకు ఈ ప్రమాణబుద్ధిమాత్రం భాషనుకాదా అని నా ఆశ. నవనాగరికులకు మొదట వెలమవారి మీసాలు, తరువాత తిరుపతి వెంకటేశ్వరుల కత్తెరమీసాలుగా మార్చి

వాటిని కత్తిరించి కత్తిరించి, కోసి కోసి, చివరకు ఇప్పుడు మొత్తముమీద శుద్ధ శ్రోత్రియమైన clear shave ఫాషను లోకి రాలేదా? అట్లాగే ప్రమాణబుద్ధి మాత్రము ఏ కాలానికో ఫాషను కాక పోతుందా?

కవిత్వమంటే కొత్తకొత్త ఫాషనులు తీసుకు రావడమేనా? ఎన్ని ఫాషనులు మారినా నిశ్చలంగా ఉండేధర్మము ఏదైనా ఒకటి కవిత్వానికి ఉన్నదా! అటువంటి ధర్మం ఉన్నదంటే యెవరి కవిత్వములో యెంత ఉన్నది?

పాశ్చాత్య దేశాలలో ఏదో ఒక కొత్త ఫాషను తెస్తేనేకాని పుస్తకం బాగా అమ్మకముకాదు. పుస్తకం అమ్మకము కాకపోతే కవికి జీవనోపాధి ఉండదు. కాబట్టి ప్రతికవీ ఏదో ఒకటి కొత్తది సమకూర్చాలి. రసవంతంగా చెప్పినాడా లేదా అని కాదు వారు వేసేప్రశ్న. ఏమి కొత్తది అమర్చినాడు? అని ప్రశ్నిస్తారు. అందువల్ల నవనాగరికులు పాదాలతో నడవడం చాలించి పాదరక్షలతో నడుస్తూఉంటే అతి నవనాగరికులు తల కిందా కాళ్ళు పైనా పెట్టి శీర్షాసనంతో నడవవలసి వస్తున్నది. వాళ్ళేదో పుస్తకాల అమ్మకము కోసము ఏదోవిధంగా కొత్తకోసము దేవులాడుకో వలె. అయితే మనఅదృష్టంచేత మన కా కర్మంలేదుగా! మనము వ్రాసేపుస్తకాలు విరివిగా కొనేవాళ్ళు మనదేశంలో లేరు. కొత్తగావ్రాసినా పాతగా వ్రాసినా, మెచ్చుకొన్నా తిట్టినా, మనకవులు వ్రాసే పుస్తకాలు ఖర్చుకావు. వేరే జీవనోపాధి లేకపోతే పస్తు పడుకోవలసిందే. ఇంతమంది నవ్యకవులు తమపుస్తకాలు అచ్చువేసినారు గదా! ఒక్కరైనా అచ్చుఖరీదు పుస్తకాల అమ్మకమువల్ల వసూలు చేశారూ?

ఎట్లావ్రాసినా కొననిదానికి ఈ అవస్థ లెందుకు? అవసరములేకపోయినా నూతనత్వముకోసము దేవులాడడ మెందుకు? కవిత్వములో జీవమనండి, రసమనండి, అది ఉంటే చాలదా?

# కొత్తపాట

**శివరామం**

వస్తా వస్తా
పురూరవుణ్ణి
మరోప్రపంచం
దారుల వస్తా

వస్తా వస్తా
నాయుడుబావని
తీయనిపూవుల
తోవల వస్తా

వస్తా వస్తా
హృదయేశ్వరుణ్ణి
కదిలే గాలుల
బాటల వస్తా

తెస్తా తెస్తా
మంటి జిలుగులూ
మింటి వెలుగులూ
ఎన్నో తెస్తా

తెస్తా తెస్తా
పీడని వలపులు
వేడి తలపులూ
ఎన్నో తెస్తా

తెస్తా తెస్తా
కౌశేయాలూ
కనకాభరణా
లెన్నో తెస్తా

ఇస్తా ఇస్తా
లోకం ఎరుగని
ఆకలి మరగిన
శాంతి నిస్తా

ఇస్తా ఇస్తా
లోకం మరచి
ఆకలి పిలిచే
సౌఖ్య మిస్తా

ఇస్తా ఇస్తా
లోకంలోనే
ఆకలితోనే
అన్నీ ఇస్తా

# దీక్షిత దుహిత

## = ద్వితీయ రంగము =

### శివశంకరశాస్త్రి

[వెన్నెలరాత్రి వితర్దికమీద కూరుచుండి అప్పుడు దీక్షితులు తాంబూలము వేసికొనుచుండును. సరసవాణి యించుక దూరముగా కూర్చుండి తములపాకులకు సున్నము రాయుచుండును.]

= దీక్షితులు =

నాకలోకాంగనా వీటికాకరండ
మండితోన్నత నవ సుధాఖండమట్లు
విరియుచున్నాడు శశి యుడువీథియందు
కళలు, త్రిజగదుద్దీపనకారణములు.

= సరసవాణి =

చురుకు మనిపించెనా యేమి సున్నపుచవి?
నాగవల్లీ దళంబులు నాలు గిత్తు.

= దీక్షితులు =

నాల్క పొక్కిన దని యెంచినావొ? లేదు:
అయిన నీచేతి తాంబూల మభిమతంబె.

= సరసవాణి =

బాగు! మీవంటి శ్రోత్రియ ప్రవరులకును
సాంద్ర తాంబూల చర్వణాసక్తి కలదె!

= దీక్షితులు =

చెప్పుము, గృహస్థ వీటికా సేవనమ్ము
శాస్త్రదూష్యమె యైనచో సరసవాణి!

= సరసవాణి =

అవును, తెలియును, శాస్త్రదూష్యమ్ము కాని
యట్టి దేదైన చేయుదు రన్నమాట!

= దీక్షితులు =

అవును, సరెకాని, సరస! నీ కభినవముగ
సందియం బేల కల్గె ప్రశాంతవేళ?

[లోపలినుండి గానము]

య స్యాహు రాగమవిదః పరిపూర్ణ శక్తే
రంశే కియ త్యపి నివిష్ట మముం ప్రపంచమ్,
తస్మై తమాలరుచి భాసుర కంధరాయ
నారాయణీప్రియసఖాయ నమ శ్శివాయ!

... ... ...

మంగళాంబపాట మధురమైనది సుమా,
చల్ల నైన గొంతు సహజముగనె.
చిన్నతనమునుండి చెప్పించి యున్నచో
ఒజ్జయొద్ద గాన, మొప్పియుండు.

= సరసవాణి =

కంఠ మెంత యెదుగు కలది యైనను, వాక్కు
లలిత మైన నేమి లాభ మొదవె!
మంగళోక్తి నేడు మరి యెందు లేకున్న
స్థిరము దాని నామధేయమంతె!

= దీక్షితులు =

కూడి యున్నవారు కుజ, శని, రాహువు
లష్టమమ్మునందు: అందువలన
తప్పిపోవదాయె దానికి వైధవ్య
బాధ విధికృతాన బాల్యమంతె!

= సరసవాణి =

ఈ యరుంతుద జీవన మెట్లు గడచు
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డ

కక్కటక్కట? ఏల బాల్యమ్మునంచె
చేసినారో వివాహమ్ము శీఘ్రపడుచు!

= దీక్షితులు =

శుభము కోరి యపుడు సుముహూర్తమును నిర్ణ
యించినారు పెద్ద, లిట్టు లుండ

దాని కర్మ! ఎట్టి తారాబలము గాని
చంద్రబలము గాని శక్త మగును?

= సరసవాణి =

అంతబాల్యములో శుభ మభిలషించి
పెద్ద లగువారె చేసిన పెండ్లివలన
విగత భర్తృక, బాల, జీవిత పథాన
మొండిమ్రానివిధమ్మున నుండవలసె!

= దీక్షితులు =

లోకసంగ్రహబుద్ధి వివేకు లైన
ధర్మవేత్తలు చూపిన దారివెంట
చనెడివారల కొక్కింత శ్రమమె యైన
తుదకు నిశ్శ్రేయసప్రాప్తి ధ్రువము సుమ్మ!

= సరసవాణి =

ఎంతఘోర మైన దీ లోకసంగ్రహ
మనెడిమాట! దీని ననుసరించి
ప్రాజ్ఞు లైనవారె పడుదురు కష్టాలు
అంతరంగబాధ నణచుకొనుచు.

= దీక్షితులు =

ధర్మమార్గమునందు పాదములు సుఖము
పొందు నభిలాష కట్టి పుష్పాదులు లేవు;
కానబడును వికీర్ణమై కంటకములు
గాటముగ నొప్పు లెత్తించు కరకురాలు.

= సరసవాణి =

అట్టులే యైన సుఖము లే దన్నమాట
ధర్మమార్గములో! మహాదారుణమ్ము
శాస్త్రచోదిత కర్మతజనుల విధము!
దయ నెరుంగని ధర్మశాస్త్రమ్ము లేల?

= దీక్షితులు =

కాదు కాదు సుమా! మహాకారుణికులు
ధర్మనిర్ణాయకులు, వారితలపు వేరు;
ఇహము కన్నను పరమునకే విశేష
ఫలము లోకహితమ్ముగా తలచినారు.

= సరసవాణి =

ముందు భుక్తి, యవల ముక్తి సక్రమ మగు.
తరచి చూచినారు ధర్మశాస్త్ర
విధుల నెల్ల మీరు: విధవా వివాహమే
శాస్త్రమందు గాని సమ్మతంబె?

= దీక్షితులు =

స్పష్టముగనె యమస్మృతి సమ్మతించు,
దాని తాత్పర్యమే స్థలాంతరములందు
పలుకవచ్చును వ్యాఖ్యాన బలముచేత:
పలువిధంబులు గద మహర్షుల మతాలు.

= సరసవాణి =

విగత భర్తృకలకు విధియించిన వివాహ
మేల చేయరాదో యెరుకపడదు!
హేయ మనెడి భావమే యుక్త మగునేని
శాస్త్రపంక్తు లెట్లు సమ్మతించె!

= దీక్షితులు =

ప్రౌఢవాదములో శాస్త్రబలము గాని
జనమునందు వృద్ధాచారమునకె బలము.

= సరసవాణి =

బాగు బాగు! నేడు ప్రామాణికుల నోటి
వెంట నిట్టి వాక్కు వింత గొలుపు!

[దీనవదనములో]

మన యనుంగుతల్లి మంగళజన్మంబు
బండరాయివోలె నుండవలెనె!

= దీక్షితులు =

ఏమి చేయనేర్తు మీపరికారమ్ముగా
ప్రబల కర్మఫలము పరిణమింప!
అనుభవింపవలయు నంతర్విలీన మౌ
దుఃఖభార మెట్లొ త్రోసికొనుచు.

= సరసవాణి =

భూరి కరుణార్ద్రహృదయు లౌ మీరె యిట్టు
లని యుపేక్షించుచో లోకమందు తండ్రి

లెట్లు బిడ్డల సుఖ మపేక్షించువారు!
ధర్మ మనుపేర హృదయాల దయ తొలంగు!

చూచుచుండగ సంసార సుఖములందు
మునిగి తేలెడి పెద్దల, ముద్దుబిడ్డ
ఊర్మిళవిధాన నిద్రలో నుండవలెనె!
దైవతాంశాభవము కాదె దయ మహాత్మ!

= దీక్షితులు =

చాలు జాలు నింక సరస! సంగ్రహముగా
ఏమి చేయు మందు విపుడు నన్ను?

= సరసవాణి =

మంగళాంబ మెడను మాంగల్య సూత్రమ్ము
కాంచు శుభము మరల కలుగవలయు!

= దీక్షితులు =

[ చకితుడై ]

నీవు బాగుగ యోచించినావో లేదో,
తల్లిదండ్రుల కెటు లున్న, తదితరులకు
అనఘల పునర్వివాహమే యనెడివాక్కు
శ్రవణ శూలాయమానము సరసవాణి!

= సరసవాణి =

కాదనను, గాని మీవంటి కారుణికులు,
శాస్త్రవేత్తలు బ్రాహ్మణ సంఘమందు
తొలుత పరివర్తనము చూప గలుగునెడల
ఈ విధానమె యుక్తమౌ నెల్లరకును.

= దీక్షితులు =

అలకింతు రొక్కొ ఆచారబద్ధు లౌ
విప్రు లెల్ల రిట్టి వింతమాట?
ఆచరింపకుండ నన్యుల కేరీతి
సాహసించి బోధ సలుపువాడ?

= సరసవాణి =

ఆచరించి తొలుత, ఆవల నొరులకు
ఒజ్జబంతి యగుట ఉచిత మనియె

విన్నవించుదాన! విప్రసంఘమునకు
తెరపవలయు శాస్త్ర దృక్కు మీరె.

శాస్త్రమందు మీకు చాలినవా రేరి?
ఎదురు చెప్పువార లెవరు మీకు?

అఖిలలోక గురులు, యజ్ఞదీక్షితులును,
అంతె కాక మీర లపరశివులు!

= దీక్షితులు =

ఒక్కవేళ పెండ్లి యోచింత మన్నను
అన్నివిషయములందు అర్హుడైన
వరు డెవండు దొరకు? స్వార్థాభిలాషమ్ము
సంత్యజింప మేలు సరసవాణి!

[ లోపలనుండి గానము ]

చెంగల్వలం బోలు చిన్నపాదాల
ననుగునెచ్చెలి మెట్టు నట్టి మార్గంబు
పులకితం బయి వన్నెపూసలు పూయ
రత్నకంబళి మల్లు రంగెల్లుయుండు.

నా ప్రేయసీ వదనాబ్జ సౌభాగ్య
మొందిన యీ సుందరోపవనంబు

శ్రీ ప్రయాగ మహత్ప్రసిద్ధిచే సర్వ
దేవతలకుగూడ:

అనిమిష దుర్లభం బైన యాదివ్య
మంగళ విగ్రహ మందహాస్యంబు
గ్రహియించు భాగ్యంబు కలుగు టెలాగో!
పెనగొను సంభ్రమ, భీ, విస్మయాలు!

= దీక్షితులు =

అతిమనోహరమైనదే ఆంధ్రభాష!
అన్నిరీతుల పద్యమ్ము లల్లవచ్చు.
మంగళవు నెవ్వ రిచ్చి రీమంజరులను?
చెప్పుచున్నది కవనమ్ము చిన్నతల్లి!

= సరసవాణి =

చెప్పినా వట భవద్భవిష్య రత్నంబు
చంద్రమౌళీశ్వరస్వామి యీనాడె.

= దీక్షితులు =

చెప్పుచున్నవాడె శిష్యుండు కవనమ్ము ?
సాధువర్తనుండు చంద్రమౌళి!
అచిరకాలముననె అడయప్పళిము వీడి
అతడు చేరవలయు నభిజనంబు.

= సరసవాణి =

అతనికి వెడలెడి యాసక్తి లేదు:
మీసన్నిధానాన మెలగుచునుండి
అభ్యసించినమీద అన్ని విద్యలను
స్వజనమ్ము జేరగా జనవచ్చునేమొ !

= దీక్షితులు =

వాస్తవముగ శుభమె వ్యసనితా శాస్త్రిషు.
అతని తండ్రియాజ్ఞ యగుటవలన
చేరి గృహము పెండ్లి చేసికోవలయును;
కలదు వారిదృష్టి కన్యగూడ.

= సరసవాణి =

కావచ్చు ! అతండు కదల డిచ్చోటు,
పెండ్లియాడడు వారిపిల్ల నేనాడు,
చంద్రమౌళి తెరంగు చక్కగా చెలియు,
అన్యథా నిలిచిన దాతనిదృష్టి !

= దీక్షితులు =

అన్యదృష్టి యేమి ? ఆత్రేయ పౌరుషే
యములు కలుగువాడె: ఆత్మబంధు
గణము జేరి యతడు గార్హస్థ ధర్మము
నెరపుకొనుచు పొందు నిండు సుఖము.

= సరసవాణి =

పెండ్లిమాట లతండు పెడచెవి బెట్టి
తండ్రియానతి గూడ తల దాల్పకుండ
మనయూర నిన్నాళ్లు మసలుచుండుటకు
కారణం బేదియో? గ్రహియించినారె?

[ మందహాసము చేయును ]

మమకార మతనికి మంగళమీద!
అనురాగమున పాణి అర్థించినాడు!

[దీక్షితు లాలోచనాయత్తుడగును]

[మరకతవల్లి ప్రవేశించును]

= దీక్షితులు =

తల్లి, తీయగలవె తాంబూలపు కరండ
మీ వితర్దినుండి : ఇంక జాలు
చర్వణమ్ము. చూడు సదనమ్ములో నేమి
చేయుచున్న దిపుడు చిన్నితల్లి!

= మరకతవల్లి =

మండువాకడ పట్టెమంచముమీద
పన్నుండి మంగళ పాటపాడినది;
నిద్ర పోయినదేమొ నే చూడలేదు.

* * *

అనుదినంబట్లు మీ యాననసీమ
విప్పారియుండ, కీవేళ నెందులకు
గాఢ చింతాంబుదాక్రాంత మైపోయె?

= దీక్షితులు =

చింత పట్టుకొనియె చెల్లెలి గూర్చియే !
తెలియనోపు దాని తెరగు నీకు.

[మరకతవల్లి శిరఃకంపము చేయును]

మంచి. దట్టులేని మర్మము లేకుండ
స్వీయమతము తల్లి, చెప్పవలయు.

= మరకతవల్లి =

సర్వజ్ఞులైన మీ సన్నిధానమున
ఏమి చెప్పగ నేర్తు రెవ్వారుగాని!
మీ నిర్ణయమ్మునే మిగిలినవారు
తల దాల్తు రని నాకు ధైర్యమ్ము కలదు.

= సరసవాణి =

చేయమందువ నీవు చెల్లెలిపెండ్లి ?
మంగళాంబకు చంద్రమౌళి యోగ్యుండె ?

= మరకతవల్లి =

చంద్రమౌళీశ్వర స్వామిలో లోటు
చూపజాలము; పరిశుద్ధవర్తనుడు !

మంగళాంబగళాన మాంగల్యసూత్రి,
మానసమ్మున కుంకుమారుణరేఖ,
పాదయుగ్మమ్మున పసపు, పారాణి
చూచి యెల్లరమును సుఖియించు టెపుడో !

= దీక్షితులు =

నీవు చెల్లిపెండ్లి నిస్సంశయమ్ముగా
సమ్మతంబె : చాల సంతసమ్ము !

కాని అల్లు డిపుడు గ్రామాంతరమ్మున
కేగినాడె : అతడేమి యనునో ?

= మరకతవల్లి =

అభిమతమ్మును వేర అడుగగావలెనె
మీ యానతిని వారు మీరి రేనాడు?
మంగళ స్వేచ్ఛగా మాయింటిలోన
నిజభర్తతోగూడ నివసింపవచ్చు.

= దీక్షితులు =

చెప్పినారా మీరు చెల్లెలి వార్త
అమ్మతో ముందుగా? ఆమె యే మనునో?

= సరసవాణి =

తెలియ దామెకు, మేము తెలుపుదు మింక,
అంగీకరించులే అక్క శీఘ్రముగ !

= దీక్షితులు =

గ్రహియించెనా నీలకంఠు డీవార్త?
మరి యేమి పల్కె ఉమామహేశ్వరుడు?
సమ్మతించినవాడె చంద్రావతంసు?
డీమువ్వురేమందు రెటు నాకు దెలియు!

= సరసవాణి =

చాలుచాలును మహా సంశయాపన్ను
లగుదు రేటికి మీర లనుపదమ్మునను?
మీయాజ్ఞ నెపుడేని మీరి యున్నాడె
తనయులం దొకడేని ధైర్యమ్ముపూని?

= దీక్షితులు =

జాయ యన్నను మహాసాధ్వి, పుత్రులును
వినయోజ్జ్వలుల్, కాన పీఠసమ్మతిని
పడయవచ్చును; కాని బ్రాహ్మణం బేమి
చేయునో ముందుగా చెప్పగాలేము!

= సరసవాణి =

అంగీకరించులే అఖిలలోకమ్ము!
స్థిరముగా అప్పయదీక్షితు లున్న
సర్వమ్ము వేగ సుసంపన్న మగును,
విశ్వేశ్వరుని కృపావీక్షణమ్మునను!

## = తృతీయరంగము =

[మరునాడురాత్రి. విశాలమైన గదిలో దీపము వెలుగు చుండును. ఒక పార్శ్వమున పీఠముమీద నున్న నటరాజ విగ్రహమున కెదురుగా కృష్ణాజినము పరచిన వితర్దికమీద గూర్చున్న అప్పయ దీక్షితులు గాఢముగా విచారించుచుండును. ఇంతలో నొకతలుపు తెరచుకొని సరసవాణి మరకతవల్లులు నెమ్మదిగా ప్రవేశించి దీక్షితుల సమీపమున నిలుతురు]

= సరసవాణి =

అల్లె చింతాలూత భవదీ
యాస్యవీథిక తంతుజాలము !
నీవ దేటికి హర్ష పవనము
విదళనక్రియకై ?

= దీక్షితులు =

అర్భకుని భంగి లేదు నా యంతరంగ
మోలలాడగ నానందడోలలోన!
తుంగభంగాలపై నూగు దోనెవోలె
నున్నదని పల్కినను విశేషోక్తి కాదు.

= మరకతవల్లి =

జరిపి చెల్లి వివాహమ్ము సత్వరముగ
దాని క్రిమ్మర నొకయింటిదాని జేసి
సంతసింపంగ వలసిన సమయమందు
కలుగ నేటికి నింతటి కలత మీకు ?

= దీక్షితులు =

పరిణయం బన్న నెంతటి భాగ్య మైన
కార్యమో తల్లి, గ్రహియింపగలవె నీవు ?
అదియునుం గాక విపరీత మైన క్రొత్త
దారి త్రొక్కుట బహుకష్టదాయకంబు!

= సరసవాణి =

మరల మొదటికి వచ్చినారే !
మాటి మాటికి మీకు సంశయ
మంకురించుచు నున్న కార్యం
బగుట యేలాగో !

= దీక్షితులు =

ముందు వెనుకలు చూడక తొందరపడి
అవల తాపము చెందుట అనుచితంబు.

= సరసవాణి =

సర్వ మెరిగిన ధర్మవేత్తలు
సమాలోచన యిపుడు క్రొత్తగ
చేయవలసిన దేమి ? విడువుడు
చిత్త చంచలత !

= దీక్షితులు =

విడిచిపొందు రవంత యీ వేళ నన్ను ?
నేడె తెలుపుదు మీకు నా నిర్ణయమ్ము;

[స్త్రీలు వెడలిపోవుదురు. ఆయన నటరాజవిగ్రహ
మునకు చేతులు జోడించి]

శాస్త్ర మటు పల్కు, మరి వృద్ధ సంప్రదాయ
మిట్లు కా దను; నటరాజ, ఏమిచేతు !

[కన్నులు మూసికొని ధ్యానముద్రలో నుండును.]

= వృద్ధబ్రాహ్మణ స్వరమేళ =

(అదృశ్యముగా ధ్రువాగీతి)

హర హర హర హర
అక్రమ మార్గమె
ప్రబలమయ్యెనే
బ్రాహ్మణకులమున!

శివ శివ శివ శివ
చెప్పెడి దేమిటి!
కలిపురుషునకే
గరిమ మ్మకటా!

శంభో శంకర
శాంతం పాపమ్!
విప్రవితంతూ
వివాహకార్యమె!

హర హర హర హః
అప్పదీక్షితులె
బిడ్డకు క్రమ్మర
పెండ్లి చేయునే!

యజ్ఞకర్తయే
అక్రమ పథమున
చనునెడ మన కిక
శరణం బేదీ !

శాస్త్రం బేటికి ?
సదాచారమే
వృద్ధాచారము
వృద్ధాచారము!

ఇంకే మున్నది
ఇంకే మున్నది
ప్రళయము, ప్రళయము
బ్రాహ్మణ కులమున!

హర హర హర హర
అపరశంకరుం
డనియెడి వానికి
అపర బుద్ధియా!

సామాన్యునివలె
సంభ్రమ మొందకు
అఖిల లోకనుత,
అప్పయ దీక్షిత!

= దీక్షితులు =

(కన్నులు తెరచి)

ఏమి చేయుదు శివా!
ఏమి చేయుదు నింక!
నామూలమున ఏల
నష్టమ్ము రావలయు
విమల వర్తనమైన
విప్రసంఘమ్మునకు!

(బిగ్గరగా)

తల్లి, మరకతవల్లి,
దగ్గరకు రావమ్మ!

[ఆమె ప్రవేశించి నిలుచుండును.]

ధ్యానపూర్వకముగా
తలపోసినా నమ్మ!
ఆచారసంపన్ను
లైన భూమీసురుల
కిట్టి పరిణయ మన్న
హేయమ్ముగా నుండు!
ప్రతిఘటింపగ జాల
బ్రాహ్మణ ప్రవరులను.

విప్రులనదలవివాహ
విధి సమ్మతింపరే!
ఉజ్జగించి సమాజ
ముండగలమా తల్లి!

నే వివాహము చేయ
నేర నని పిన్నితో
చెప్పి శాంతమ్ముగా,
చింతింపవల దనుము.

= మరకతవల్లి =

ఇది యేమి ఇది యేమి
ఇంతలో మీమనసు
మారినది! మంగళము
మంగళమ్మే లేక!

శాంతమ్ముగా నొక్క
సారి ఆలోచించి—
నేడె తొందర లేదు
నిర్ణయము చేయంగ—
తెలుపవచ్చును మీరు
తెల్లవారిన వెనుక.

(నిష్క్రమించును)

(దీక్షితులు కన్నులు మూసికొనును)

= యువబ్రాహ్మణస్వరమేళ =

(అదృశ్యముగా ఉత్సాహగీతిక)

అఖిలలోకనుత!
అప్పయదీక్షిత!
ఆచార్యాణా
మాచార్యోత్తమ!

అఖిల నిగమ ధ
ర్మాగమ పారగ!
అధ్వరకర్తా!
అప్పయదీక్షిత!

శాస్త్రవిదాం వర,
సజ్జనకోటికి
సర్వకాలముల
శాస్త్రమె లక్ష్యము.

వీర్యవంతులకు
వృద్ధాచారము
అంగీకారం
బగునా నిరతము!

విరిగిన రక్తము
వృద్ధాచారము,
వేమరు మారును
వివిధ విధంబుల.

యుష్మదాదులే
ఉపేక్షించుచో
అమల ధర్మమున
కగునె ప్రచారము!

పూత చరిత్రులు
పూజ్యులు మీరే
పూనుకోవలయు
పుణ్యకార్యమును.

వాదమునందును
వర్తనమందును
అప్పయదీక్షితు
లద్వితీయులే.

మే మెల్లరమును
మీ బంటులమే
అగ్నిని దుముకుదు
మానతి యగుచో!

కార్యాచరణకు
గడగుదు వేగమ!
అపర మహేశ్వర
అప్పయ దీక్షిత!

== దీక్షితులు ==

ఏమి చేయుదు శివా!
ఇపుడు దైవవిశ్యమ్ము
పట్టి లాగును గదే
బలవంతముగ నన్ను!

== వితంతువుల స్వరమేళ ==

(అదృశ్యముగా సౌమ్యగీతి)

అఖిలలోకనుత!
అప్పయదీక్షిత!
అనుకంపాంబుధి!
అప్పయదీక్షిత!

బ్రాహ్మణ వనితల
భాగ్యవశమ్మున
బహుకాలమునకు
ప్రభవ మొందితిరి!

అబ్దసహస్రము
లరిగిన మీదట
అరుగుదెంచె నీ
అమర నిమేషము!

కారుణ్యాంబుధి!
కళ్యాణము మీ
తనయుడు చేయుడు
ధర్మమార్గమున.

ఈ నిముసములో
నేయది మీరలు
చేయుదు రదియే
శిలా శాసనము!

అనదల కికపై
నా కల్పాంతము
పసుపు కుంకుమల
భాగ్యము కల్గును!

ఎండిన వృక్షము
లిక మీ కరుణను

పల్లవ సుమనస
ఫల భరితము లౌ!
భవదీయాజ్ఞను
భారత దేశము
సంతానముచే
సంపన్నం బగు!
మీకారుణ్యా
మృత సేకమ్మున
పుట్టుదు రుత్తమ
పురుషులు స్త్రీలును.
అంతరంగమున
అమృత కలశమే
కలదు నిజమ్ముగ
కరుణా వార్నిధి!
యజ్ఞ పశువునకు
నాలంభనమును
తప్పించిన ఓ
దయాసాగరా!—
చిన్ని యనదలకు
జీవన్మరణము
తొలగింపుడు మీ
దుహితృ ప్రేరణ!
ఆ సదాశివుని
అవతారంబా!
అద నుదయించిన
దనదల బ్రోవగ!
సాహసింపదగు
సకల లోక గురు!
అఖిల లోకనుత,
అప్పయ దీక్షిత!

= దీక్షితులు =

[కన్నులు తెరచి]
ఏమి చేయుదు శివా!
ఏది మార్గము నాకు!
[బిగ్గరగా]
తల్లి! మరకతవల్లి
దగ్గరకు రావమ్మ!
(ఆమె ప్రవేశించును)
చెల్లె లీరోజు నేమి
చేయుచున్నది తల్లి!

= మరకతవల్లి =

పిన్నమ్మ కూర్చుండ
బెట్టుకొని మంగళను
ఒడిలోన, ముద్దాడు
చున్న దనురాగాన.

= దీక్షితులు =

మంచి దమ్మా, పోయి
మంగళకు పరిణయము
చేయ నవకాశమ్ము
సిద్ధించు నని చెప్పు.

= మరకతవల్లి =

నిజముగా, నిజముగా!
నిర్ణయం బే తండ్రి!
సాక్షాత్తుగా ఘృణా
సాగరం బె మీరు!
(ఆనందముతో వెడలిపోవును)

= వృద్ధబ్రాహ్మణ స్వరమేళ =

[ధ్రువాగీతిక—అదృశ్యముగా]
ఆర్యధర్మవిద,
అప్పయదీక్షిత!
వర్ణసంకరము
వాంఛించెదవే!
నీవే ఈ విధి
నిర్ణయించునెడ
పాతివ్రత్యము
భంగము కాదా!

బ్రాహ్మణ సంఘపు
బంగరు వన్నియ
నష్టంబగు నీ
నవ విధానమున.

దయ దయ దయ యని
దౌర్బల్యంబున
ఆక్రోశించెద
రతిసామాన్యులు!

ధర్మము క్షురికా
ధారను బోలును!
ధర్మవీరులకు
దయతో పనియా!

ఆర్య ధర్మముల
కవలంబన మగు
యజ్ఞకర్తవే
అప్పయ దీక్షిత!

భరత వర్షమున
పాణిగ్రహణము
బ్రాహ్మణ కన్యకు
పరమ పవిత్రము!

ఆలోచింపుము
అప్పయ దీక్షిత!
ధర్మము ముఖ్యమొ
తనయయె ముఖ్యమొ!

ఆత్మకర్మఫల
మనుభవింపవలె:
తప్పింపగ మన
తరమా నిజముగ!

బహు కాలముగా
ప్రర్తిల్లు మన
వృద్ధాచారము
విడువం బోతుము!

నీ కెదు రాడెడి
నేరుపు కానము;

ఐనను మామొర
ఆలకింప దగు!

భువనములో నీ
పుత్రి పునర్భువు
అనెడి కళంకం
బలమగుండవలె!

కాయిక సౌఖ్యము
ఘనమో, నిర్వృతి
కారణధర్మము
ఘనమో, తెలుపుము!

ధర్మపీరులకు
దయతో పని లే,
దఖిలలోకనుత,
అప్పయదీక్షిత!

లోకసంగ్రహా
లోకనమే శివు
కారుణ్యంబున
కలుగును గావుత!

(దీక్షితులు కన్నులు తెరమును)

= సరసవాణి =

(ప్రవేశించి ఉత్సాహముతో)

మెచ్చుకో దగినది
మీ నిర్ణయమ్ము!
మీ నిర్ణయమ్మున
మిగుల హర్షమ్ము!
మీ నిర్ణయమ్మున
మిగిలినవారు
మిగుల హర్షము గాంత్రు
మేదినీ స్థలిని!

= దీక్షితులు =

నీకు హర్షమ్ము కలిగెడి నిర్ణయమ్ము
గా దలంపకు ముందుగా; కారణమ్ము
అడిగి నను బాధపెట్టక ఆలకించు:
చిన్నదాని వివాహమ్ము చేయజాల!

= సరసవాణి =

ఇది యేమి హరహరా!
ఇంతలో మార్పు!
శివ, శివా, ఇం కేమి
చేయ గల్గుదుము!

మరకత చెప్పిన
మంగళవార్త
సత్య మానో భ్రమా
సంజాత మానో!

= దీక్షితులు =

నేను సంపూర్ణ దృష్టితో నిర్ణయమ్ము
చేయకుండగ నేదియో చెప్పినట్టి
మాటలంబట్టి మరకత మంగళార్థ
మే గ్రహించిన, కాదు సత్యేతరంబు.

మారిపోయిన దవల నా మనసు సరస!
చిన్నతల్లి వివాహమ్ము చేయజాల!

= సరసవాణి =

మాటి మాటికి మీరు మారినరీతి
మరల నీవారము మారిపోరాదె!

= దీక్షితులు =

సాహసము నాకు లే దని సరసవాణి,
ఒక్కనిట్టూర్పుతో నూరకుండు మింక!

= సరసవాణి =

ఆహవముఖమునం దర్జునునట్లు
నిజముమారి వివాహ నిర్ణయమందు
వెనుకంజ వేసిన విప్రవీరునకు
గీతోపదేశ మే కృష్ణుండు చేయు!

= దీక్షితులు =

కంఠగత మయ్యె ప్రాణ మీ ఘూర్ణమున!
కాలకంఠేశ్వరస్వామి కాలయంబు
అచిరకాలాన నిర్మింప, నగును గాక
మరల మణిదర్పణమ్ము నామాననమ్ము!

సరస, శాంతించి యొక్కింత, చంద్రమౌళి
సత్వరంబుగ బంపు నా సవిధమునకు.

(సరసవాణి నిష్క్రమించును)

క్షంతవ్యో మేఽపరాధః
శివ శివ శివ భో
శ్రీ మహాదేవ శంభో!

(చంద్రమౌళి ప్రవేశించి అప్పయదీక్షితులకు పాదాభివందనము చేయును)

= దీక్షితులు =

చంద్రమౌళి, నీవు సత్కుటుంబమ్మున
జనన మొందినావు; జనకునాజ్ఞ
నన్యథాకరింప కాచార సంపన్న
మైన విధిని పెండ్లియాడు మోయి!

= చంద్రమౌళి =

వలదు నాకు వివాహమ్ము! వాంఛ యొకటి:
ప్రత్యహము చేయుచుండి మీ పాదసేవ,
ఆగమాఖిల దర్శనాభ్యాసమంతె
గడచిపోవును గాక నా కాల మంత!

= దీక్షితులు =

అట్టి వాంఛ విడిచి, ఆడయుప్పళము వీడి,
శీఘ్రగమనమునను సేతువునకు
పోయి, చేయవలయు పుణ్యోదకస్నాన
మంతరంగశుద్ధి యగుటకొరకు.

= చంద్రమౌళి =

చిత్తము, మహాప్రసాదము! చేసి యచట
స్నాన, మరు నెంతు నా సన్నిధానమునకు?

= దీక్షితులు =

పూర్వబంధములను పూర్వవాసనలను
కోసి, కడిగివేసికొనుట, శుభము.
సకలతాపహారి స్మరహరు కరుణచే
శర్మ మగుత నీకు చంద్రమౌళి!

(అని లేవగా, చంద్రమౌళి పాదాభివందనము చేయును. దీక్షితులు నిష్క్రమించును)

= చంద్రమౌళి =

(నటరాజ విగ్రహమునకు ప్రణమిల్లి)

క్షంతవ్యో మేఽపరాధః
శివ శివ శివ భో
శ్రీ మహాదేవ శంభో !

(మంగళాంబ మందగమనముతో
ప్రవేశించుట చూచి, లేచి)

నాకు గురువులు విధియించినారు కృపను
సేతువున కేగి స్నానమ్ము చేయు మనుచు;
పోవువాడ నహర్ముఖ పుణ్యవేళ
సెల వొసంగుము వే శాంతచిత్త వగుచు?

= మంగళాంబ =

(డగ్గుత్తికతో)

సేతుతీర్థాన స్నానమ్ము చేసి మరల
నేగుదెంతురు మాయింటి కెపుడు మీరు?

= చంద్రమౌళి =

[నిరాశా సూచక స్వరముతో]
తెలియదు మంగళా, తిరుగ నిచ్చటికి
వత్సరమ్ములకైన వత్తునో రానో!
సేతువుకడనుండి శీతాచలమ్ము
చేరగావలె తీర్థ సేవలలోన.

తిరుగ రమ్మని గురుదేవులు నాకు
అన తిచ్చినవార లనుకొంటి వేమొ!

= మంగళాంబ =

అది యేమి, గురుచరణాంతికమందు
అభ్యసింపర మీర లాగమమ్ములను?

= చంద్రమౌళి =

పూర్వ బంధంబులు, పూర్వ వాసనలు
ఛేదించి, క్షాళన చేయు మన్నారు!

= మంగళాంబ =

(రుద్ధకంఠముతో)

ఇంక నాకే మున్న దీ లోకమందు!
బ్రతికియున్నను నేను ఫల మేమి కలదు?
తొలగి పోవగ నాదు దుఃఖభారమ్ము
కాలకంఠా! నన్ను కబళింప వేమి!

(రోదనము చేయును)

= చంద్రమౌళి =

(చల్లని కంఠముతో)

శోకోపహత వౌట శుభము కా దమ్మ!
తేరుకో మంగళా, ధీమంతురాల!

= మంగళాంబ =

ఇంక మీ దర్శనంబే దుర్లభంబు!
ఏమి యాలంబనం బీజన్మమునకు!

(అతని మెడవంక జూచి)

కమనీయ మైన మీ కంఠదేశమున
చారువక్షఃస్థలీ సంగతమగుచు
వ్రేలాడుచుండు పవిత్ర రుద్రాక్ష
మాలికా మహిమచే మంగళదుఃఖ
మణగుచుండును గాక!

అర్చాపదార్థ
మగుగాక మాలిక అమరణమ్ము!

= చంద్రమౌళి =

[రుద్రాక్ష మాలిక మెడనుండి కొంచెము తొలగించి
యేమో యోచించి ఆగి]

మంగళా, మంగళా, మరచిపో వమ్మ!
గత మంతయును; దుఃఖకారణం బగును
రుద్రాక్ష మాలిక — రోదింపబోకు
అర్చింపగా నిది అర్హమ్ము గాదు.

యావ న్న యాతి మరణం
యావ న్నాక్రమతే జరా

ఇచ్ఛామాత్రేణ సకలై
రర్చనీయో హి శంకరః.

= మంగళాంబ =

బహుళ దుఃఖ ధ్వాంత బంధురం ఐన
జీవితంబున దీపశిఖ యేది యింక!

= చంద్రమౌళి =

జీయా త్కృతానఙ్గ పతఙ్గ దాహః
ఖట్వాఙ్గినో నేత్రశిఖి ప్రదీపః
య స్యాన్తికే శుభ్రదశానివేశ
శ్రియం కిరీటేన్దు కరా శ్శ్రయన్తే!

చూడోత్తంసిత చారు చన్ద్రకలికా
చంచచ్ఛిఖా భాస్వరో,
లీలాదగ్ధ విలోలకామశలభః,
శ్శ్రేయో దశాగ్రే స్ఫురన్,

అంతఃస్ఫూర్జ దపారమోహతిమిర
ప్రాగ్భార ముచ్చాటయన్
చేతస్సద్మని యోగినాం విజయతే
జ్ఞానప్రదీపో హరః !
(శాంతముగా నిష్క్రమించును)

= మంగళాంబ =

(చంద్రమౌళి కనబడునంతవరకు చూచి, పొంగి వచ్చుచున్న దుఃఖ మాపుకొని, నటరాజ విగ్రహము కడ మోకరిల్లి, చేతులుజోడించి డగ్గుత్తికలో)

మన స్తే పాదాబ్జే నివసతు,
వచః స్తోత్రే ఫణితౌ,
కర శ్చాభ్యర్చాయాం,
శ్రుతి రపి కథాకర్ణనవిధౌ,

తవ ధ్యానే బుద్ధి,
ర్నయన యుగలం మూర్తివిభవే!

నమః పార్వతీపతయే!

◆ స మా ప్త ము ◆



# సఖి

## పన్యాల వెంకటరంగనాథరావు

అదిగో నీనోములో
అత్యంతశోభతో
ముత్యాల వెలుగుతో
అలరు చున్నది ఒక్క
అలల నవ్వుల చుక్క.

ఆ నవ్వులో సఖీ,
మానమ్ము లున్నాయి
తేనెసోన లున్నాయి
గాన మాధుర్యాధ
రాల గలసిన గాధ !

*

అదిగో హృదయమ్ములో
మధురసాలతో నున్న
సుధ జల్లుటలో మిన్న
ప్రేమలో కరుణాంతో
కరుణ కెరటాలతో.
ఆ ప్రేమలో సఖీ,
అలరు సౌధా లెన్నొ
సౌధాల గదు లెన్నొ
అన్ని నీ కోసమే ?
అన్ని నా కోసమే ?

*

నడుములో నున్న
అదునైన బిగియింపు
బిగియింపులో సొంపు
సొంపులో పొడనూపు
నింపైన బిగియింపు.

ఆ చూపులో సఖీ,
ఆశతో వున్నాయి
జ్యోతులతో మెలిగాయి
క్రీగంటి కొలుకులో
తళుకు లతి బెళుకుల.

*

అదుగో దేహమ్ములో
రతనాల మెరుగాన
రగులుకొన్నవి చాల
మదనబాణా లెన్నొ
మదిలో జొచ్చిన వెన్నొ.

రావె రావే సఖీ,
మది నంద్రిమున చేప !
హృదయ వేదన మాప
బిగి కౌగిటను జేరి
పాడవే ఒక లాలి !

## ఎందులకో !

ఎందుల కీ జన్మ మనకు
ముందు నున్న మచ్చ గనక
నిలుచుంటకు గడియ లేక
నిముసమైన చూడలేక?
కొమ్మకింద నిలిచియుండి
కమ్మగడ్డి నములుచుండు
గోవునైన చూడనోచు
కోని యెందుగడ్డిపోచ . . .

కోయిలల కుహూరవాలు
రామచిలుక పలుకులున్న
చిన్నియడవి దాటునప్పు
డన్న వేళ నివురుగప్పు.

నట్టనడి దినమ్ము సాగ
నాకసాన రాత్రిలాగు
చుక్కలతో, సెలయేరుల
చూడనైన నోచలేదు . . .

సౌందర్య పిపాసి తఘుకు
ముందు లేతకాలి బెణుకు
నటన కన్నులారగ జూ
చుటకైనను నోచలేదు . . .

ఆమె లేత పెదవులైన
ఆ చక్కని నగవులైన
ఆ కడగన్నుల చూపుల
నైన జూడ వేళ లేదు . . .

పేదజన్మ మెందులకో
బాధ మనకు ఎందులకో
నిలుచుంటకు గడియలేక
నిముసమైన జూడలేక !

▽

# మాతృస్తవము

**అంబటిపూడి సత్యనారాయణ**

విడివడకుండునట్టు లరవిచ్చిన రేకుల పూల సెజ్జలో
కడక నమర్చి కప్పురపు గందవొడు లక్కనకంపు గిన్నెలం
దిడుకొని తెల్గుతల్లిరో, యదే నిను గొల్చెడి యాంధ్రదేశపుం
బడుచులు పాటపాడుదురు భవ్యభవద్విభవ ప్రభావముల్ !

పనితనమెందులో కొరతపట్టని మేల్నగిషీల కూర్పు నే
ర్పును గని తెల్గుతల్లి ! చివురుంజిగి పద్దెపుముత్తెముల్ సరా
లను రచియించి నీ యశములన్ బఠియించు నదే నవీన మో
హన కవితాకళా విలసనాంచిత భావకవీంద్ర సంతతుల్ !

కాకతి తెల్గుకత్తులకు గండరగండ తురుష్క పాదుషా
మూకల నెత్రుటేరుల గుబుల్కొను కుత్తుకసానరాలపై
కాకలదేలి, యో తెలుగుకాంతరో ! నీ యలనాటి మేటి వీ
రాకృతి కంజలించు నుదయుజ్జ్వలదగ్నికణప్రసూనముల్ !

కలన నెదిర్చి శత్రుల యఖండ చమూద్ధతి వీటిబుచ్చి పే
రలుక పరాసులం గుణపరాసుల జేసిన రావువంశపుం
దిలకము రంగరాయుని గతించిన ప్రాణ మరుత్ప్రరోహముల్
తెలుగుపడంతి ! నీవయి పదింబది వీచును చామరంబులై !



# కిటికిలో దీపం!

**శ్రీరంగం నారాయణబాబు**

జితేంద్రియుని
బుద్ధిలాగు
జయగంటలాగు
కిటికిలో
దీపం!

గోడివతల
గదిలోపల
పేరుకొన్న
కాంతి,
గోడవతల
చీకటి;
హృదయంలో
ఒకటి రెండు
వెలుతురు
గాయాలు;

స్వర్గం
నరకం,
చావు
బ్రతుకు,
గొప్ప
బీద
వ్యత్యాసం
తెలివితక్కువ
చదువెక్కువ
తారతమ్యం!

జీవహింస
చేయనని,
చూడనని
నా శపథం.

గోడమీద
గదిలోపల
వెలుతురు
కాసించి
చేరిన
జీవుల
ఆకలితో
భక్షించె
బల్లి!
.........
.........

పక్కలో
పాలుతాగె
పసిపిల్లడు
ఉక్కిరి బిక్కిరి
యైనట్టు
గొప్పగాలి
రేగింది.

గోడవతల
చీకటి నవ్వింది.
కిటికిలో దీపం
కంపించి
ఊపి త్రిస
నెత్తిపీరిలా
ఊగి ఊగి
సాగిసాగి
తెగిపోయిన
ఎఱ్ఱని రబ్బరు
ముక్కై
తెగటారెను!

యిప్పుడో
కిటికిలో
గోడివతల
గోడవతల
ఒకటే
చీకటి!
జీవరహస్యం!!!

[ రుధిరజ్యోతినుండి ]



# "చాలనీ"

## ( పుస్తక సమీక్ష )

### ఆ లోకమునుండి ఆహ్వానము

[సాంఘిక నాటకము, క్రౌను సైజు ౧౩౯ పుటలు. విద్వజ్జన మనోరంజనీ ముద్రాశాలలో ముద్రితము, వెలలేదు.]

శ్రీ పిఠాపురము యువరాజుగారు, శ్రీరావు వెంకట మహీపతి గంగాధర రామారావుగారు రచించిన సాంఘిక నాటకములలో ఇది రెండవది. మొదటిది 'స్వార్థత్యాగము' వెనుకటి సంచికలో విమర్శించడమయినది (చూ. సంపుటం ౨. సంచిక ౩. పు. ౨౪౯)

ఈ నాటకమందలి కథాసంగ్రహము:— విక్రమార్కుడనే క్షత్రియ యువకుడొకడు అగర్భ శ్రీమంతుడే అయినా కొన్నాళ్ళకు దరిద్రుడున్ను దురదృష్టవంతుడున్ను అయినాడు; అతనికి చిన్నతనమందే తల్లి చనిపోయినది. ఆధునిక యువకుల విపరీతాశయముల ననుసరించి అతడు వ్యవహరిస్తున్నాడని అతనిమీద అతని తండ్రికి కోపమువచ్చినది. అందుచేత, అతనికి అతని తండ్రిఆస్తి ఇవ్వక అతనిని ఇంటనుండి వెడలగొట్టినాడు. అతని భార్య అతనిని విడిచిపెట్టి మరిఒకడితో స్నేహంగా ఉంది. అతని కొడుకును ఆదివరకే దాయాదులు విషంపెట్టి చంపివేశారు. ఈ సంఘటనలవల్ల సంసారం మీదను, మనుష్యుల మీదను, తుదకు ప్రపంచం మీదను విసుగుపుట్టి విక్రమార్కుడు ఒకనాటి రాత్రిసమయమున ఒక ఊరి వెలుపలను నిర్జనమైన శ్మశానభూమి ప్రవేశించి వెర్రివాడివలె "మనుష్యుడా! మనుష్యుడా! ఎంతదుర్మార్గుడవు!" అంటూ పరితపిస్తూవుండగా, అతనిని మనసార ప్రేమించియుండిన అతని పూర్వ పరిచితురాలు, వసంతసేన అతని జాడ తెలియక విలపించి అతనిని వెదకుతూ ఎన్నెన్నో ఊళ్లు తిరిగి తుదకు అతనిని ఆ శ్మశానవాటికలో కలుసుకొంటుంది. చీకటిలో అతడెవ్వరయినదీ తెలియక ఆతడు తా ననుకొన్న విక్రమార్కుడు కాకపోతే తనప్రయత్నం వృథా కావడమేకాక ముప్పురాగలదని భయపడి ఆమె శ్మశాన పాలకుని వేషముతో తన మొగము మరుగుపరచుకొని అతనిని పలుకరిస్తుంది. విక్రమార్కుడు తనసాద వెళ్ళబుచ్చుతాడు. అతడు విక్రమార్కుడే అని స్పష్టమైన తర్వాత, ఆమె తనరూపం బయలుపెట్టుకొని అతనిపై తనకుగల ప్రేమ తెలియజేసి అతనిని తన యింటికి రమ్మని పిలుస్తుంది. అతడు తనకు కలిగిన విరక్తివల్లను ఆమె ఆహ్వానమును నిరాకరిస్తాడు; తన జీవనోపాధి తాను సంపాదించుకోలేక పరుల నాశ్రయించుకొని జీవించడం పౌరుషహీనంగా భావిస్తాడు. అప్పుడామె "పోనీ, నీవు నా కార్యదర్శిగా ఉండి నీజీవనోపాధి నీవు సంపాదించుకొందువుగాని రమ్మని ప్రోద్బలం చేయడమువల్ల అతడు ఆమె వెంట పోయి, ఆమె ఇంట ఉంటాడు

వసంతసేనకు ఆదివరకే పెండ్లి అయినది. కొడుకు పుట్టియుండెను. ఆమె భర్త అశోకుడు పెద్దచదువులకోసము యూరపుఖండానికి వెళ్లి ఉన్నాడు. వసంతసేన ఇంట్లో విక్రమార్కుడు ఆమె కార్యదర్శిగా ఉండగా అశోకుడు విదేశాలనుండి వస్తాడు. విక్రమార్కుడు పూర్వపరిచితుడే కనుక అతడు వసంతసేనకు కార్యదర్శిగా ఇంట్లో ఉండడం అశోకుడికి ఏమీ తప్పుగా కనబడలేదు. ఒకనాడు వసంతసేన తన స్నేహితులను (జ్యోతిర్మయీ నిర్మలులు, వకుళానందులు, వసుంధర, రామమోహనుడు అనసూయ, యశోధర మొదలగువారిని) అల్పాహారం విందుకు పిలిచింది. అందుకు కార్యదర్శిగాఉన్న విక్రమార్కుడున్ను చెలికత్తెగా ఉన్న వసుమతిన్ని ఒక హాలులో కావలసిన ఏర్పాట్లు చేస్తారు. వసంతసేన హాలులోనికి రాగానే వసుమతి ఏదో పని మీద పైకి వెళ్లిపోతుంది. ఒంటిగా ఉన్న విక్ర

మార్కుణ్ణి వసంతసేన కలుసుకొంటుంది. అప్పుడు వారిద్దరున్నూ తమ పరస్పరప్రేమ తెలియజేసు కొంటూ, కౌగిలించుకొంటూ, ముద్దుపెట్టుకొంటూ తమ ప్రేమను విడవకుందుమని ప్రమాణం చేసు కొంటారు.

అతిథులు వచ్చి అల్పాహారములు ఆరగిస్తూ ఉంటారు. వారిలో కొందరు వసంతసేనా విక్రమార్కులకు గల సంబంధం స్ఫురింపజేసే చూపులు చూస్తూ గుస గుసలాడుకొంటారు. పిమ్మట అందరున్నూ పాశ్చా త్యుల ఆచారమును అనుసరించి నృత్యం చేస్తారు. వసంతసేనా విక్రమార్కులు కలిసి నృత్యం చేస్తారు. అశోకుడున్నూ అతనితో నృత్యం చేస్తూ ఉన్న వ్యక్తిన్నీ కాక తక్కినవారందరూ వసంత సేనా విక్రమార్కులవైపు చూస్తూ ఉంటారు. "మాశావా వసంతసేన ఏంచేస్తోందో!" అని ఒకరు, "ఎంతసిగ్గుచేటు" అని మరియొకరు, "భర్త వున్నాడని కూడా జంకులేదే!" అని ఇంకొకరు— ఈ విధంగా వారు మాటలాడుకొంటారు. పిమ్మట వసంతసేన "నాకు తల తిరుగుతోంది—కిటికీ తియ్య రూ" అని గోడనుబట్టుకొని పడకుండా నిలువ ప్రయత్నిస్తూ ఉంటే, విక్రమార్కుడు ఆమెను పట్టుకొని సోఫాపై గూర్చుండబెట్టుతాడు. "మంచి మిష!" అని జ్యోత్స్నమయి వసుమతితో అంటుంది. ఈ అతిథుల గుసగుసలు, మాటలు చెవినిబడుతూ ఉండడం వల్ల అశోకుడు చాలా బాధపడతాడు. పిమ్మట అతిథులందరూ వెడలిపోతారు.

ఆ వెంటనే అశోకుడు వసంతసేనను పిలిచి "ఏమి టిదంతా?" "విక్రమార్కుడు నాయింటికి కళంకం తెచ్చాడు...అతణ్ణి వెంటనే పంపించెయ్యి" అం టాడు. "నేను చెప్పను" అంటుంది వసంతసేన. అశోకుడికి కోపం ఎక్కువవుతుంది. "పర పురుషుణ్ణి నీవు ప్రేమించవచ్చా! అది మంచిదా!" అని అత డంటే, "నాకు అతడే సర్వస్వము-అతడే భర్త, అతడే మిత్రుడు, అతడే ప్రాణప్రియుడు, అతడే దైవము" అని బదులు చెప్పుతుంది వసంతసేన. అశోకుడు మండిపడి, "నువ్వు నాయింట్లో వుండొద్దు, వెళ్లిపో - నువ్వు పతితవు" అంటాడు. "ఏం? వివాహమయినంత మాత్రాన హృదయం చచ్చిపో వలసినదేనా?" అంటుంది వసంతసేన. అశోకుడు కోపం మరి పట్టలేక "పో!" అని కేకవేయగానే ఆమె వెడలిపోతూ "నాకుమారుని మట్టుకు జాగ్ర తగా చూడండి" అని అంటుంది.

పిమ్మట వసంతసేనా విక్రమార్కులు ఒక హోటే లుకు పోయి అక్కడ ఒక గదిలో తమ అన్యోన్య ప్రేమ మనోవాక్కాయకర్మలా అనుభవిస్తూ వుం టారు అప్పుడక్కడికి వసుమతి వస్తుంది. వసంత సేనతో మాటలాడడానికి వచ్చానని ఆమె చెప్ప డంచేత విక్రమార్కుడు అక్కడనుండి లేచిపోతాడు. వసుమతి తనకున్నూ వసంతసేన కొడుకున్నూ వసంత సేనావియోగమువల్ల కలిగిన దుఃఖము తెలియ జేస్తుంది. తాను అశోకుని ప్రసన్నునిగా జేసిన విధమున్నూ వసంతసేన మరల అశోకునితో సుఖ ముగా కాపురము చేసేటట్టు తాను చేసిన పనిన్ని వసు మతి చెప్పుతుంది, "దేవీ! సత్యం చెబుతున్నాను. అతన్ని నేను కొంచెమైనా ప్రేమించలేదు. విష యవాంఛకూడా తలచలేదు. మిమ్మిద్దర్నీ మళ్లీకల పాలనే కోరిక వొకటే నాకు— నాసౌఖ్యం ఆలో చించలేదు— నా శరీరాన్నతని కర్పించాను. అతను లొంగిపోయాడు నిన్ను తిరిగి స్వీకరించడానికి సమ్మతించి నాచేతే నిన్ను రమ్మని వర్తమానం పంపించాడు... నీ కోసం నా ఆత్మనైనా బాధ లేకుండా ఇచ్చెయ్యగిలను; నాకీ శరీరత్యాగమెంత దేవీ!" అని వసుమతి అంటుంది. ఆమెచేసిన ఆ మహాత్యాగానికి వసంతసేన అభినందిస్తుంది; గాని అశోకుని వర్తమానం సరిగా ఉన్నది ఉన్నట్లు తెలుసుకో గోరుతుంది. "నిన్ను తిరిగి పరిగ్రహిస్తాను. గతము మరిచిపోయి నీ యింటిపేరు నిలవబెట్టి ప్రపంచం మాట తలచి నీ కొడుకు కోసమైనా తిరిగీ రా గోరుతున్నాను." అని అశోకుడు చెప్పు మన్నాడు అని వసుమతి తెలియచేస్తుంది. అందుకు వసంతసేన వికటమగు చిరునవ్వుతో "అంత తేలికా! విక్రమార్కుని విడిచి రమ్మనేనా దాని

సంగ్రహం! అసంభవం నేను విక్రమార్కుణ్ణి విడిచి ఎప్పటికీ రాను" అని తన నిశ్చితాభిప్రాయము తెలియజేస్తుంది. వసుమతి తన ప్రయత్నం విఫలమైనందుకు దుఃఖిస్తుంది. వసంతసేన తన బిడ్డను విడిచిపెట్టవలసి వచ్చినందుకు మాత్రమే దుఃఖిస్తుంది: "ప్రస్తుతం ప్రపంచయాత్రకు బయలు దేరుతున్నాం. చూస్తూ, రేపు రాత్రి మా స్టీమరు బయలుదేరుతుంది. అలోపున నీ వొక్కసారి నా బిడ్డను చూపించవూ!" అంటుంది. అందుకు వసుమతి ప్రయత్నిస్తానంటుంది.

లోకులు తననుగురించి ఎగతాళిగా మాటలాడుకొంటున్నారని వసుమతి తెలియజేసినప్పుడు "లేని ప్రేమను ప్రదర్శించి మోసంచేస్తూ ఎవరినీ నిజంగా ప్రేమించక కేవలం విషయభోగాలతో కాలం గడపడంలేదని వాళ్ళందరికీ నా మీద అసూయ, కోపం...నిజమైన ప్రేమా, దాని ఆనందం వాళ్ళకేం తెలుసు? వాళ్ళలాగ కాక బహిరంగంగా దైవ సన్నిధిని నేను హృదయపూర్వకముగా ప్రేమిస్తోన్న నా ప్రాణప్రియుడితో వెడుతోన్నందుకు నేను కులట నట; వాళ్ళు పతివ్రతలట — ప్రపంచం!" అని వసంతసేన తనకున్నూ, తన ప్రవర్తనను ఆక్షేపించే స్త్రీలకున్నూ గల తారతమ్యం ప్రకటిస్తుంది.

ఎట్టి ఆశయములు గలవాడుగా తన కుమారుని వసుమతి పెంచి పెద్దను చేయవలెనో వసంతసేన వసుమతికి చెబుతుంది; "వసుమతీ! నాబిడ్డనిమాత్రం ఈనాడు ప్రపంచంలో వుండే జనులలో వొకణ్ణిగా మాత్రం కానివ్వకు, కాపట్యాన్ని చేయనియ్యకు - సత్యవాదిగా సత్యవర్తనుణ్ణిగా, దైవభక్తుణ్ణిగా చెయ్యి, ఈపాపిష్ఠి సంఘాన్ని తనదివ్యవర్తనం చేత ముక్కముక్కలుగా చేసి సత్యాన్ని, సత్యమైన ప్రేమనీ స్థాపించే వాణ్ణిగా చేయి. ఇంకొకమాట - తనతల్లి యొక్క పూజ్య ప్రేమనీ, దాని సంబంధమైన త్యాగం ఏమైనా వుంటే దాన్ని గ్రహించేట్టు చెయ్యి" అని తన కోరిక తెలియ జేస్తుంది.

"పోనీ నీవు విక్రమార్కుణ్ణి పెండ్లి చేసుకోరాదా" అని వసుమతి అంటే, "వీలులేదు - ప్రస్తుతం హిందూమతం ప్రకారం చేయబడ్డ వివాహాలలో స్త్రీ ఎంత కృశించి నశించినా ఆమెకి విడాకులు లేవు. న్యాయశాస్త్రం కూడా వివాహిత అయిన స్త్రీ ఇంకొకర్నెంత ప్రేమించినా అతన్ని వివాహం చేసుకోడాని కనుమతివ్వదు" అని విలపిస్తూ, "ఏమత ప్రకారమైన వివాహాలకైనా విడాకులు - కొన్ని పరిస్థితులలో ఏషరతులు లేని సంపూర్ణమైన విడాకులు — అంటేనే గాని సంఘములో సౌఖ్యం వుండదు" అని తన సిద్ధాంతాన్ని ప్రకటిస్తుంది వసంతసేన.

"విక్రమార్కుడో మరి" అంటుంది వసుమతి. అంటే 'విక్రమార్కుడు కూడా ఇదివరకు పెండ్లి చేసుకొని ఉన్నవాడేకదా. అతని విషయంలో విడాకుల సంగతి ఏమి?' అని వసుమతికి గల సందేహ మన్నట్లు భావించుకొని "అతను రిజిస్ట్రేషను ప్రకారం వివాహం చేసుకోబట్టి వాళ్ళవివాహ బంధం తెగిపోవడానికి వీలుండి ఉండవచ్చును" అంటుంది వసంతసేన.

తుదకు వివాహ సంస్థావశ్యకత గురించి వసంతసేన తన అభిప్రాయం వెల్లడిస్తుంది. "నాకు ప్రపంచం కోసం చేసుకునే వివాహం అంతముఖ్యం కాదు. ఎప్పుడైతే నేనూ విక్రమార్కుడూ అన్యోన్యమూ ప్రేమించుకొన్నామో ఆ క్షణాన్నే మాకు దివ్య వివాహం అయింది" అని అంటుంది.

ఇకను వసుమతి వసంతసేనమతమును పూర్తిగా గ్రహించి తన గతప్రవర్తన సమర్థించుకొంటూ తన సంకల్పమును తెలియజేస్తుంది.

"నీ కోసం నా శరీరాన్ని అశోకుడి కర్పించాను, గాని ఇంక దానిని బట్టి అతడు మళ్లీ నా దగ్గరికి రాలేడు. నే నతన్ని తిరిగి స్పృశించనైనా స్పృశించను. నా హృదయ మతనిది కాదు. అగ్ని ఎలాగ భయంకరమై తాకడాని కసాధ్యమో నేనూ అంతే" అంటుంది. అందుకు వసంతసేన వసుమతిని అభినందించి, "నువ్వు మహోత్తమురాలవు" అని మెచ్చుకొంటుంది.

వసంతసేనతో అశోకుని వర్తమానం చెప్పడానికి వసుమతి వచ్చినట్లే విక్రమార్కునితో అతని తండ్రి వర్తమానం చెప్పడానికి అనసూయ వస్తుంది. "విక్రమార్కా! మీ తండ్రి చాలా నొచ్చుకొన్నాడు నీ నడత చూసి; వంశానికి అపకీర్తి వచ్చిందే అని వాపోయాడు సంగతంతా విని. అతడు పెద్ద వాడు. నీతో ఒకమాట చెప్పమన్నాడు. నీ భార్య మళ్ళీ నీ దగ్గరకొచ్చి ఎల్లప్పుడూ నువ్వు చెప్పినట్లు నడుచుకొంటుందట. నువ్వు మళ్ళీ ఇంటికివచ్చి పూర్వంలాగే వుంటూంటే తన ఆస్తినంతా నీకిచ్చేస్తాడట. గతం మఱచిపోవచ్చును" అని అనసూయ చెబుతుంది.

"నాకేమీ అవసరంలేదు,ఇదే నాసమాధానం" అని విక్రమార్కుడంటాడు. "విక్రమార్కా! తొందరపడకు" అని వసంతసేన అంటుంది. విక్రమార్కుడేమంటాడో చూదామని గాని విక్రమార్కుడు లొంగలేదు.

"స్నేహితులం మేము ప్రజల మాటలు వినలేక పోతున్నాం" అని అనసూయ చెప్పినా వారు లక్ష్యంచేయరు. నీదగ్గ నీవు విడాకు లివ్వడు, మీకనేక ఆటంకాలు కలుగుతాయి" అన్నా వసంతసేన భయపడదు. "నీకు ప్రభుత్వంలో వొక అమాత్యపదవి యిస్తారట" అని ఆశపెట్టినా విక్రమార్కుడు లొంగడు.

పిమ్మట, వసంతసేనా విక్రమార్కులు స్టీమరెక్కి దూరదేశం పోవడానికి నిశ్చయించుకొని సముద్రతీరం చేరుకొంటారు. ఏదో ఒక లా సెక్షన్ తెచ్చి అశోకుడు తమ ప్రయాణం సాగనీయకుండా పోలీసువాళ్ళతో సిద్ధమవుతాడన్న భయం ఉండడం చేత వసంతసేనా విక్రమార్కులు హార్బరుకు వెళ్ళక మరియొక చోటికి లాంచీ తెప్పించుకొని స్టీమరు అందుకొందామని చూస్తారు. కాని గాలీ వానా రావడంచేత లాంచీ రాలేదు. ఏదో ఒక చిన్న పడవైనా ఎక్కిపోవడానికి నిశ్చయించుకొని పడవ వాండ్లదగ్గరకు వస్తారు.

"మబ్బు గాఢంగా పడుతోంది; గాని, దూరాన్ని వున్న ఆ చుక్కని చూడు! అని వసంతసేన ఒక నక్షత్రాన్ని చూపిస్తుంది. "అది వొక దివ్యలోక" మంటాడు విక్రమార్కుడు "ఆ లోకంనుంచి ఆహ్వానం వస్తున్నట్టుంది." అంటుంది వసంతసేన. ఈ నాటకానికి ఆ లోకమునుండి ఆహ్వానం అన్న పేరు సార్థకం కావడానికి పైవాక్యమే ఆధారం. అదే నాటకం విషాదాంతం కావడానికి సూచన. అంతలో వసంతసేనా విక్రమార్కులకు మోటారు కారు దూరాన కనబడుతుంది. అశోకుడు పోలీసు వారితో వస్తున్నాడని వారు తొందరపడతారు. పడవవాళ్ళను పడవగడపమంటారు. ఆ తుపాను గాలిలో వాళ్ళు పడవ గడపలేమంటారు; ధనమిస్తామన్నా వాళ్ళు సమ్మతించరు; తుదకు ధనం పుచ్చుకొని పడవమాత్రం ఇస్తారు. వసంతసేనను పడవలో కూర్చుండబెట్టుకొని విక్రమార్కుడు పడవగడుపుతూ ఉంటాడు. అప్పుడు వసంతసేనకొడుకును ఎత్తుకొని వసుమతి వస్తుంది. ఆలస్యమైనందుకు దుఃఖిస్తుంది. "ఆః" కనిపించావు నాయనా! వసుమతీ! జాగ్రత్తగా ఇంటికి తీసికెళ్ళు నా నాయనని. ముద్దుపె..." అని వసంతసేన అనేటప్పటికి పడవ దూరమవుతుంది. మిగిలినమాటలు వినబడవు.

అంతట అశోకుడువచ్చి తనకోపం చూపిస్తాడు. వాళ్ళుచేసినపని తుచ్ఛంగా భావిస్తాడు. అది ఘనమైన పనిగా మెచ్చుకొంటుంది వసుమతి. పిమ్మట వృద్ధపరిచారకుడు కూడా అక్కడికి వచ్చి దేవి ఎట్లాగైనా తిరిగివచ్చునట్లు చేయుమని అశోకుని ప్రార్థిస్తాడు. పడవవాళ్ళను బతిమాలుకొంటాడు. కార్యం లేదంటారువాళ్ళు. అంతకంతకు గాలివాన ఎక్కువయి పడవ బోల్తాపడుతుంది.

తుదకు "ఈ నాటకంలోని ఈ అంకానికి విషాదాంతమైన ఈ భరతవాక్యమా? ఇప్పుడు మనుష్యలోకానికి కళ్ళుచల్లగా ఉన్నాయా? ఈశ్వరా! నువ్వే వున్నట్టయితే వేరొక లోకం వున్నా లేకపోయినా వాళ్లకోసమయినా ఇంకొక దివ్యలోకం

సృష్టించి ఇరువురిని అక్కడ రక్షించు - తప్పదు. లేకపోతే ఈలోకానికీ, ఈ తత్వానికీ ఈ సృష్టికీ దేనికీ ఏమీ అర్థంలేదు." అని వసుమతి అంటుంది. నాటకం పూర్తి అవుతుంది.

ఈ నాటకంలో కథావస్తువుకు అంతగా సంబంధం లేక ముఖ్యంగా వినోదార్థం రచితములయిన ప్రసంగాలు రెండున్నవి. మొదటిదానిలో అల్పాహారములవిందుకు ముందు వసుమతిన్ని వృద్ధపరిచారకుడున్ను ఒకరి నొకరు ఎగతాళిచేసుకొంటూ మాటలాడుకొంటారు. ఆధునిక యువతీ యువకుల స్వేచ్ఛావిహారములను ఆక్షేపిస్తాడు పరిచారకుడు. స్వేచ్ఛా ప్రతిబంధకములయిన సనాతన నియమములను ఆక్షేపిస్తుంది వసుమతి. రెండవదానిలో వసంతసేనా విక్రమార్కులు సముద్రతీరమునకు పోయినప్పుడు పడవవాళ్లు హాస్యంగా ఎలెక్షన్ల విషయం, కాంగ్రెస్ మొదలయిన పక్షములవారి ప్రచారాలు, ఓట్లగురించిదేవులాట, దొరలు దొరసానులు పడవలపై విహరించడం ముచ్చటించుకొంటారు.

ఈ నాటకం కేవల సాంఘిక నాటకం. నాటక శైలి అన్ని దేశాలలోను మారుతూ ఉన్నట్లే మనదేశంలోను మారుతూ ఉన్నది. మునుపటి అంక విభాగ పద్ధతిపోయి రంగవిభాగ పద్ధతి వచ్చినది. ఇదే మేలయిన పద్ధతిగా కనబడుతున్నది.

కథావస్తు విన్యాసము సంకీర్ణతలేక సరళంగా సాగినది. ప్రారంభమందు విక్రమార్కుని నాద డి. యల్. రాయిగారి చంద్రగుప్త నాటకమందలి చాణక్యుని నాదవలెను, అంతమందు నాయికా నాయకుల దురంతసంఘటన లార్డ్ ఆలిన్స్ డాటర్ కథవలెను సాగినవి. పాత్రపోషణము స్వార్థవిరోధం లేకుండా యథోద్దిష్టంగా ఉన్నదని చెప్పవలెను.

ఈ నాటకములో కొన్ని ఘట్టములు రసవంతముగా, చురుకుగా, ఉద్రేక పూరితములుగా ఉన్నవి. మానవునిమీద విశ్వాసము నశించీ, సంఘమంటే రోత పడీ ఉన్న విక్రమార్కుని పలుకులూ, అతనికీ వసంతసేనకీ శ్మశానములో జరిగిన సంభాషణమూ, వృద్ధపరిచారకునికీ వసుమతికీ జరిగిన సంవాదములో యువకులకూ వృద్ధులకూ దృక్పథములో ఉండే వ్యత్యాస నిరూపణమూ ఇందుకు నిదర్శనములు. మూడో అంకములో వసంతసేనకూ అశోకునికీ సమాధానము కుదర్చవలెనని వసుమతి చేసిన ప్రయత్నమువల్లనూ, విక్రమార్కుని మనస్సు మరల్చవలెనని అనసూయ చేసిన యత్నమువల్లనూ నాయికా నాయకుల దృఢానుబంధమూ నిశ్చలభావమూ నిపుణముగా నిరూపితములయినవి. నాటకములో ఏ పుట చూచినా కవిగారు మానవస్వభావ పరిశీలనములోనూ వ్యక్తీకరణములోనూ దక్షులని నిదర్శనమవుతుంది; భావములలో తీవ్రతా సంభాషణలో నైశిత్యమూ గోచరిస్తవి.

పాత్రలలో నాయికా నాయకులు ప్రధానులు. కనుక వారి ప్రవర్తనా ఔచిత్యానౌచిత్యములు ఎట్లున్నవో కొంచెము విమర్శించవలసి ఉన్నది. విక్రమార్కుడు తనభార్య తనను విడిచిపెట్టి ఇంకొకనితో స్నేహంగా ఉన్నా విచారించలేదట; గాని, "అతనితో అయినా (ఆమె) ఎక్కువకాలం స్నేహంగా వుంటుందని నాకు నమ్మకంలేదు" అంటాడు. ఈవిధముగా అతడు తన భార్యగురించి ఎట్లు చెప్పగలిగినాడో కథబట్టి మనకేమీ తెలియదు. అతడు తన భార్యగురించి అనుకొన్నట్లే అశోకుడు కూడా అతని భార్య అయిన వసంతసేన గురించి అనుకోవచ్చునన్న ఆలోచన విక్రమార్కునికి కలుగలేదు గదా! పరుని భార్య తనను ప్రేమించినప్పుడు ఆమె "ప్రేమదేవత", "ప్రేమరాజ్ఞి"; ఆమెప్రేమ దివ్యప్రేమ. తనభార్య పరుని ప్రేమించినప్పుడు ఆమె చంచల, ఆమెప్రేమ విషయాసక్తి గలది - ఇదేకదా విక్రమార్కుని భావము? విక్రమార్కుని భార్య వాస్తవముగా చంచలే అని ఆమె ప్రేమ కేవలము విషయాసక్తి గలదే అనీ అనడానికి తగిన ఆధారము గ్రంథంలో కనబడదు. అనసూయ విక్రమార్కుని వద్దకు వచ్చి అతనికి అతని తండ్రి సందేశమును తెలియజేసినప్పుడు, "నీభార్య మళ్ళీ నీ దగ్గరకువచ్చి ఎల్లప్పుడూ నువ్వు చెప్పినట్లువడుచుకొం

టుంది'' అని చెబుతుంది. దీనినిబట్టి భర్త చెప్పినట్లు భార్య వినలేదన్న కోపము విక్రమార్కునికి ఉండనేమో అని అనుమానించడానికి అవకాశమున్నది. వసంతసేనకూడా ఆమె భర్తయాజ్ఞను అతిక్రమించినదే కదా. ఆమెశీలముగురించి విక్రమార్కునికి గల పరామర్శ విమర్శింతాము.

వసంతసేన శ్మశానమునుండి విక్రమార్కుని పిలుచుకొని వెళ్తూ ఉన్నప్పుడు, "నీభర్త విదేశాన్నుండి వచ్చాక ఏమంటాడో'' అని అంటాడు. ఈ ప్రశ్న ఎటువంటివారి హృదయమున ఘట్టవలసినది? భర్త లేని సమయంలో అతని భార్యతో అతని యింటను ఆమెతో కలసి ఉండబోతున్నానే; అతడు వచ్చి మమ్ము చూచి ఏమంటాడో, మేము చేస్తున్న పని భావ్యంగా ఉందా అన్న సందేహం ఘట్టకపోతే ఇటువంటి ప్రశ్న ఘట్టదు. తాను చేస్తున్న పని భావ్యం కాదేమో అన్న సందేహం మొదటనుండి అతనిని బాధిస్తూనే ఉండెనన్నందుకు వసంతసేన అశోకుని విడిచిపెట్టి విక్రమార్కునితో లేచివచ్చిన తర్వాత విక్రమార్కుడు అన్నమాటలు నిదర్శనముగా ఉన్నవి. "నిన్ను నీభర్తనుండి వేరుచేసి, కొడుకునకును దూరంచేసి, గృహం విడిచిపెట్టించి నాతో తీసుకొని వెళ్లడం భావ్యం కాదేమో అని నాకు దిగులుగావుంది'' అని అంటాడు. భావ్యమే అని అతనికి ఎప్పుడు తోచినది! అట్లు తోచనప్పుడు భావ్యముకానిపని భావ్యముకాదని ఎరిగియుండిన్ని చేసినవాడయినాడు విక్రమార్కుడు.

ఇకను కథానాయికయైన వసంతసేన శీలము విమర్శించవలెను. "నీ భర్త విదేశాన్నుండి వచ్చాక ఏమంటాడో'' అని విక్రమార్కుడంటే, "ఏమనడానికి ఏముంది? అయినా ఇదివరకు ఎన్నిసార్లు నువ్వు మా యింటికి రాలేదు. ఆయన సంతోషిస్తారు'' అని వసంతసేన సమాధానం చెబుతుంది. అంటే ఆమె తాత్పర్యమేమి! పైకి స్నేహితులవలెనే ఇదివరకు వ్యవహరిస్తూ ఉన్నాము. అభావంతోనే ఉన్నామని నాభర్త అనుకొంటూవచ్చాడు. అట్లానే ఇప్పుడూ ఉందాము; అట్లానే అతడూ అనుకుంటాడు. అతడు చాలామంచివాడు. అంటే అమాయకుడు; మన ఆటలకు అతడు అడ్డం రాడు. అతని మంచి మనస్స్వైరవిహారానికి తోడవుతుంది; అనే కదా ఆమె అభిప్రాయం! అశోకుడు పామ్మనకపోతే వసంతసేన అశోకుని ఇంట్లో అశోకుని పోషణములో ఉండిన్ని విక్రమార్కునితో కాలం గడపవలసినదేనా! మనసు లేని మనువు చేయమనుట భావ్యం కాదు. నిజమే! అయితే వసంతసేన ఏమి చేయవలసి ఉండెను? ఎప్పుడైతే ఆమె త్రికరణశుద్ధిగా విక్రమార్కుని ప్రేమించినదో అప్పుడే ఆమె అశోకుని విడిచి రావలసిఉండెను. అప్పటినుండిన్ని ఆమె అశోకుని సొత్తుపై తనకుహక్కు ఏమీ లేదనిన్ని అశోకుని ఇంట తానున్ను విక్రమార్కుడున్ను ఉండడానికి సబబులేదనిన్ని గ్రహించవలసి ఉండెను. అట్లు చేయకపోవడంవల్ల ఆమె తనభర్తను మోసపుచ్చినదని భావించవచ్చును.

సంఘంలో సౌఖ్యముండడానికి ఏమి ఉండవలెనో వసంతసేన స్పష్టంచేసింది: "ఏమతప్రకారమైన వివాహాలకైనా విడాకులు కొన్ని పరిస్థితులలో షరతులు లేని సంపూర్ణమైన విడాకులు ఉంటేనేగాని సంఘంలో సౌఖ్యంప్రబడదు''అన్నది.

ఈ సిద్ధాంతాన్ని బలపరచడానికి గ్రంథకర్తగారు ఈ నాటకాన్ని రచించినట్లు కనబడుతుంది. అదే ఉద్దేశమైతే వసంతసేనా విక్రమార్కుల చరిత్ర, ప్రవర్తన, శీలం, ఈ సిద్ధాంతాన్ని సమర్థించడానికి తగినట్లుగాలేవు. అంతేకాదు, విడాకుల ఏర్పాటుకు విముఖతగలవారికిన్ని కొంతవరకు ప్రతికూలంగా ఉన్నవారికిన్ని మాశారా విడాకుల చట్టం అమలులోనికి వస్తే ఎట్టి విపరీత ప్రవర్తనలకు అవకాశం కలుగుతుందో, అని చూపించడానికి నిదర్శనంగా ఉన్నదీకథ.

మగడు తనను ఏలుకోనూ ఏలుకోడు, విడాకులు ఇవ్వనూ ఇవ్వడు. దుర్మార్గుడున్ను క్రూరుడున్ను అయిన తన మగనితో కాపురం చేయడము దుర్భరంగా ఉన్నదనిన్ని, క్లీబుడో పిరికివాడో అగుట

వల్ల తనమగనితో ఎట్లు కాపురము చేసేది అనిన్ని ఘోషిస్తూఉన్న యువతుల నేకంగాఉన్నారు. వారిలో కావలసినవారికి విడాకుల ఏర్పాటు ఉండడం మంచిదే. విడాకులచట్టం వస్తే ఘోరపరిస్థితు లేర్పడుతవిఅని సనాతనులుతమ అలవాటు చొప్పున తీవ్రంగా ప్రతిఘటిస్తారు. అట్టివారి హృదయంకూడా కరిగి నీరయే కథ ప్రకల్పించడము మంచిది గాని విడాకుల పద్ధతికి అనుకూలముగా ఉన్నవారు సయితము అయ్యయ్యో విడాకుల పద్ధతి ఏర్పడితే ఇట్టివిపరీతచర్యలకుకూడా అవకాశం కలుగుతుందిగదా అన్న విచారం కలుగచేసే కథ కూడను అయితే ఈనాటకము సామాన్య సంసారుల గాథ కాదుగనుకనూ పాత్రలందరూ రాజులూ జమీందారులూ అయిన క్షత్రియకుటుంబములోవారుగా ఉన్నందువల్లనూ ఆసంఘ పరిస్థితులే ఇందులో చిత్రితములయినవని సమాధానము చెప్పకోవలెను.

భాషా సంస్కరణ విషయంలోనూ సంఘ సంస్కరణ విషయములోనూ గ్రంథకర్తగారు అధునికాశయములను పోషింపబూని వ్యావహారిక భాషలో తమ నాటకములు రచించినందుకు వారిని ఎక్కువగా అభినందించవలసి ఉన్నది. నవ్యభాషలో ఎంతశక్తి గలదో వీరు తమ రచనలో చక్కగా ప్రదర్శించినారు. గ్రాంథిక భాషావాదులు సైతము మెచ్చుకోదగిన రీతిని రచన సాగించినారు అట్లే వీరు సనాతనుల హృదయము సయితము పరివర్తనం పొందగలిగిన రీతిని సంఘసంస్కరణమునకు అనుకూలప్రాయమైన కథలను కల్పించి నాటకములు రచింతురుగాక! అందుకు వీరు సర్వధా సమర్థులు.

గిడుగు వెంకటసీతాపతి.



## ఆంతర్జాతీయ నాటికలు

క్రౌన్ 8 Vo 78 పుటలు: వెల 4 అణాలు

మల్లాది అవధాని

నాట్యభారతి: విజయనగరం

ఇది నాట్యభారతివారి మూడో ప్రచురణం. ఆంధ్రరాష్ట్రం; భారత యోధులు; నవద్వీపం; జగన్నియంత; ప్రపంచయుద్ధం; అనే ఐదు చిన్న నాటికలు ఇందులో ఉన్నాయి.

మల్లాది అవధానిగారి నాటికలు పాఠకలోకానికి సుపరిచితములే. హాస్యరస ప్రధానమయిన నాటికలు రచించటం వీరికి చాలా సులభమయిన పనిలా తోస్తోంది.

ఆంధ్రరాష్ట్రం — పేరుకోసం తంటాలుపడే రచయితల మీద, పత్రికాధిపతులమీద, Socialists మీద, కొంచెం చురుకయిన దెబ్బలున్నాయి ఇందులో. కాని ఇది అనవసరంగా పెరిగిపోయింది. కొంచెం తక్కువలో ముగిస్తే బాగుండేది.

భారత యోధులు: దీనికి రెండుపేజీలప్రస్తావన లేకపోయినా అంతఇబ్బందిలేదు. చరిత్ర పరిశోధకుడు, నవకవి, వేదాంతి, రాజకీయ నేత్త, లైబ్రేరియను ఇందులో పాత్రలు. ఒకడు మహారాష్ట్రుడు, ఒకడు వంగదేశసుడు, ఇంకొకడు పంజాబీ ఇలాఉన్నారు. వీరంతా లైబ్రేరీలో ఉంటారు. ఎప్పుడో చచ్చిపోయిన అశోకుణ్ణి తలుచుకుని అతనిచావు ఇవాళ జరిగినట్లూ, ఏదో అప్తబంధువు మరణించినట్లూ, విచారిస్తున్నాడు చరిత్రపరిశోధకుడు. ఇలాగే తక్కినవారు కూడా తమ అభిమాన విషయాల్లో మైమరచి వున్నారు. వారికి జీవితాల్లో ఇంక వేటిమీదా అపేక్ష లేనట్లు ప్రాణాలు కొడుతున్నారు. యుద్ధ తరంగాలు ప్రళయంగా చెలరేగబోతున్నాయి అని లైబ్రేరియను అనేసరికి అందరికీ మూర్ఛవచ్చినంత పని అయింది. వాక్శూరులమీద మంచి Satire ఇది.

నవద్వీపం: ఇందులో అంత స్వారస్య మయిన ఘట్టాలులేవు.

జగన్నియంత: డిక్టేటరు సైంటిస్టులతో నిండివున్న ఒకదేశానికి, పునర్జన్మపొంది క్రీస్తువెళ్ళి శాంతిబోధ మొదలుపెట్టాడు. వాళ్ళంతా కలిసి ఇతన్ని మళ్ళీ క్రూసిఫిక్షన్ చెయ్యటానికి శిలువ మొదలయినవి తెప్పించారు. ఈ క్రీస్తు లొంగక మాయమై ప్రశ

యం తెప్పించాడు. ఇందులో గ్రంథకర్త దాడి దేనిమీదో స్పష్టంగా లేదు.

ప్రపంచయుద్ధం: ప్రపంచ కాన్ఫరెన్సులో పంచకూటమి అయిదుగురు మహావ్యక్తులు గోష్ఠి చేస్తూవుండగా ఒక రొట్టెకోసం తగాదాలు పడ్డారు. సైన్యాలు నాశనం చేసుకున్నారు. అప్పటికి మత్తు వదిలింది. ప్రపంచంలో మహారాజ్యాలవారంతా చేసే దదే. ఇప్పటి ప్రపంచరాజకీయ పరిస్థితులకు ఇది చక్కని ప్రతిబింబము.

ఈ నాటికలన్నీ వివిధవిషయాలకు సంబంధించిన విమర్శలు. కాని కొటిలో Unity of Purpose కొంచెంతక్కువగా వున్నట్టు తోస్తుంది. ఒక్కొక్క సమస్యకు సంబంధించిన విమర్శ, ఒక్కొక్క నాటికలో స్ఫుటంగా చెపితే నచ్చుతుంది. కాని అనేక విషయాలు ఒకదాంట్లో నే గుప్పిస్తుంటే అసలు సమస్య వెనకపడుతుంది.

ఇంగ్లీషు ప్రయోగాలు తగ్గించవలసిన అవసరం వుంది. సంభాషణలు చాలా రమ్యంగా సాగడటం చేత ఈ నాటికలు జనాకర్షణీయంగా వుంటాయి.

రా. సు.

## అసంపూర్ణ రామాయణము

ఆంధ్రా స్పిరిట్ [0-4-0]

ముల్లా నసరుద్దీన్: నాట్యభారతి: వినాయకనగరం వ్యంగ్య నాటికలు రెండూ ఒకే సంపుటిగా వెలువడ్డాయి. పఠించడానికే కాకుండా ప్రదర్శించడానికి కూడా బలే హుషారిస్తుంది అసంపూర్ణ రామాయణం. నాటకాలు వ్యంగ్యంగానూ ఆడేవారూ ఎన్నెన్ని రకరకాల తెలికలు చెయ్యవచ్చునో దీనివల్ల బాగా తెలుస్తుంది. ఈ నాటికను ఎంపి రెండరో చాలచోట్ల దిగ్విజయంగా ప్రదర్శించారు.

ఆంధ్రాస్పిరిట్ అసంపూర్ణ రామాయణమంత ఆకర్షకంగా లేదు. కాని ఇందులో ఎక్కువ thought వుంది. ఆంధ్రుడు - ముఖ్యంగా ఆంధ్ర సాహిత్యసేవకుడు - వేషంలోనూ, భాషలోనూ, భావంలోనూ ఇతరుల్ని అనుకరిస్తూ ఆంధ్రత్వం లేకుండా చేసుకోవడం శోచనీయం. ఈనాటికలో ఆంగ్లకథకుల్నీ, విమర్శకుల్నీ, కవుల్నీ, పత్రికా సంపాదకుల్నీ ఆంధ్రత్వం చంపుకోకండోయ్ అని మందలించడం కనబడుతుంది. విశ్వనాథకవిరాజు గారి నాటకాల్లో హాస్యం దానంతట అది పుడుతుంది; అవధానిగారు తెచ్చిపెడతారు. ప్రతి స్వల్ప విషయాన్నీ కథావస్తువుగా తీసుకుని నాటకాలు వ్రాసి మెప్పు పొందడం చాలా కష్టం! అదీగాక satire కన్నా humour ఎక్కువ ఆరోగ్యాన్నిస్తుంది అనుకుంటా.

శి. రాం.

## శ్రీ చెల్లమాంబ

పెమ్మరాజు లక్ష్మీపతి

చెల్లమాంబ చెంగల్వల తిమ్మయ్యగారి అర్ధాంగి. 1824 లో ఈమె భర్తతో సహగమనం చేసింది.

"తెలుగుయిల్లాండ్ర పాతివ్రత్య తేజములు
పంచబోరని నాటి పసపుకుంకుమలంట..."

పంచిపెడుతూ భర్తననుసరించిం దాపతివ్రత. నిర్బంధం వల్లగాని, ఆచారాన్ని అనుసరించి గాని, తాత్కాలికోద్రేకానికి వశురాలై చేసిందిగాని కాదు ఆ సహగమనం; భర్తతో సహధర్మచారిణి యగుటయే భార్యకు కర్తవ్యమను ధర్మ నిశ్చయముతో గావింపబడిన ఆత్మసమర్పణము. సిపాయిలు వచ్చి వారించినా వినలేదా యిల్లాలు. ఆమెకు భర్తే రాజు. ఆమె మహాపతివ్రత కాబట్టే-
"సూర్యగా చంద్రులో చుక్కలో మెరపులో
అంత కంతకు డిగుచు ఆ కన్నులై మెరసె"
ఆమె చూపుల్లో తిమ్మయ్య వెలిగాడు. ఆమె చిచ్చులో మసిపోతూంటే "ఎవరాపగలవార లెవరు కాదనగలరు! అందరును బొమ్మలట్లుగా నిల్చిరి కొయ్యబారి."
చెల్లమాంబ అగ్నిమయియై కొంతల్లిన వెనుక
"నీలాలపొగ లెగసి నింగిగా విరిసినవి;
మిణుగురులు చుక్కలై మింట పుష్పించినవి;

చెల్లమ్మ నిండుజాబిల్లియై దివిబొల్చి
పండువెన్నెల...కర్తిగా
నిండి వెలిగెను.''

లక్ష్మీపతిగారీ చిన్నమాటను గొప్పపాటగా రచించారు. రెండుముక్కల్లో చెప్పవలసిన కథని నవ్య భావాలతో, మృదులశైలిలో, హృదయాన్ని కదిలించేటట్లు చక్కని కావ్యంగా అల్లేరు. "వసంత గానముచే జగము నలరించు కవికోకిలమైన లక్ష్మీపతి కవిత్వము జగమెరిగినదే" ఐనా ఒక్కమాట మాత్రం చెప్పాలి. వీరి కవిత్వంలో విశ్వనాథ సత్యనారాయణగారి పలుకుబడి హెచ్చు. మచ్చుకి-

"చిన్నారి మునుసిగ్గు కన్నె వలపుల మొగ్గ
లలసులై, విరబోటులై, తేనెసోనలై,
వాకలై, వనధులై, వసుధ తేల్చిన నీట
నడిపించినది - చెల్లమాంబా - ఆ
పూలనల్లిన పడవ చెల్లమాంబా!

శి. రాం.



## ప్రేమతపస్విని

ఖండకావ్యము, క్రౌను 40 పుటలు, రు 0-6-0

కవి: బెళ్లూరి శ్రీనివాసమూర్తి, తలమర్ల.

కొత్తచెరువు పోస్టు, అనంతపురం మండలం.

సరిగా కావ్యం ఎక్కడ మొదలైతే మొదట్లో అక్కడ నుంచే చూచి తరువాత పీఠికలు, పరిచయ వాక్యాలు చదవటం నా అలవాటు. అదేరీతిగా ఈ ఖండకావ్య విషయంలోనూ జరిగింది. కావ్యపఠనం చేసే టంతసేపూ కవి నన్ను నిజంగా ఇంకో ప్రపంచంలోకి తీసుకుపోయాడు. గ్రంథాంతంలో కలిగిన తన్మయత్వానికి అప్పుడే అయిపోయిందేమా అనిపించింది. పరిచయ వాక్యాలను తరువాత చూచాను. వాటిలో మొదట్లోనే 'ఇది నా తొలిమొగ్గ' అని వ్రాసివుంది. అప్పుడు 'తొలిమొగ్గ'కే ఇంత వాసనా అనుకున్నా.

నవనాథోదయంలో అన్ని ఆధునికుల పోకడలే. ప్రకృతి రామణీయకాన్ని నాయకా నాయకుల మనోజ్ఞభావాలకు దోహదంగా వర్ణించే రీతిలో వీరి నవ్యత్వం బాగా కనిపిస్తుంది. స్వతంత్రభావన, ఉత్తేజం, కావ్యం అంతటా ప్రస్ఫుట మౌతుంది.

పవిత్ర ప్రేమోపాసనలో జీవితం గడిపే పల్లె పడతి తన ప్రణయోదంతాన్ని ఏకాంతంగా ఏకాంతాన్ని సంబోధిస్తూ చెప్పటమే కావ్యంలో కథావస్తువు.

పరస్పర హృదయదత్తం చేసుకున్న నాయికా నాయకుల ప్రేమకు కలిగిన అంతరాయాలవల్ల, సన్నిహిత సంబంధం తొలగిపోవలసి వస్తుంది. కానీ "హృదయమే నాదు నిన్ను ప్రేమించుగాత" అని ఇద్దరూ నిశ్చయించుకుంటారు.

పరిణత హృదయుడై నాయకుడు 'గాఢ వియోగ విషాద దీక్ష నమ్మికముగా తన్మయత్వ పరిపూర్ణ సుఖం' లభిస్తుందనే ఆశయంలో వాడు, ప్రియతో తుదివాక్కుగా

"ఓ సౌందర్యనిధీ! పవిత్రమయి నా
యుల్లంబు నీప్రేమలో
నే సౌఖ్యంబులు చూరలాడెనదో, క
న్నీ రొల్క నీవేళ నీ
లో నన్వేషణ సాగించి కాంచి నవ తా
ర్ణ్యంబు గోల్పోవని ప్రే
మోత్కంఠంబును వదలి నీ సకలం
బున్ విస్మృతించెదమనున్."

అని భగ్నప్రణయ దీక్షనే పట్టి పరమేశ్వరధ్యానానికి దారి చూచుకుంటాడు.

ప్రియ, స్త్రీ ప్రకృతిలో. ప్రపంచాన్ని
ఎదియుగూడ శాశ్వతమని యెన్నరాని
యీ జగమ్ముపై నెందుల కింత ప్రేమ!

అని మోహించు నరాధుని ప్రకృతి విలోకనంలో మార్పుచెందిన ప్రియుణ్ణి ఉద్దేశిస్తూ—

మా కీ రాని హృదీయ నిర్మల వనా
మాధుర్యమా, శ్రీయమా

స్మరణల్ సేయుచు బాష్పధార విరమిం
పం జాల, తీవ్రైన ని
ర్ఝరిణీ స్వాదుజలంబులన్ బరగుచున్
జాల్గొన్న యీ కొన్న చె
ట్లు, రసార్ద్రంబగు గీతముల్ సతము నా
లాపించి శాంతించెదన్.

అని ఒకవిధంగా తపస్విని అయిపోతుంది. ముద్రణ విషయంలోను, భాషా విషయంలోనూ కించిద్దోషాలు కనిపించినా ఈ కావ్యం అన్ని విధాలా బాగుందనే అనాలి.

వావిలాల సోమయాజులు.



## తరణోపాయము

[ఆధ్యాత్మిక విషయిక గ్రంథము. కర్త, శ్రీ యల్లాపంతుల జగన్నాథంగారు. ఏలూరు, మంజువాణీ ముద్రాక్షరశాలలో ముద్రితము. క్రౌను ౨౫౦ పుటలు వెల ౧-౦-౦]

శ్రీ యల్లాపంతుల జగన్నాథంగారు మణిమాలా మదనసాయకాది నాటకములూ, గాండలగండడు, విశ్వాసి మొదలయిన పాటలూ(ballads) హేలేనా మొదలుగాగల వచనగ్రంథములూ రచించి ఆంధ్ర విద్వల్లోకములో ప్రతిష్ఠ గడించినవారు. ఇటీవల ఆధ్యాత్మిక విషయములలో మనసు లగ్నమాయి. అందు గట్టి కృషిచేసి, హిందూమతమూ మహమ్మదీయ క్రైస్తవ మతములూ పరిశీలించి, ఆయామతములలో ఉన్న ముఖ్యసూత్రములన్నీ సమానములే అని సమన్వయముచేసి చూపుతూ ఆంగ్లములోనూ ఆంధ్రములోనూకూడా కొన్ని గ్రంథములు రచించి మెప్పుపొందినారు. అవి ఎంతో ఎంతో ఉన్నత విద్య నభ్యసించువారికి మాత్రమే అందుబడిలో ఉంటవి. వీరి ప్రేమధర్మము ఈ పత్రికలో ఇది వరకు విమర్శించడమైనది. [చూ. సం. 3 సంచిక ౧ పుట ౭౬]

ప్రకృత గ్రంథము వారి ఇతర రచనలన్నిటికంటె ఉత్తమమయినదనీ సుబోధమనీ మా అభిప్రాయము.

ఈ గ్రంథానికి శ్రీ రావుసాహెబ్ డాక్టరు గిడుగు రామమూర్తి పంతులుగారు (కళాప్రపూర్ణ) ఉపోద్ఘాతమును వ్రాసినారు. శ్రీ డాక్టరు విక్రమదేవ వర్మగారు (జయపురం మహారాజావారు) ఇచ్చిన అమూల్యాభిప్రాయము ఈ గ్రంథ ప్రాశస్త్యము వెల్లడిచేస్తున్నది.

గ్రంథకర్త ప్రభుత్వోద్యోగి. తీరికగా ఉన్న సమయములలో అతడు తనకు తెలిసిన ఆధ్యాత్మిక విషయాలు ఇతరులకు బోధించడము కనిపెట్టి అతని సతీమణి ఒకసారి వరుసగా మూడురోజులు సెలవు రావడము అవకాశము తీసుకొని తనకా విషయములు సవిస్తరముగా బోధించమని అడగగా, అతడు అంగీకరించి, ఆమె అడిగిన ప్రశ్నములకు సమాధానరూపముగా తొలినాటి సంభాషణములో ప్రేమతత్త్వముగురించీ, రెండవనాడు భగవద్గీతలో ఉన్న పరమతత్త్వమునుగురించీ, మూడోనాడు భగవన్నామ జపము గురించీ, బోధిస్తాడు.

ఉత్కృష్టములయిన ఆధ్యాత్మిక విషయములు చదువరులకు ఎట్టి సందేహములూ కలుగకుండా మధ్య మధ్య చిన్నచిన్న కథలూ సుపరిచితములయిన సంగతులూ దృష్టాంతముగా చెప్తూ ఆకర్షకంగా రసవంతంగా బోధించడానికి, ఒకరు ప్రశ్నించడమూ రెండోవారు సమాధానము చెప్పడమూ, ఇట్లు సంవాదరూపముగా రచించడము సనాతన సత్సంప్రదాయ సిద్ధము. ఈ పద్ధతి స్వీకరించడమువల్ల గ్రంథకర్తకు ఎంతెంత క్లిష్ట విషయములూ అతి తేలికగా, అక్షరాస్యులు, కాని అడువారికి కూడా సుగమముగా ఉండేలాగున చెప్పడమునకు వీలు కలిగినది. పాఠకులకు ఎట్టి సందేహాలు కలుగుతవో, ఏయే పారిభాషిక పదాలు అర్థముకావో ఊహించుకొనడములోనూ, అవన్నీ విశదముగా తెలిసేటట్టు విప్పి చెప్పడములోనూ, గ్రంథకర్త అసామాన్యమయిన ప్రజ్ఞ కనబరచినాడు.

మొదటినాటి ప్రసంగము ప్రేమతత్త్వదర్శిని. ఇందులో బ్రహ్మతత్త్వవిచారము, జీవుని బ్రహ్మానుభవ ప్రయత్నము; అందులో పలుమారు సంభవించే విఘ్న

ముక్తిమార్గములు; భగవంతుని ప్రేమతత్త్వము; భక్తిమార్గము జ్ఞానమార్గముకంటె ఎట్లు సులభము అనే విషయములు చర్చింపబడినవి.

రెండో ప్రసంగములో భగవద్గీత గురించి బోధ ఉన్నది. ఈ ప్రసంగములో ఉపదేశభాగము; ఆచరణ భాగము అని రెండు విభాగములు. మొదటిదానిలో కృష్ణతత్త్వము: జీవతత్త్వము; గీతాయోగ వివరణ మున్ను; రెండోభాగములో మానవుడు తన జీవితమును గీతాయోగములో ప్రవేశ పెట్టడానికి ఏయే ధర్మాలు ఆచరణలో పెట్టవలెనో, సమత్వము, స్వధర్మాచరణము పరధర్మవిసర్జనము, విహిత కర్మాచరణము, సర్వమత సామరస్యము, సర్వార్పణబుద్ధి మొదలయిన సోపాన క్రమములున్ను ఉపదిష్టములు.

మూడోనాటి సంభాషణము నామ సిద్ధాంత దర్శని. ఇందులో భగవంతుడూ భగవన్నామమూ ఒకటే అని నిరూపించి భగవన్నామము సర్వవ్యాప్తమనీ, లౌకిక వ్యాపార నిమగ్నులైనవారు దీనిని పెడ చెవిని పెట్టుతున్నారనీ. అపరాధశూన్యముగా భగవన్నామము జపించేవారికి సంసారబంధము పూర్తిగా తొలగిపోతుందనీ చెప్పి, దశాపరాధ వివరణము చేసి చివరకు నామతత్త్వమూ నామజప విధానమూ గ్రంథకర్త నిరూపించినాడు.

పరమార్థ విషయములు తెలుసుకోవలెనని తీవ్రమయిన అభిలాష ఉండీ తెలిసీ తెలియని గురువులు చెప్పే పెడవేదాంతములో పడి మనశ్శాంతి లేక బాధపడేవారికి ఈ గ్రంథము తరణోపాయముగా ఉంటుంది. ఏ విషయము ఎత్తుకొన్నా సరిఅయిన ఉపక్రమోపసంహారములతో మనస్సుకు నచ్చేలాగున చెప్పడమువల్ల అప్పటి కప్పుడు తెలిసినట్లుండి తరవాత విస్మృతములు కాకుండా, హృదయములో నాటుకొనేలాగున బోధించడము ఈగ్రంథమంతటా కనబడుతుంది.

సుపరిచితమయిన వ్యావహారిక భాషలో రచించడమువల్ల గ్రంథకర్త ఏ ఉద్దేశముతో గ్రంథము రచించినారో అది సార్థకము అయినదని చెప్పవచ్చును. వ్యావహారిక భాష అంటే వైముఖ్యము ఉన్న శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు కూడా ఈ గ్రంథరచనను ఈ భాషే చాలా తగి ఉన్నదని మెచ్చుకోవడము సామాన్యవిషయము కాదు. ఈ గ్రంథము ఆంధ్రలోకానికి అర్పించిన శ్రీ యల్లాపంతుల జగన్నాథంగారిని అభినందిస్తున్నాము.

శర్మ.



## చీనా - జపాను ప్రళయము

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## భాగ్య సౌధము

శ్రీగిరిరాజు రామారావు

## తిలోత్తమ : పాపయ్యశాస్త్రి

పులవర్తి కమలావతీ దేవి

[ఒక్కొక్క పుస్తకం వెల 0-6-0]

ప్రకాశకులు : సమ్మగ్రాస్య మదరాసు.

హరిసర్వోత్తమరావుగారు సుప్రసిద్ధులు. రాజకీయ విషయాలలో ఆరితేరిన రాజనీతివేత్త. చీనా జపాను ప్రళయమగానూ, దాని సందేశాన్ని సామాన్య నాయకులకుకూడా తెలిసేటట్లు వ్రాసినది ఈపుస్తకం. లోకంలో రాజకీయ విషయాలను గురించి సంఘంలో ప్రతివ్యక్తి తెలుసుకోవాలి. ఒకమూల సామ్రాజ్య తత్వం, మరోవైపున సామ్రాజ్యవాదం ఈ రెంటికీ కలిగే సంఘర్షణలో ప్రపంచం మారుమోగుతుంది. చైనా - జపానుల సంఘర్షణ చిరకాలంనాటిది; పూర్తిగా బలాబలాలు వ్యక్తమయితే కాని అంత మయ్యేదికాదు.

రామారావుగారు నీతిని బోధించే పది వ్యాసములు వ్రాసినారు. మానవ సౌభాగ్యానికి నీతిపునాది, శక్తి, పొదుపు, శుద్ధి, క్రమపద్ధతి, సానుభూతి, సహృదయత, నిష్పక్షపాతము; ఆత్మవిశ్వాసము మొదలయినవి వస్తాయని గ్రంథకర్త చెప్పినాడు. వ్యాసాలు ఉద్దిష్టవిషయాలను చక్కగా వ్యక్తపరుస్తున్నవి.

'తిలోత్తమలో' ఔరంగజేబు మాయోపాయం చేసి గోల్కొండ వశపరచుకోవడం చారిత్రిక విషయం. 'సాపయ్యశర్మ' కథ హైదరాలీ నాటిది. దేశద్రోహి అయిన శర్మ తగినశిక్ష అనుభవిస్తాడు. ఇందులో హైదరాలీని ఉత్తమపురుషుణ్ణిగా చిత్రించారు; తూర్పుఇండియా కంపెనీవారి ఉద్యోగుల దుండగాలుకూడా వర్ణించారు. ఈ రెండుకథలలోనూ సన్నివేశాలు బాగున్నవి. భాషమాత్రం బాగాలేదు. సాఫీగా లేక పట్టివ్రాసినట్లు కనబడుతున్నది.

రా. సు.

## శ్రీ వివేకానంద లేఖావళి

క్రౌనుసైజు 190 పుటలు

వెల 0-12-0 బైండు 1-0-0.

దొరకుచోటు :

పొన్నపల్లి ఉమామహేశ్వరశర్మ,
కొత్తపేట: తెనాలి.

ఇది శ్రీరామకృష్ణ పరమహంసులవారి శిష్యాగ్రగణ్యులగు శ్రీ వివేకానందస్వాములవారు ఆంగ్లమున వ్రాసిన లేఖలకు తెలుగు అనువాదము. ఆంధ్రలోకమునకు సుపరిచితులును బహుగ్రంథ నిర్మాతలును అగు శ్రీ నిత్యానందస్వాములవారు ప్రబోధకమును లలితమును అయిన తెనుగు భాషలో వ్రాసిరి. ఆధునిక భారతజాత్యభివృద్ధి వికాసములకును, భారత స్వాతంత్ర్యమునకును, భారతీయులు అనుసరింపవలసిన పెక్కుమార్గము లీగ్రంథమును చదువుటచే గోచరించును. జాతీయ వికాసమును మానవ జీవిత సంస్కరణమును ఆకాంక్షించుప్రతివ్యక్తియు చదివితీరవలెను. "వివేకసుధ" అను అనుబంధము గూడా ఉన్నది. 'వివేకానంద' చిత్రపటముగూడా పొందుపరుపబడియున్నది.

కొం. శ్రీ. రా.

## సంస్థానాలు

వావిలాల గోపాలకృష్ణయ్య

'నవ్యశ్రీ: సత్తెనపల్లి'

సోల్ ఏజెంట్సు, ది రాడికల్ లిటరేచర్ సెల్లింగు డిపో

కొత్తపేట : గుంటూరు.

క్రౌన్ 8 vo 155 పుటలు. వెల 6 అణాలు

సంస్థానాలలో జరుగుతూవున్న అత్యాచారాలను గురించి రోజూ పత్రికల్లో చదువుతూనేవున్నాము. రాజకోట, హైదరాబాదు, తిరువాన్కూరు సంస్థానాలలో అల్లర్లు ఈ మధ్య మరీ ఎక్కువయాయి. పాలకులకి ప్రజలకీ ఏమాత్రము సరిపడటం లేదు. విశేషవిషయాలు పత్రికలవల్ల తెలియవు. గోపాలకృష్ణయ్యగారు ఈ కొరత తీర్చారు. వీరు స్వార్థం మరచి దేశసేవ చేసే ప్రముఖులు. చాలా విలువగల విషయాన్ని శ్రమపడి సేకరించి ఇందులో ఇమిడ్చారు. వీరి గ్రంథం జనాదరణ పొందగలుగుతుందని మానమ్మకం.

రా. సు.

## కిన్నెర

క్రౌను 1/4, 164 పుటలు: వెల రూ ౧-౦-౦

ఆంధ్రవాఙ్మయ సేవాసమితి,
బూర్గంపాడు, భద్రాచలం పోష్టు.

ఈ సమితివారు గద్య పద్య రచనలూ, విమర్శనలూ ప్రచార ప్రబోధములూ, చర్చలు, సమావేశాలు, వర్ధంతులు, భాషా వ్యాసంగాలు, కవిగాయకాది సమ్మేళనాలు, గ్రంథ పత్రికా సామగ్రిని సేకరించడం, సాహిత్య సంపుటములూ గ్రంథములూ ప్రచురించటం, విక్రయించటం. కార్యవిధానంగానూ మత రాజకీయ విషయాలలో సంబంధలేశం లేకుండా సాహిత్యప్రమేయం కవితాగోష్ఠి ముఖ్యాశయంగా పెట్టుకొని వాఙ్మయ సేవకు పాటుబడ

నిశ్చయించుకొన్నట్లు కార్యదర్శి నివేదనంవల్ల తెలుస్తూ ఉన్నది. వారి లక్ష్యాలు కొన్ని సఫలమైనట్లు కూడా అవగతమవుతుంది. సారస్వత కృషికి ప్రాంతస్థులను ప్రోత్సహించటంకూడా వీరి ఆశయాలల్లో ఒకటి.

సుప్రసిద్ధ కవి గాయక శాస్త్రజ్ఞ కథా కథానిక విమర్శ రచయితల రచనలు 43 ఈ ఉగాది కానుకను అలంకరిస్తున్నాయి. ఖండకావ్యాలల్లో రాయప్రోలు సుబ్బారావుగారి "ఉగాది" విశ్వనాథ సత్యనారాయణగారి "కిన్నెర!" బొడ్డు బాపిరాజుగారి "తెలుగుతల్లి" సంపుటికి విశిష్టత, రమ్యతను ప్రతిపాదిస్తున్నాయి. ఖండకావ్యాలన్నిటిలో జాతీయత దేశభక్తి, ప్రబోధము కనిపిస్తున్నవి. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారి "ఢిల్లీపట్టణోపాఖ్యానం"లో వ్యావహారిక ధోరణి కనిపిస్తూ ఉన్నది. ఈ "ఢిల్లీపట్టణోపాఖ్యానం"లో శైలి కూడా సుకుమారంగా మనోహరంగా ఉన్నదనే-అనాలి! సమితి సభ్యుల సంపకృతులలో "సిద్ధ" భావ వీధిలో విహరింపజేస్తుంది.

"అష్టదిగ్గజాలు—కృష్ణదేవరాయల కవితా ప్రశస్తి" అనే కావ్యం ప్రబంధరచనా ధోరణిలో ప్రథమగణ్యం. "ఆంధ్రశ్రీ" కావ్యం పూర్వాంధ్ర రాజన్యుల 'నిర్వేలతుష్టి' కన్నులకు కట్టించి ప్రస్తుత ఆశయపతనములో ఆంధ్రుని ప్రబోధిస్తుంది. పూర్వ వైభవమనకంవల్ల లాభం లేదనీ భావి ఔన్నత్య తత్పరత్వం ఆంధ్రునికి కలగాలనేదే ఈ కావ్యాశయం అనుకుంటాను. ఇతర ఖండకృతులన్నీ బాగున్నాయి. ఆనందోబ్రహ్మ (బహుశా బ్రహ్మానందంగారా!) గారి "తెలుగు జ్యోతిజగులు – తెలుగువాగటిమి" గేయంలో పేరులో ఉన్నంత ఆనందంలేదు.

గద్యవ్యాసాల్లోకి వస్తే ఆంధ్రభాష అన్యవాణీ గౌరవం పొందాలంటే అనుసరణీయమైనమార్గాలు, భాషాసేవకుల కర్తవ్యం "ఆంధ్రవాఙ్మయ సేవ" అనే వ్యాసములో సూచితమౌతున్నాయి. "శాసనములు ఆంధ్రకవిత్వము" అనే వ్యాసంలో శాసన కవులు ప్రబంధ కవులను అతిశయించి కవితా రచన చేశారనీ, ప్రత్యేక కావ్యాలు కూడా చిరస్థాయిత్వంకోసం శైల శిలలమీద చెక్కేవారనీ, ఆంధ్రవాఙ్మయచరిత్ర శాసనాలన్నీ సుపరిశోధితాలయ్యేంతవరకూ సప్రమాణం సమగ్రం కాదనీ, జనసామాన్యానికి శాసనరక్షణా దృక్పథం కలిగించాలనీ వ్యాసకర్తలు సూచించారు. కానీ, సాహితీలోకంలో కీర్తిశరీరులైన శ్రీనాథాది కవులు రచించిన ఏరెండో మూడో శాసనాల్లో తప్ప మిగిలిన వాటిల్లో కేవలవాచ్యంగా ఉండే పద్యబంధాలే ఉంటాయి. భాషావిషయకంగా శాసనాలకు ప్రాముఖ్యము, చారిత్రాత్మకమైన విలువ, ఉన్నదేమోగానీ, సాహిత్య లోకంలో చెప్పుకోదగ్గ శాసనకవులు ఉన్నారా! నవీన జ్యోతిశ్శాస్త్రవేత్తలకు తెలియని 'మహాద్వీపయము' వేదయుగంనాడే భారతీయులు అవగాహన చేసుకున్నారనే విషయం "వేదవాఙ్మయం — జ్యోతిశ్శాస్త్రం" అనే వ్యాసంలో కనబడుతున్నది.

"సక్రూస" వ్యాసకర్త కొద్దిలో కవిబ్రహ్మ ప్రతిభ, మేధాసంపత్తి, చరిత్రపోనాహరణంగా చూపించి "సక్రూస సన్యాసం" చేశారు. శ్రీ శంకరాచార్యుని అద్వైతసిద్ధాంతం పునః ప్రబోధితం చేసి శ్రీరాముని రూపుని జ్ఞేయోపాస్య బ్రహ్మవస్తువుగా భావించి త్యాగయ్యవారు ఉపనిషదగ్రప్రతిపాదకమైన సిద్ధాంతాన్ని సంగీతద్వారాన్నే ప్రబోధించారని "శ్రీ త్యాగరాజాభిమతం మతం కిమ్?" అనే వ్యాసతాత్పర్యం. త్యాగయ్యవారు శ్రీ ఆచార్యశంకరుని అవతారంగా అనుకోటం వ్యాసకర్తకున్న అభిమాన మూలకమైన భ్రాంతి (Fllacy) క్రిందికే వస్తుందనుకుంటాను. "ఆంధ్ర వాఙ్మయానికి అధకాకువిన్యాసం అవసరమా?" అనే వ్యాసం అసంపూర్ణంగా కనిపిస్తుంది. "సత్య-పారిజాతాపహరణం" విమర్శ వ్యాసకర్త్రి సత్యపాత్రపోషణాన్ని స్త్రీదృక్పథ నుంచి (women point of view) మనోరంజకంగా విమర్శించింది. సంగీతసాహిత్యాలకు అవినాభావ సంబంధం ఉందనీ, పరమావధి రెంటికీ ఒకటే అనీ, కావ్యా

లాపనానికి అరఘ్జానమవసరమనీ "సంగీత సాహిత్యాల సంబంధం" అనే వ్యాసంలో వ్యక్తీకరింపబడుతుంది. "నాదోపాసనలో" ముఖ్యోద్దేశం సంగీత లక్ష్యం గానమనీ, గాన విశేషణమే నాదోపాసనము ప్రణవధ్యానమనీ, ఆప్రణవం ఓంకారమనీ, ఒంకారవాచ్యు డీశ్వరుడనీ, ప్రతిపాదించడమే. "భావకవిత్వంలో భాషావిషయమే ఎక్కువగా కనిపిస్తున్నది. 'రామరాజభూషణుడు' వ్యాసకర్త, వసుచరిత్రకారుడూ ఇద్దరూ ఒకరే అన్నారు. ఎలా అవతారు! విమర్శకు త్రికరణశుద్ధి ప్రత్యేక హేతువాదం ప్రధాన సాధన మని ప్రత్యర్థి అంతరంగశుద్ధి, సత్య తత్పర బుద్ధీ లేనివాడైతే కయ్యానికి కాలుదువ్వినా మూర్ఖభావం వహించడం విమర్శకుని వివేకాన్ని సూచిస్తుందనీ "విమర్శవివేకం" సారాంశం. 'శ్రీరామనవమి' నాటిక సరస రసోచితంగా వివిధపాత్ర సమ్మేళనంలో ఆంధ్రసంఘ ప్రదర్శకంగా ఉంది. భాష వింతపోయగాన్నిచ్చింది. "పట్టాభుడుదొంగ" కథానిక హృదయంగమంగా మృదుశైలిలో నడిచింది.

ముద్రణవిషయంలో ఈ సంచిక "ప్రత్యేక" అనిపిస్తూ ఉన్నది. ముఖచిత్రం ముద్దుగా ఉన్నదనలేము.

సభ్యులందరూ కూడా ఉన్న ఈ సమితి సాహిత్య సభకి నూతనాలంకారాలను తొడుగుతుంది నేనా అభిప్రాయం. శివానుగ్రహంవల్ల ఉద్యము సర్వతోముఖంగా సఫలీకృతం మౌతుందని నా ఆశయం.

సోమయాజులు

## ఇల్లరికం

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారి కథల సంపుటి నాలుగణాలు. యువకార్యాలయం–తెనాలి.

కుటుంబరావుగారు కథకుల్లో గట్టివారు. ఆయన వ్రాసిన ప్రతికథలోనూ ఒక thought గాని message గాని వుంటుంది. దాన్ని సూటిగా చెప్పగల డాయన.

ఇల్లరికం గుండెని కరిగించే కథ. శంకరానికి చిన్నతనంలో తల్లిదండ్రుల గారాంవల్ల ఏ అనుభవం లేదు; స్వేచ్ఛ కొంత లభించాక తుచ్ఛమయిన అనుభవం దొరికింది. ఆతనికి ప్రేమించే శక్తి ఉంది; కాని భార్య అనుకూలురాలు కాలేదు. ప్రేమించిన నాగ్వతి పరకీయ అత్తవారింట్లో ఖైదీ... స్వార్థబుద్ధి fairy tale. తేజస్వి అనేవాడు స్వార్థంకోసం రాజ్యపాలనలో కొత్త కొత్త పద్ధతులు తెచ్చి పెడతాడు. తన సౌఖ్యంకోసమే పాటుపడుతూ తెలియకుండా జనసామాన్యానికి సౌఖ్యం కలగజేస్తాడు. ఇతని సామ్యవాదం అద్భుతమైంది, కథ చిత్రచిత్రమైంది. ఒక సిద్ధాంతాన్ని నిలబెట్టాలనే వాదన లేకుండా సాఫీగా సాగింది. సలక్షణాలు లేని స్వార్థం హేయం కాదని నీతి. కథకుడు సామ్యవాది అని తోస్తుంది, కాని హింసాయుతమైన సామ్యవాదాన్ని ఆయన ఒప్పుకోడు. ప్రతివ్యక్తికి స్వాతంత్ర్యం వుండాలని ప్రతివ్యక్తి సుఖపడాలనీ ఈయన ఆశయం.

ప్రయాణం, నిష్కామకర్మ, యమసందర్శనం – మూడు చిన్న sketches. ఏమైనా సరే వ్యక్తిత్వాన్నీ ఆత్మగౌరవాన్నీ చంపుకోవద్దని ఈయన ప్రబోధ. తన్ను గురించి ఎవరికేమంటి విశ్వాసాలుంటే వారికవి అట్లా కనిపిస్తవని ఈయన విశ్వాసం. యుధిష్ఠిరు లంటివారు ఆత్మవిశ్వాసం చాలక ఒక్కసారి నరకం చూడవలసిన వారయారు గదా! కుటుంబరావుగారు పిరికితనాన్ని నిరసిస్తారు. Moral cowardice అసలు పనికిరా దంటారు. గతించినదానికి చింతించడం కూడా భీరుత్వమే నని వీరి సిద్ధాంతం. చచ్చినా ధైర్యంగా చావాలి అన్నారు.

ఈ కథలైదూ చివరదాకా చదవదగినవీ, చదివి జాగ్రత్తగా యోచించవలసినవీను.

శ. రాం.

# సంపాదకీయము

## గ్రంథాలయ పఠన మందిరములు.

పరిషత్తు తలపెట్టిన కార్యకలాపములో ఇంతవరకూ మేము చేయబూనుకొన్నవి వార్షికోత్సవాలూ సమావేశాలూ జరిపి నవ్యసాహిత్య ప్రచారము చేయడమూ, గ్రంథములు కొన్ని ప్రకటించడమూ పత్రికా ప్రకటనమూ, మాత్రమే. కొన్ని ముఖ్య కార్యములు ఇంకా స్పృశించనే లేదు. పుస్తక భాండారము పెట్టవలెనని చేసిన ప్రయత్నము ఇప్పటికి సఫలమయినది.

శ్రీ రావుసాహెబు డాక్టరు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు (కళాప్రపూర్ణ) తమ అమూల్యమయిన గ్రంథజాలమంతా - ముద్రితాముద్రితగ్రంథములూ వివిధ పత్రికల పాతసంచికలూ సంపుటాలూ - పరిషత్తువారు పర్లాకిమిడి నుంచి తెచ్చుకోవచ్చునని వాగ్దానము చేయడమువల్ల పరిషత్కార్యస్థానములో పుస్తక భాండారము నెలకొల్పవలెననే సంకల్పము దృఢమయినది. గ్రంథాలయముతోపాటు పఠన మందిరముకూడా ఏర్పాటు చేయదలచుకొన్నాము. ప్రతిభకు వినిమయముగా వస్తూవున్న పత్రికలకు కొన్ని ఇతర పత్రికలు తెప్పించి చేర్చినట్లయితే పఠనమందిరము చదువరులను ఆకర్షిస్తుందని భావించి అందుకు ఏర్పాటుచేసినాము. ఈ రెండు సంస్థలూ నెలకొల్పినప్పుడు సాహిత్యాభిమానులు ఒకచోట సమావేశము కావడానికి అవకాశము ఉంటుంది కనుక సాహిత్యగోష్ఠికీ, వారానికొకసారి అయినా సాహిత్యవిషయికము లయిన ఉపన్యాసములో చర్చలో ప్రసంగములో జరపడానికీ అవకాశము కల్పించదలచుకొన్నాము.

ఈ కార్యము లన్నీ కొనసాగించడానికి తగిన వసతి సంపాదించడములో మాకు అంత మాత్రమయిన శ్రమా కలుగలేదు. దివ్యజ్ఞాన సమాజభవనము సర్వవిధముల మా కార్యములకు అత్యంతానుకూలముగా, పరమప్రశాంతముగా, ఉంటుందని చెప్పి సమాజాధికార వర్గమువారిని కోరగా వారు ఎంతో ఉదారభావముతో, అడిగినదే తడవుగా, సమాజభవనమును చేరి ఉన్న ఒక హాలూ, రెండుగదులున్నూ పరిషద్గ్రంథాలయ పఠనమందిరములు పెట్టుకోడానికి ఆరుమాసములవరకూ అద్దెలేకుండా ఇచ్చినారు. వారికి మా కృతజ్ఞత ఇందుమూలముగా తెలియజేస్తున్నాము.

గ్రంథాలయ పఠనమందిరముల ప్రారంభోత్సవము ఫిబ్రవరి 6 వ తేదీ సాయంత్రము 6 గంటలకు జరిగినది. కార్యక్రమము శారదానికేతన విద్యార్థినుల ప్రార్థన

గీతములతో ఆరంభమయినది. తరువాత కార్యదర్శి నివేదిక. తనవద్దఉన్న నవ్య సాహిత్యగ్రంథములూ శ్రీ శివశంకరశాస్త్రిగారి సంస్కృతాంధ్రగ్రంథములూ చేర్చి అక్కడ పెట్టినామనీ, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి గ్రంథజాలము తెప్పించినమీదట తెలుగు పుస్తకముల సముదాయము ఇంచుమించు సమగ్రముగా ఉంటుందనీ, పఠన మందిరములో మూడు తెలుగు దినపత్రికలూ, ఆరు వారపత్రికలూ, ఆరు మాసపత్రికలూ పెట్టినామనీ, వారాని కొకసారి అయినా సాహిత్యవిషయికసభ పరిషత్కార్యాలయములో జరుపుతామనీ తన నివేదికలో కార్యదర్శి తెలియజేసినారు. తరువాత అధ్యక్షులు శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు (గుంటూరుజిల్లా విద్యా శాఖాధికారి) నవ్యసాహిత్యములో గోచరించే ప్రత్యేకత, నవీనాదర్శములు మొదలయిన విషయముల గురించి ఉపన్యసించి తెలుగు పలుకుబడిలో నానాటికి కలుగుతూవచ్చిన మార్పులూ, పదముల అర్థ విపరిణామమూ మొదలుగా గల సంగతులు బోధించే ఆంధ్రభాషా చరిత్రమూ, సమగ్రమయిన వాఙ్మయచరిత్రమూ రచించడానికి ఈ నవ్యసాహిత్య పరిషత్తు పూనుకోవలెనని ఉద్బోధించినారు. తరువాత పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడుగారు నవ్యసాహిత్యము ఏవిధముగా ప్రజలలో ఉత్తేజము కలిగిస్తున్నదో, పత్రికలద్వారా విజ్ఞానము వ్యాపింపజేస్తున్నదో, రాజకీయ, ఆర్థిక, సాంఘికాది విషయాలలో కవులూ, గ్రంథకర్తలూ పత్రికాధిపతులూ ఎప్పటికప్పుడు ఏవిధముగా మార్గదర్శకులై సంఘమును నడిపిస్తూఉంటారో, నవ్యసాహిత్యము ఇతర ప్రాంతీయ భాషలలోకంటె మన తెలుగుభాషలో ఏరీతిగా ఎక్కువ ప్రాశస్త్యము వహించినదో విశదీకరించి గ్రంథాలయ పఠనమందిరముల ప్రారంభోత్సవము చేసినారు. శ్రీ శివశంకరశాస్త్రిగారి అభినందన వాక్యములతో ఉత్సవము పరిసమాప్తమయినది.

## సభలు

౧౩-౨-౫౯ తేదీని శ్రీ చింతా దీక్షితులుగారు కథావాఙ్మయము గురించి ప్రసంగించారు. వేదములలోనూ ఉపనిషత్తులలోనూ ఉన్న కథల స్వరూపము గురించీ జాతకకథలూ పంచతంత్రమూ మొదలయిన కథల కున్న వ్యాప్తి గురించీ ముచ్చటించి తెలుగులోఉన్న ప్రాచీనకథా వాఙ్మయానికి అనగా ఇతరభాషలలోనుంచి దిగుమతిఅయిన పంచతంత్రకథలూ, సాలభంజికకథలూ, బొర్దర్వ్యాఘ్రకథలును దేశీయములయిన తెనాలి రామలింగడికథలూ కాశీమజిలీలు మొదలయిన కథాజాలానికి ఆధునిక కథానికలకూ ఉన్న భేదము వివరించినారు. ఇప్పటి కథకులలో ఒక్కొక్కరి

లో గోచరించే విశిష్టత నిరూపించి చిన్నపిల్లలు చదువుకోడానికి పనికివచ్చే కథలు 'ఫెయిరీ టేల్సు'వంటివి విరివిగా వ్రాయవలెననీ, కథలద్వారా ఎన్నెన్నో విషయాలు పిల్లల మనస్సులలో నాటుకొనేటట్టు బోధించవచ్చుననీ చెప్పినారు. సభ్యులడిగిన ప్రశ్నలకు జవాబుగా కథారచనములో తన అనుభవము గురించి చెప్పినారు.

ఫిబ్రవరి ౧౭, ౧౮, ౨౬ తేదీలలో శ్రీ అడవి బాపిరాజుగారు 'శిల్ప లక్ష్యములు' అనే విషయముగురించి మూడు ఉపన్యాసములు చేసినారు. వాటి సారాంశమిది:— లలితకళలన్నీ ఒకే సత్యముమీద ఆధారపడి ఉన్నవి. కళ మనుష్యుని సౌందర్యోపాసనాఫలము. అది ఆనందస్వరూపము. ఈసౌందర్యోపాసన వివిధ దేశాలలో, వివిధ కాలాలలో వేరువేరు రూపాలతో విలసిల్లినది. ఆ భిన్నత్వమే ఆయాకళలలో ద్యోతకమవుతుంది. మనజీవిత స్వరూపమువలెనే మన కళాస్వరూపముకూడా మన ఆశయాలను బట్టి ఏర్పడుతుంది.

శిల్పోపాసన ప్రాచ్యఖండాలలో - భరత ఖండము, చాల్డియా, ఈజిప్టులలో - ఉద్భవించి వికసించినది. ఈజిప్టునుండి గ్రీకు లిది గ్రహించి మహదాశయములతో నెలకొల్పినారు. కాని ఫైడాసు కాలమునాటికి గ్రీకుల ఆశయాలు ప్రాపంచిక వాసనాపూర్ణములై ఇది భౌతిక సౌందర్యోపాసనలోకి దిగినది. ఆనాటి గ్రీకు శిల్పము ఈనాటివరకూ యూరపు శిల్పానికి జనయిత్రి అయింది. అప్పుడప్పుడు మాత్రము కొందరు క్రైస్తవ శిల్పులు ఆధ్యాత్మికాశయాలతో శిల్పోపాసనకు పూనుకొనడము గోచరిస్తుంది.

"సౌందర్యోపాసనాశయము వట్టి ఆధ్యాత్మికము అయితే కళల అవసర మేముంది? కళలకు ముఖ్యాధారశక్తి హృదయ సంజనితముకాదా?" అని కొందరు వాదిస్తారు. నిజమే. జ్ఞానమాత్రమయిన ఉపాసన రసస్వరూపము తాల్చదు. కాని ఆధ్యాత్మికోపాసన భక్తే అయితే ఆభక్తిలోంచి ఎన్నికళలు ఎంత దివ్యస్వరూపంతో ఉద్భవించలేదు? ఆ భక్త్యుపాసనే లేకపోతే మన దేశములో లలితకళ లేవీ ఉద్భవించక పోయిఉండును. పాశ్చాత్యదేశాలలో ఉన్న తాశయాలు తక్కువ కావడమువల్ల కళయొక్క నిజస్వరూపము గోచరించక వాళ్ళెప్పుడూ కొత్తమార్గాలు అన్వేషిస్తూ 'డాడాయిజము, ఇంప్రెషనిజము, క్యూబిజము, సర్ రియలిజము. ప్రిమిటివిజము' మొదలయినవి ప్రవేశపెట్టినారు.

మన దేశాలలో ఆశయము ఎప్పుడూ ఒకే రీతిగా ప్రజ్వరిల్లుతూ ఉన్నది. ఉపాసనా

విధానాలలో మాత్రము మనవారు క్రొత్త క్రొత్త సంప్రదాయాలు నిర్మించు కొంటున్నారు.

ఇప్పుడు ప్రాక్పశ్చిమ దేశాలకున్న అన్యోన్యప్రోద్బలమువల్ల అనేక శాఖలలో క్రొత్త సంప్రదాయాలు ఉద్భవించడము చూస్తున్నాము. శిల్పాది లలితకళలలో ఏలాంటి నూతన సంప్రదాయాలు బయలుదేరుతవో చూడవలసి ఉన్నది. ౨౫-౨-౩౮ తేదీని శ్రీ ప్రయాగ శేషాద్రిశాస్త్రిగారు గుంటూరు మండలములోని పురాతత్త్వ పరిశోధన గురించి ప్రసంగించారు. నాగార్జున కొండవద్ద భూగర్భములో కనబడిన బౌద్ధయుగమునాటి ప్రాచీన శిల్పమూ నాగరికతా ఎట్టివో, పలనాటితాలూకా లోనూ ఇతరప్రాంతాలలోనూ కనబడే ప్రాచీనశిల్పమూ శాసనాలు మొదలయినవి ఏరీతిగా మనపూర్వుల చరిత్ర వెల్లడిస్తున్నవో వారు తెలియజేశారు.

౨౬ వ తేదీని శ్రీ బాపిరాజుగారు ఉపన్యసించకపూర్వము డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు కళగురించి ఉపన్యసించారు. చతుష్షష్టికళ లేవో నిరూపించి ప్రాచీన కాలములో మనవా రేపనిజేసినా కళాదృష్టితో చేసేవారని రుజువుచేశారు.

౪-౩-౩౮ తేదీని శ్రీ వింజమూరి శివరామారావుగారు తమవీ, కృష్ణశాస్త్రి ప్రభృతులవీ క్రొత్తపద్యాలు చదివి వినిపించారు. ౫-౩-౩౮ తేదీని శ్రీ వేమూరి విశ్వనాథ శర్మగారు గుంటూరు మండలములో పిండారీదండు చేసిన ఘోరకృత్యములగురించీ వారిని ఎదిరించడములో పురుషులుచూపిన ధైర్యపరాక్రమములూ, వారివల్ల మానహాని కలగకుండా కొందరు స్త్రీలు ఎట్లు సాహసించి ఆత్మరక్షణ చేసుకున్నారో, వారి చేతులలో పడకుండా ఉండడానికి వేరుమార్గము లేక ఎంతోమంది స్త్రీలు ఏవిధంగా ఇళ్ళలోవుండి ఇంటికి చిచ్చుపెట్టుకొని, నూతులలోకి ఉరికీ, నాలుకలు పీక్కొనీ మరణమే శరణము చేసుకొన్నారో ఆదండు గురించి ప్రభుత్వమువారప్పుడు వ్రాయించిన రిపోర్టులో భాగములు చదివి వివరించినారు.

మార్చి ౬ వ తేదీని శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, 'తెలుగు కవిత్వములో ఫామనులు' అనేవిషయము గురించి ప్రసంగించారు. ఆ ప్రసంగసారాంశము వ్యాసరూపముగా ఈసంచికలో ముద్రించాము.

౧౩ వ తేదీని శ్రీ వావిలాల సోమయాజులుగారు ప్రాచీన గేయవాఙ్మయము గురించి ప్రసంగించారు.

౨౫ వ తేదీని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కావ్యపఠనము జరిగినది. 'మూల

ప్రకృతి, భ్రష్టయోగి, అజాగ్రత్త, వసంతఋతువు, మూగనోము, [కొం]డవీటి పొగ మబ్బులు' అనే ఖండకృతులు చదివిన తరువాత వ్రాస్తూవున్న రామాయణములోని విశ్వామిత్రతపోభంగమూ, శకుంతలాజననమూ, అనే ఘట్టాలు చదివి సభ్యులను ఆనందపరవశులను చేశారు. విశ్వేశ్వర శతకములోనివి కొన్ని పద్యాలతో సభ మంగళాంత మయినది.

మార్చి ౨౯ వ తేదీని శ్రీ శిష్ట్లా ఉమామహేశ్వరరావు గారున్ను ఏప్రిలు ౮ వ తేదీని 'కవిత్రయం' అనగా వింజమూరి శివరామం, వావిలాల సోమయాజులు, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిన్ని తమ పద్యాలు చదివి వినిపించారు.

## వార్షికోత్సవము

సప్తమవార్షికోత్సవము డిసెంబరు ఆఖరువారములో నెల్లూరులో జరగవలసి ఉండెను. కొన్ని అనివార్యములయిన కారణాలవల్ల నిలిచిపోయినది. ఈ ఉత్సవము మద్రాసులో మేనెల మూడోవారములో ఏర్పాటు చేయదలచుకోగా మేనెలలో కంటె జూలైలో కళాశాలలూ, కోర్టులూ తెరచిన తరవాత జరిపితే ఎక్కువమంది ఉత్సవములో పాల్గొనడానికి అవకాశము ఉంటుందని మద్రాసువారు అనడమువల్ల జూలై 29-30 తేదీలలో జరపడానికి నిశ్చయించినాము. ఆహ్వానసంఘము ఏర్పడ్డది. ఆ సంఘ కార్యనిర్వాహక వర్గమువారు ఎంతో ఉత్సాహముతో పనిచేయడానికి ప్రారంభించారు. సభలు జయప్రదముగా జరుగుతవని ఆశిస్తున్నాము.

## స్వవిషయము

జనవరిలో వెలువడవలసిన సంచిక ఇంత జాగుచేసి జనవరి ఏప్రిల్ సంచికలుగా కలిపి ఆలస్యముగా ప్రకటించినందుకు పాఠకులు మన్నింతురుగాక అని ప్రార్థన. కాకితము దొరకక కొన్నాళ్లూ, ముద్రాలయమువారికి తీరిక లేక కొన్నాళ్లూ ఆలస్యమయినది. ఈ సంచికతో మూడు సంపుటములు పూర్తి అయినవి. చాలామంది పత్రిక పుచ్చుకొంటూ చందాలు పంపడము విషయములో అశ్రద్ధచేస్తున్నారు. చందాలూ, విరాళములూ పంపి పత్రికా నిర్వహణానికి చందాదారులూ సభ్యులూ భాషాభిమానులూ తోడ్పడుదురుగాక అని కోరుతున్నాము.

# ఆదాయ వ్యయములు

[1938 ఏప్రిల్ 1 వ తేదీనుంచి]

## ఆ దా య ము.

| విరాళములు. | రు |
|---|---|
| మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు | 116 |
| శ్రీ గురుభాగవతుల సుబ్బారావుగారు | 15 |
| తెలికిచర్ల వెంకటరత్నంగారు | 10 |
| | 141 |
| పత్రికల అమ్మకమువల్ల | 5 |

| చందాలు. | |
|---|---|
| పెద్దాడ రామస్వామిగారు | రు 2 |
| కల్లూరి సుబ్బారావుగారు | 2 |
| కొండుకూరి రామభద్రరావుగారు | 2 |
| బుర్రా సుబ్రహ్మణ్యంగారు | 4 |
| భాస్కరభట్ల కృష్ణారావుగారు | 2 |
| రావాడ మహాదేవుగారు | 2 |
| కాభూరి వ్యాసమూర్తిగారు | 2 |
| వేమూరి వెంకటేశ్వర్లుగారు | 2 |
| బి. కనకసుందరంగారు | 2 |
| గ్రామపుస్తక భాండారము - వేగాయమ్మపేట | 2 |
| వి. వి. జోగారావుగారు | 2 |
| ముక్కపాటి సుబ్బారావుగారు | 2 |
| నాగలింగం వెంకటేశ్వరశాస్త్రిగారు | 2 |
| కాశీపట్నం కొండయ్యగారు | రు 2 |
| కాళ్ళకూరి సూర్యనారాయణగారు | 6 |
| శిష్ట్లా మాధవ సోమయాజులుగారు | 4 |
| దేశిరాజు కృష్ణశర్మగారు | 2 |
| కూచిభొట్ల వెంకటేశ్వర్లుగారు | 2 |
| ఆంధ్రసారస్వతసంఘం - అనంతపురం | 2 |
| కొల్లి సత్యనారాయణచౌదరిగారు | 4 |
| దేశిరాజు బాబూరావుగారు | 2 |
| వుప్పాటూరి పున్నారావుగారు | 6 |
| సీరిపి ఆంజనేయులుగారు | 4 |
| వి. శ్రీరాములుగారు | 2 |
| దేశిరాజు కృష్ణశర్మగారు | 4 |
| చింతా దీక్షితులుగారు | 2 |
| కె. వి. చలపతిరావుగారు | 2 |
| సురవరం ప్రతాపరెడ్డిగారు | 2 |
| పెద్దిభొట్ల చలపతిరావుగారు | 4 |
| పులిపాటి రామారావుగారు | 2 |
| పడాల కోటయ్యగారు | 4 |
| విష్ణుభొట్ల సూర్యనారాయణగారు | 4 |
| తెలికిచర్ల వెంకటరత్నంగారు | 2 |
| వాడపల్లి నరసింహారావుగారు | 2 |
| మంతెన వెంకటరాజుగారు | 2 |
| తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు | 2 |
| మారేమండ రామారావుగారు | 4 |

| | |
|---|---|
| జంధ్యాల పురుషోత్తమశాస్త్రిగారు | రు 2 |
| వల్లభజోశ్యుల సుబ్బారావుగారు | 4 |
| వాసిరెడ్డి మహాదేవయ్యగారు | 2 |
| వాసిరెడ్డి చంద్రశేఖరంగారు | 2 |
| వాసిరెడ్డి భీమప్రసాద్‌గారు | 2 |
| చిరుమామిళ్ళ రామమూర్తిగారు | 2 |
| డి. వెంకటరత్నంగారు | 2 |
| పి. కామేశ్వరరావుగారు | 2 |
| వాసిరెడ్డి వీరవరప్రసాద్‌గారు | 2 |
| మహాబలరావుగారు | 2 |
| అడవి బాపిరాజుగారు | 4 |
| పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు | 2 |
| చిలుకూరి నారాయణరావుగారు | 2 |
| వై. వెంకటరావుగారు | 2 |
| గొల్లపూడి లక్ష్మయ్యగారు | 2 |
| యల్లాపంతుల జగన్నాధంగారు | 4 |
| దేశిరాజు సత్యసుబ్రహ్మణ్యంగారు | 2 |
| బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు | 2 |
| గోవిందరాజుల దత్తాత్రేయశర్మగారు | 2 |
| మొక్కపాటి సుబ్బారావుగారు | 2 |
| మొక్కపాటి నాగేశ్వరరావుగారు | 2 |
| ఖండవల్లి లక్ష్మీరంజనంగారు | 2 |
| ఓకుమళ్ళ కామేశ్వరరావుగారు | 2 |
| వేదాంతం లక్ష్మీపతిగారు | రు 2 |
| నోరి నరసింహశాస్త్రిగారు | 2 |
| డి. సత్యనారాయణగారు | 4 |
| హైదారాబాద్ పుస్తకశాల | 2 |
| పెనుమకూరు ఉపాధ్యాయ సంఘము | 2 |
| వి. అనంతాచారిగారు | 2 |
| వాసిరెడ్డి శివలింగయ్యగారు | 2 |
| పి. సుబ్రహ్మణ్యంగారు | 2 |
| వేదుల సత్యనారాయణశాస్త్రిగారు | 4 |
| మల్లవరపు విశ్వేశ్వరరావుగారు | 4 |
| పెనుమర్తి కామేశ్వరరావుగారు | 2 |
| | 180 |
| మొత్తము | 326 |

వ్యయము.

| | |
|---|---|
| కాగితము | 53-7-0 |
| గ్రంథాలయ ముద్రాశాలకు | 430-0-0 |
| తపాలాఖర్చులు మొదలయినవి | 98-6-0 |
| | 581-13-0 |

# లేములవాడ చాళుక్యులు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## ౧

## ఆధారములు

చాళుక్యవంశజులగు రాజులు దక్షిణాపథమున పెక్కుతావుల దొరతనము సల్పిరి. చాళుక్యవంశమున కెల్ల మూలకందప్రాయమైనది బాదామిశాఖ. బాదామివంశమునుండియే తక్కిన చాళుక్యరాజకుటుంబము లన్నియు నుప్పతిల్లినవి. వేంగీపూర్వచాళుక్యకుటుంబమును, కల్యాణిపాశ్చాత్యచాళుక్యకుటుంబమును, గుజరాతు చాళుక్యకుటుంబమును సుప్రసిద్ధమైనవి. ఇంతటి ప్రఖ్యాతి నందకపోయినను ఆంధ్రదేశమున వర్ధిల్లిన రాజకుటుంబములు మఱి రెండు కలవు: (౧) లేములవాడవంశము, (౨) ముదిగొండవంశము. ఈ రెండు వంశములును స్వతంత్రములై రాచరికము సలుపక పోయినను, సార్వభౌమత్వము నంది, దక్షిణాపథమున చాల భాగమును పాలించిన సంస్థానములకు దోడ్పడి యనేక మహత్కార్యముల నొనర్చియుండు కారణమున నివియు చిరస్మరణీయములు.

ప్రథమమున లేములవాడచాళుక్యవంశచరిత్రను గనుగొందము. వీరి చరిత్రకాధారము లిరుదెఱంగులవి: ౧. శాసనములు; ౨. వాఙ్మయము. శాసనములు ద్వివిధములు: శిలాశాసనములు, తామ్రపట్టికలు. శాసనసామగ్రి విస్తారము గాదు. ఇంతవఱకు లభ్యమైనవి ఈ వంశమువారి శాసనములు మూడు. వీనియందు రెండు తామ్రపట్టికలు, తక్కినది శిలాశాసనము.

(౧) కొల్లిపఱతామ్రశాసనము :— గుంటూరు మండలమందలి కొల్లిపఱ యను గ్రామమున దొరకినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే పరిష్కరింపబడి భారతియందు ప్రకటింపబడినది[1]. ఇందు వరాహముద్రికతోడి వలయమున గ్రుచ్చబడిన ఐదు రేకులు గలవు. ఈ శాసనము నిచ్చిన రాజు చాళుక్యవంశసంభూతుడగు నరికేసరి. ఇతని వంశవర్ణన కలదు. చాళుక్యవంశమున సత్యాశ్రయుడు పుట్టెను; ఇతని కుమారుడు పృథివీపతి. అతనికి మహారాజును, మహారాజునకు రాజాదిత్యుడును కలిగిరి. రాజాదిత్యుని పుత్రుడు వినయాదిత్యుడు. ఇతనికి శ్రీరాముడు రాజవిక్రముడు విశ్వరాట్ యుద్ధమల్లుడు నృపాంకుశుడు అను బిరుదనామములు గలవు. ఇతడు సాగరవేలావేష్టితమైన సకలధరామండలమున కధిపతియట! తురుష్క, యవన, బర్బర, కాశ్మీర, కాంభోజ, మగధ, మాళవ, కళింగ, గంగ, పల్లవ, పాండ్య, కేరళ ప్రభృతిరాజలోకముచే నర్చగొనెనట! భగవన్నారాయణుని వరాహలాంఛనముచే భూచక్రమునంతటిని స్వాధీనపఱచుకొనెనట! ఈ వినయాదిత్యుని కుమారుడే ప్రస్తుతశాసనమును వ్రాయించిన యరికేసరిమహారాజు. ఇతని సుగుణసంపత్తియు, శౌర్యాతిశయమును, విద్యాధిక్యమును విశేషముగ వర్ణింపబడియున్నవి. సమస్తలోకాశ్రయుడు, త్రిభువనమల్లుడు, రాజత్రినేత్రుడు, సాహసరాము డనునవి ఇతని బిరుదనామములు. ఇతడు శ్రీపర్వతమున కుత్తరద్వారమైన ఏలేశ్వరమున నివసించుచుండిన సద్యోశివాచార్యుని శిష్యుడగు ముగ్ధశివాచార్యునకు 'రామడు' విషయమున 'ఊరిగ' యను మహాప్రసిద్ధగ్రామమునకు దక్షిణదిగ్భాగమున నున్నట్టియు, 'తువతోంబు', 'పరివాతున్న', 'పుల్పొబువుఱొ', 'పోనుపోంబి' గ్రామముల మధ్య నున్నట్టియు, 'బెల్మొగ' మని ప్రసిద్ధమైన గ్రామమును విద్యాదానముగ నిచ్చెను.[2] ఈ దానమును ప్రకటించుటకొఱకే ఈ శాసనము వ్రాయబడెను.

---

1. భారతి. సం. ౩. భా. ౨, పుటలు ౨౯౪-౩౧౮.

2. Ibid ౩౦౦-౩౦౧.

(౨) పరభణితామ్రశాసనము :—హైదరాబాదు రాజ్యములోని పరభణివాస్తవ్యుడగు శ్రీ శం. నా. జోశీగారి కడ నుండెను. ఇది పూనానగరమందలి భారతఇతిహాససంశోధకమండలివారిచే బ్రకటిత మగు మహారాష్ట్రత్రైమాసికపత్రిక (భాగ. ౧౩. అంక. ౩) యందు మొదట బ్రచురింపబడెను. 'జైన సాహిత్య ఔర్ ఇతిహాస్' అను హిందీగ్రంథమున 'సోమదేవ సూరికా నీతివాక్యామృత్' అను వ్యాసమునకు పరిశిష్టముగ ముద్రించబడినది3. లిపి యప్పటి తెలుగు-కన్నడ లిపి. భాష సంస్కృతము. ఇందు మూడు రేకులపై నేబదియొక పంక్తుల యక్షరములు గలవు. ఈ శాసనము నొసగిన రాజు సూర్యునినుంచి యుద్భవమైన చాలుక్య వంశమున బుట్టిన ముమ్మడి యరికేసరి. ఇందు అరికేసరి యొక్క వంశప్రశస్తి కలదు. ఆదిత్యభవమగు విఖ్యాత చాలుక్యవంశమున యుద్ధమల్లు డను రాజు పుట్టెను. ఇతడు సపాదలక్ష దేశము నేలెను; పోదనమున దైలవాపి యందు ఏనుగుల యవగాహోత్సవమును గావించెను. ఇతని పుత్రుడు అరికేసరి సకలింగత్రయవేంగిదేశమును స్వపరాక్రమమునన్ల జయించెను. అతనికి నరసింహ, భద్రదేవు లను పుత్రు లిరువురు కలిగిరి. నరసింహుని కుమారుడు యుద్ధమల్లుడు. అతనికి బద్దెగ డను తనయు డుదయించెను. ఈ బద్దెగడు నీటిలోని మొసలినిబలె యుద్ధమున భీమపరాక్రముడైన భీముని జయించెను. బద్దెగని కొడుకు యుద్ధమల్లుడు. ఇతనికి నరసింహు డుదయించెను. నరసింహుని కుమారుడు అరికేసరి. ఇతడు రాష్ట్రకూట కులసంజాతయగు లోకాంబిక యను కన్యకను పెండ్లియాడెను. వీరికి భద్రదేవు డను కుమారుడు పుట్టెను. భద్రదేవుని పుత్రుడు అరికేసరి. ఈ యరికేసరిమహారాజు 'సమధిగతపంచమహాశబ్ద మహాసామన్తాధిపతి సమస్తభువనసంస్తూయమాన ... సామ్బరాంకుశామ్మనగంధవారణగన్ధభవిద్యాధరప్రియగల్లత్రిభువనమల్లోదాత్తనారాయణ ప్రత్యక్షవాద్యలి విక్రమార్జునగుణనిధి గుణార్ణవసామన్తచూడామణిప్రముఖానేక ... విజయాంకమాలికాలంకృతుడు'. ఇతడు శకాబ్దములు ౮౮౮ గతించిన పిమ్మట ప్రవర్తమానక్షయసంవత్సర వైశాఖపౌర్ణమాస్యా బుధవారమునాడు గౌడసంఘమునకు జెందిన యశోదేవమునిశిష్యుడును, యశోధరచరిత్రస్యాద్వాదోపనిషదాదిగ్రంథకర్తయు నగు సోమదేవ సూరి యను జైనవిద్వాంసునకు సబ్బిదేశాంతర్గతమైన రేపాకద్వాదశగ్రామీమధ్యస్థకుత్తుంపృత్తి నికటుపలు గ్రామమును నిజరాజధానియగు లేంబులపాటకమున దన తండ్రియగు బద్దెగనియొక్క 'శుభధామజినాలయ' మను పేరు గల వసతికి ఖండస్ఫుటితనవసుధాకర్మబలినివేద్యార్థముగ దాన మొసగెను4.

ఈవంశమునకు సంబంధించిన శిలాశాసన మొక్కటియే లభ్యమైనది. ఇది వీరి రాజధానియైన వేములవాడయందే కలదు. దీనిని హైదరాబాదునందలి లక్ష్మణరాయ సంశోధకమండలివారు సంపాదించిరి. వారికడ గ్రహించి శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులు ఎం.ఏ., బి. ఎల్. గారు ప్రథమమున నాంధ్రేతిహాసికసంఘమువారి త్రైమాసికపత్రికయందును, తరువాత ఆంగ్రమున భారతియందును బరిష్కరించి ప్రకటించిరి5. లక్ష్మణరాయసంఘమువారు ప్రకటించిన తెలింగాణశాసనముల సంపుటమునందును నీ శాసన గ్రంథము ప్రచురణమైయున్నది.6 కాని ఇందు శాసనగ్రంథము పెక్కుతావుల యథావాత్రకము గాక యపపాఠములతో నిండియున్నది; కాని రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యుల వారు మాతృకను జూచి తప్పులను సవరించుకొని యుండిన తమ ప్రతిని నాకు దయచేసి యొసగిరి. వీరి సవరణల ననుసరించియే ఇచ్చట నీ శాసన గ్రంథమును సంగ్రహముగ దెల్పుచున్నాను:- పరమండలైకరాముడు చాళుక్యకులతిలకుడు వినయాదిత్యు డను నామాంతరము గల యుద్ధమల్లు డను రా జొక డుండెను. అతడు అనన్యశాస్యమగు సపాదలక్ష దేశమును శాసించెను. పోదనమున తైలపూరమగు కొలనిలో నేనుగులను స్నానమాడించెను. అసురేంద్రుల

3. జైన సాహిత్య ఔర్ ఇతిహాస్. పుట. ౯౦.

4. Ibid.

5. JAHRS VI. P. 16; భారతి. సం. ౯. భాగ ౨. పుటలు ౨౫౦-౬౦.

6. తెలిం. శాసనములు. ఇతర. సం. ౨౧.

కైనను సమీపింప శక్యముకాని యా చిత్రకూటమును హరించెను. అతని పుత్రుడు అరికేసరి వేంగీదేశము నఖిలమును బలవంతముగ గ్రహించెను. అతని పుత్రుడు రాజాదిత్యనామాంతరుడగు నరసింహవర్మ్మడు; యుద్ధమల్లు డతనికి బుట్టెను. అటువెనుక బద్దిగడును, మరల యుద్ధమల్లు డను రాజును ప్రభుత్వమొనర్చిరి. తదనంతరము నరసింహదేవుడు రాజాయెను. ఇతడు దుస్సాధ్యగతగులగు సప్తమాళవముల రాజులను సమరాంగణమున నోడించి తనకు గప్పమిచ్చువారినిగా జేసుకొనెను. తా నొక్కడే యెదురువచ్చిన గూర్జరరాజసేనను నిర్జించి కాళప్రియ మను చోట శిలాస్తంభమున స్వశౌర్యమును లిఖించెను. ఇతనికి అరికేసరి యను తనయు డుదయించెను; గోవిందరాజు క్రుద్ధుడు కాగా వెఱచి తన మరుగుజొచ్చిన బిజ్జని కభయ మిచ్చి యాతని నరికేసరి సంరక్షించెను. ఇంద్రరాజుపుత్రికయైన రేవకనిర్మడి నిత డుద్వాహము జేసికొనెను. 'సమధిగతపంచమహాశబ్దమహాసామన్తాధిపతి...పాంబరాంకుశసమ్యగ్గంధవారణం గన్ధవిద్యాధరనారూఢసర్వజ్ఞ ముదాత్తనారాయణంనొడుదం తెగల్వాం గుణనిధిసకార్ణ్ణం శరణాగత వజ్రపంజరం ప్రియగళ్ళం త్రిభువనమల్లసామన్తచూడామణి' యను నవి యరికేసరిన్నృపాలుని బిరుదులు.

బద్దిగభూమిపాలుని తంత్రాధిపాలుడు నారమార్య్య డనునతడు పుట్టెను; అతనికి గుణార్ణ్ణవోర్వీపతి యొక్క తంత్రపాలుడు పెద్దణార్యుడు కుమారుడు కలిగెను. ఈ పెద్దణార్యునిచే నిర్మింపబడిన యాదిత్యగృహమునందలి దేవతావందనమునకు వచ్చిన యభ్యాగతజనసత్రముకొఱకు అతనిచే నభ్యర్థింపబడినవాడై యరికేసరిక్షితిపతి యుత్తరాయణ సంక్రాంతిదినమున లేంబులవాటకపట్టణమున కీశాన్యదిశయందు నూఱు నివర్త్తనల భూమిక్షేత్రమును, అష్టనివర్త్తనల పానీయ భూమిక్షేత్రమును ఇచ్చెను. దీని కచటి రాజేశ్వర గృహాదిత్యగృహబద్దెగేశ్వరనగరేశ్వర ప్రభృతిచతుస్థానాధివాసులైన సాక్షిమల్లికార్జ్జున ముక్తలింగివిద్యారాశివ్యాఖ్యానభట్టారకులు సాక్షులు. చంద్రశ్రేష్ఠిప్రభృతులు తొమ్మండుగురు శ్రేష్ఠులు సాక్షులు 7.

శాసనముల మూలముననే కాక కర్ణాట సంస్కృతవాఙ్మయములవల్లగూడ వేములవాడచాళుక్యరాజుల చరిత్ర కొంత తెలియుచున్నది. కర్ణాట కవిశ్రేష్ఠుడైన పంపకవి ఇతని కాశ్రితుడు. స్వవిరచితవిక్రమార్జునవిజయమునందు పంప డరికేసరివంశచరిత్రమును గుణగణములను వర్ణించియున్నాడు 7-a.

చళుక్యవంశమున దుగ్ధమల్లు డను రాజు వెలసెను (౧:౧౫); అతడు సపాదలక్షక్షితి నేలెను (౧౬); మఱియు పోదనమున తైలపూరితదీర్ఘికలయం దేనూఱేనుగుల నవగాహ మాడించెను (౧౭); అతని కరికేసరి యను పుత్రుడు గలిగెను. ఈ యరికేసరి నిరుపమదేవుని రాజ్యకాలమున వేంగిమండలమును, త్రికళింగమును జయించెను (౧౮-౨౦).

> నిరుపమదేవన రాజ్యదొ
> ళరికేసరి వెంగివిషయమం త్రికళింగం
> బెరసొత్తికొండు గర్వదె
> బరెయిసిదంపెసర నఖిలదిగ్భిత్తిగళొళ్.

అరికేసరికి నరసింహ భద్రదేవు లను కుమారు లిరువురు సంభవించిరి (౨౨); నరసింహునియొక్క జ్యేష్ఠపుత్రుడు యుద్ధమల్లుడు; అతని పెద్దకొడుకు బద్దిగడు(౨౨); ఇతనికి 'సోలదగండ'డని బిరుదునామము కలదు; నలువదిరెండు సంగ్రామములయందు విజయమందెను. భీము డను రాజును నీట మొసలిని పట్టినట్లు పట్టెను (౨౩, ౨౫-౬).

> బల్వరికె యొళరి నృపర ప
> డల్వడె తత్తిఱెను రణదొళా విక్రమమం
> సొల్విన మావజిఱసిదం
> నాల్వత్తెర డఱికె గాళసంగొళొ శీతం.
>
> వనదిపరీతనూతళదొ
> ళితనె సోలదగండ నెంబ పెం

---

7. తెలింగాణశాసనములు. ఇతర. నెం. ౨౧

7-a. పంపవిక్రమార్జున విజయము. ఆశ్వా. ౧౧౫-౮౨.

పిన పెసరం బిఱిల్చుదుదు
మల్లదె విక్రమదిందె నిందదు
కానలిజిదాంతరం మొసళె
యుం కిడె ఒత్తె నీరోళొత్తి ఖి
మనారతిగర్వదిం నడెదొ
మెయ్గలి బద్దెగ నన్న వాసనో.

బద్దెగ నితడత్యుడు యుద్ధమల్లుడు; ఇతని కుమారుడు నరసింహదేవుడు (౨౦-౧). ఇతడు లాటుల నోడించెను; ఏడు మాళవములను చెఱపట్టి పాడుగావించెను. విజయార్ధపురస్సరవిజయగజములను పట్టుకొని, గూర్జరరాజధ్వజము నెదిర్చి గెల్చెను; పిడుగువలె పైబడిన నరసింహుని దళమునకు జడిసి యున్మ లించుచు నడిచినచో నడువజాలక, పడుకొనినచో పడుకొననేరక, నిలచినప్పుడు నిలువనేరక మహీపాలుడు పాఱిపోయెను; గంగాజలముల నిజతురంగమును తాన మాడించి, ప్రసిద్ధమైన కాళప్రియమున దన యసిలతను నిజభుజవిజయగర్వమునల్ల స్థాపించెను (౨౨-౨౫)

తెఱిసెందు లాటరోళ్ త
త్తెఱదేళం నేళెళ్దు మంకలమిన్నుం
తెఱినీరకప్ప పుడనిసిద
తఱసలవిన చలవబలద కలినరసింహం.

ఏఱుం మాళవమండా
జేఱ తప్పిదను నరగ నురిపిదొడెకరిం
కేఱిసివాలన నేజద
ఓళిలవనుకరిపు వారు వోగదురిపురిగళ్.

విజయార్ధపురస్సర
విజయగజంగళనె పిడిదు ఘూర్జరరాజ
ధ్వజినియ నిళిదోడిసి భుజ
విజయద విజయానుమనిఱిసిదం నరసింహం.

సిడిలవోలెఱగువనరగన
పడెగళిదుమ్మళిదెనుం దెడెయొళున్నదెయుం
కడెదెడెరోళ్ కడెయదెనిం
దెడెరోళ్ నిల్లదెయుమోడిదం మహిపాలం.

గంగావార్ధియొళాత్మతు
రంగమనం మిసిసి నెగళ్ద కాళప్రియదోళ్
సంగతగుణనసిలతెయన
సంగోళె భుజవిజయగర్వదిం స్థాపిసిదం.

నరసింహుడు జాకవ్వను పెండ్లియాడెను (౨౯). ఈ దంపతుల కరికేసరి యను సుపుత్రుడుదయించెను (౪౧-౨). ఇతనికి పెక్కు బిరుదనామములు గలవు. అందు ముఖ్యమైనవాని గొన్నిటి నిచట చేర్కొని యెదను: 'ఉదాత్తనారాయణం ...... నుదార మహేశ్వరం, కదనత్రినేత్రం, జగదేకమల్లం, పాణ్బరం కుశం, అమ్మన గంధవారణం, పడెమెచ్చెగండం, ప్రియ గళ్ళం, గుణనిధి, గుణార్ణవం, సామంతచూడామణి' ఇత్యాది (౧౪౭-౧౪౯ మధ్యవచనం). అరికేసరియొక్క సాహసకార్యములు సంస్మరణీయములు. చళుక్యకుల తిలకుడగు విజయాదిత్యునిపై గోవిందరాజు కోపించగా నాతని నెనుకకు జేర్చుకొని రక్షించెను; గొజ్జిగ యను సకలచక్రవర్తి యాజ్ఞపై దనమీద దండెత్తి వచ్చిన మహాసామంతులను మాఱుమొగమునడవోడించి గెల్చెను; అతికర్తియై తన్ను మార్కొన్న చక్రవర్తిని గెలిచి తన్ను నమ్మివచ్చిన బద్దెగదేవునికి సామ్రాజ్యము నొసగెను; సమదగజఘటాటోపముతో గూడి నేల యదరునట్లు వచ్చి తాకిన కక్కలుని తమ్ముడగు బప్పువనంకకారుని యొక మదాంధగంధసింధురముచే నోడించెను.

"చళుక్యకులతిలకనప్ప విజయాదిత్యంగె గోవింద రాజం ముళియతెళరదె పెఱగిక్కి కాద శరణాగతజళ నిధియ పెంపుమం గొజ్జిగనెంబ సకళచక్రవర్తి వెసదె దండు వంద మహాసామంతరం మరళీఱిదు గెల్ద సామంత చూడామణియ బీరము మనలి ఱిఱియాగి మార్మలెవ చక్రవర్తియం కిడిసి తన్న నంబి బంద బద్దెగదేవంగె సకళ సామ్రాజ్యవనీరంతుమాడి నిఱిసి దరికేసరియ తోళ్వలనుమం సమద గజఘటాటోపం బెరసు నెలనదిరె వందు తాగిద కక్కలన తమ్మనప్పబప్పువనంక కారనొంద మదాంధగంధసింధురవోళోడిసిద వైరగజఘటా విఘట ననదటుమం..."[8]

---

౮. పంప. విక్రమార్జునవిజయము. ఆ.౯.౫౨, ౫౩ ల మధ్యవచనము.

ఈ వంశవృక్షమున జెప్పిన మొదటి ముగ్గురికిని, కడపటి యిద్దరికిని గల యన్యోన్యసంబంధము స్పష్టము సేయబడియున్నది. పైజెప్పినవారికిని, క్రిందివారికిని పితృపుత్రబాంధవ్యము గలదని శాసనభాషవల్ల దెల్లమగుచున్నది. కాని తక్కినవారి కొందరగులకు గల పరస్పర సంబంధమును నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. 'అతః' 'తతః' 'పశ్చాత్' అను పదములే యొక తరమును దాని వెనుకటితరముతో గూర్చుటకు వాడబడియుండుట చేత మొదటి నరసింహుని యనంతరము రెండవ యుద్ధమల్లుడును, తదనంతరము బద్దెగుడును, నతనివెనుక మూడవ యుద్ధమల్లుడును, వానివెనుక రెండవ నరసింహుడును రాజ్యము చేసి రని తెలియుచున్నది; కాని వారికి గల పరస్పరబాంధవ్యమును నిర్ణయించుటకు వీలుగాదు. పంపకవి తన విక్రమార్జునవిజయపీఠికయందు వర్ణించిన వంశానుక్రమణికయందును నీరాజులందఱును నీక్రమమున జేర్కొనబడి యున్నారు; కాని యందు పై వంశవృక్షమున నెన్నబడినట్టి యన్ని తరములయందును పైవారికి క్రిందివారికి పితృపుత్రబాంధవ్యము గలదా యని చెప్పయున్నది. పంపకవి పై వంశవృక్షములో కడపటివాడగు ఇమ్మడి యరికేసరిరాజుని కాశ్రితుడగుటచే నతనిచే దెల్పబడిన బాంధవ్యము వాస్తవమైన దని నమ్మవచ్చును.




ఈ వంశవృక్షము వేములవాడ శాసనోక్తవంశవృక్షముతో నీషద్భేదముతో సరిపోవుచున్నది. మొదటి భేద మేమనగా వేములవాడశాసనములో నాలవ మూడవ తరముల రాజులకు మూలపురుషునికి బోలి యుద్ధమల్లుడను పేరు గలిగినట్లు చెప్పియుండగా విక్రమార్జున విజయమునందు వీరి పేర్లు దుగ్ధమల్లు డని యున్నది. కాని యీ భేదము తాళపత్రగ్రంథలేఖకుల ప్రమాదము వల్ల గలిగిన దని తోచుచున్నది; కావున నిది యంతగ పరిగణింపదగినదిగాదు. మొదటి యరికేసరికి భద్రదేవుడను నొక తమ్ము డుండె నని పంపకవి తెల్పుచున్నాడు.11 వేములవాడశాసనమున 'భూమౌన్య స్నరసింహవర్మ నృపతిః భూమిం సమాపాదయత్' అను శ్లోకమున నరసింహు డొక్కడే పేర్కొనబడియున్నాడు. వాస్తవ

11. డాక్టరు ఫ్లీటుగారు ప్రమాదవశమున మొదటి యరికేసరికి నరసింహభద్రదేవు లను కుమారు డొక్కడే యుండెనని వ్రాసిరి. (Bom. Gaz. Vol. I, Part II. P 380) ఆ తప్పుని యోజించి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విక్రమార్జునవిజయమునుబట్టి దీనిని సవరించి 'అతనికి నరసింహ, భద్రదేవ నామాంకితులు ఇరువురు తనయులు కలరు' అని వ్రాసిరి (భారతి సం. 3 ప్రమాదమాలిక, ప్రా. పుట ३००). కాని వీరి సవరణ శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారికి నచ్చినది కాదు. వేములవాడ శిలాశాసనము నా ప్రకటించుచు వారు స్వరీతి నిట్లు వ్యాసించియున్నారు: "ఇందు ఫ్లీటు ఇచ్చిన విక్రమార్జునవిజయాదాహృత వంశకథాసారమునందే యీ విషయమున నైక్యమునుచున్నాను. శ్రీ శర్మగారును ఆ గ్రంథమునుండియే తా మిచ్చిన వంశావళిని ఎత్తి వ్రాసి రని ఊహింతును. కాని వా రిచ్చిన వంశక్రమమునందు కొన్ని ప్రమాదకరములైన తప్పులు దొరలినవి. అవి యెట్లు సంభవించెనో ఊహింపజాలకున్నాను. (భారతి సం. ౪, పుట ౧౫౬) ఈ విషయమును మఱింత విపులీకరించి యాంధ్రేతిహాసికసంశోధక

భార్య యనుటచేతను, సుభద్రయను శబ్దమునకు మంగళవతి యని సామాన్యముగు నర్థము జెప్పుటకు వీలగుటచేతను అరికేసరియొక్క పట్టమహిషి పేరు సుభద్ర యని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు.

ఇక పరభణితామ్రశాసనములోని వంశవృక్షమును పరిశీలింతము.

(ఆదిత్యభవమైన చాళుక్యవంశము)




పరభణితామ్రశాసనమునందు కొల్లిపాకతామ్రశాసనమున వర్ణింపబడిన ప్రథమయుద్ధమల్లుని పూర్వుల ప్రస్తావను గానరాదు. వేములవాడశిలాశాసనవిక్రమార్జునీయముల బోలి ఇందును వంశకర్త యుద్ధమల్లుడే; వంశానుక్రమణిక ఇతనితోడనే యారంభమగుచున్నది. కాని ఇందలి వంశవృక్ష మించుక పెద్దది. ఇది సహజమే; దీనియందు మఱి రెండుతరముల చాళుక్యరాజులు జేర్చబడిరి. వేములవాడశాసనమును వేయించిన ఇమ్మడియరికేసరియొక్క మనుమడగు ముమ్మడియరికేసరినాటి దనుటచే నిందిమ్మడి యరికేసరికి ఓమ్మటి రాజులను జేర్చుకొనుట యవసరమాయెను.

పరభణిశాసనోక్తవంశానుక్రమణిక విక్రమార్జునీయవేములవాడశాసనములందలి వంశానుక్రమణికకంటె భిన్నము గాకపోయినను నందు విశేషాంశములు రెండు గానవచ్చుచున్నవి:—

(౧) చాళుక్యుల వంశము:—వేములవాడ చాళుక్యులేమి, యన్యశాఖలవారేమి తమ వంశ పెద్దినో యింతకుపూర్వ మెచ్చటను జెప్పుకొనియుండలేదు. బాదామివంశమువా రగ్నిష్టోమ పౌండరీకవాజపేయాశ్వమేధాదియాగములను జేసియుండుటచేతను, వర్మాంతనామధారు లగుటచేతను, మఱియు క్రీ. శ. ౭వ శతాబ్ద పూర్వార్ధమున దక్షిణాపథమునకు వచ్చియుండిన చీనాయాత్రికుడగు హ్యూయన్‌త్సాంగు అప్పుడు దక్షిణాపథమున కధిపతియై యుండిన చాళుక్యుడు ఇమ్మడి పులకేశి క్షత్రియు డని చెప్పియుండుటచేతను వీరిని క్షత్రియు లని చెప్పవలసియున్నది. వీరితో చాళుక్యవంశము నందలి యన్యశాఖలవారిని గూడ క్షత్రియు లనుట యొప్పును; కాని క్షత్రియజాతికి సహజమైన సూర్య చంద్రకుటుంబములలో నే కుటుంబమునకు జెందిన వారో తెలియదు. క్రీ. శ. ౯౭౦ నుండి ౧౧౮౯ పర్యంతము రాజ్యమొనర్చిన పాశ్చాత్యచాళుక్య విక్రమాదిత్యుని సోరబతామ్రశాసనములో దనది 'హిమకరకరవిమలకుల'మని చెప్పుకొనియున్నాడు 13. దీని గాంచి కొంద ఱిది చాళుక్యులు చంద్రవంశజు లని సూచించుచున్న దని చెప్పిరి; కాని ఇది యంగీకరింపదగినది కాదు. 'హిమకరకరవిమలకుల'మని యున్నదేకాని 'హిమకరకుల' మని లేదు. కౌముదివలె స్వచ్ఛమైనకుల మని చెప్పవచ్చును; గాని చంద్రవంశ మనుట చెల్లదు. చాళుక్యుల వంశప్రస్తావన మొట్టమొదట నీ పరభణిశాసనముననే కానవచ్చుచున్నది. అర్వాచీనులగు పూర్వపాశ్చాత్యచాళుక్యరాజులెల్ల దాము చంద్రవంశజుల మని యేకగ్రీవముగ బల్కుచుండగా దీనికి విరుద్ధముగ నీ శాసన మొక్కటిమాత్రము చాళుక్యులది సూర్యవంశమని తెల్పుచున్నది.

13. E.. VIII. SB.

ప్రభు వారెవరను విషయమును పరిశీలించి చూతము. మన్న వది మనదారికి రాదు. బహుశః విక్రమాదిత్యుడే రాజ్య రక్షణసమర్థుడై యుండియుండవలెనని యనుకొందము. మూడవవాడగు ఆదిత్యవర్మ వేంగియందు రాజ్యముసేయు చుండెను. మొదటనే సత్యాశ్రయపులికేశియొక్క సహోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగివిషయమునకు ప్రభువై యుండుటచే నీ యాదిత్యవర్మ అతనికి లోబడి యాతనిమీద వేంగియందు సామంతుడై యుండవలెనని తోచుచున్నది. నాలవవాడగు జయసింహుడు లాట దేశము నేలుచుండెను. సహోదరులగు నీ నలువురు రాకుమారులలో విక్రమాదిత్యుడు బాదామియందధిరాజై యుండినది క్రీ. శ. ౬౫౫ నుండి ౬౮౦ వఱకు 17. చిన్నతమ్ముడైన లాటజయసింహుడు విక్రమాదిత్యుని కంటె యెంతయో చిన్నవాడై యుండవలయుననుటకు సంశయము లేదు. వానికి శీలాదిత్య, వినయాదిత్య-యుద్ధమల్లురను పుత్రులుద్భవించిరి. వారియందు రెండవ వాడగు వినయాదిత్య-యుద్ధమల్లుడొసగిన భూదత్తి శాసనమొకటి యీ లాటప్రాంతమున 'నవసారి' యను చోట దొరకినదనియు, నా శాసనకాలము శా. శ. ౬౫౩ (క్రీ.శ. ౭౩౧) అనియు శ్రీ భండార్కరుగారు సూచించియున్నారు...పరభణి తామ్రశాసన పంపవిక్ర మార్జున విజయములందు రెండిటియందును ఈ (వేములవాడ) కులమూలపురుషుని పేరు బట్టి యుద్ధమల్లుడనియే కానవచ్చుచున్నను వేములవాడశాసనమునందు వినయాదిత్య-యుద్ధమల్లుడని డాక్టరు భండార్కరు చెప్పినట్లే కానవచ్చుచున్నది. అంతమాత్రమే కాదు. పంప డనినట్లు 'క్షత్రియవంశశిఖామణి'యైన ఈ యుద్ధమల్లుని కొడుకగు మొదటి అరికేసరియొక్క శాసన మొకటి 'కొల్లిపాఱ' యను చోట దొరకినది. అందుకూడ 'విశ్వరాడ్వినయాదిత్యో యుద్ధమల్లో నృపాంకుశః' అని యున్నది. వినయాదిత్యుడను బిరుదుతోగూడ ఆ యుద్ధమల్లుడు పిలువబడుచుండెననుటకు సంశయము లేదు18." కావున లాటవినయాదిత్య - యుద్ధమల్లుడను కొల్లిపాఱ వినయాదిత్య-యుద్ధమల్లుడును నొక్కరే యని విశదమగుచున్నది.

"కాని, ఈ యభిప్రాయమును కుదిలించి కదలించునట్లుగ పదు యాక్షేప మొకటి తలచూపు చున్నది. వెనుక నూహించిన యభిప్రాయము ప్రకారము వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రి లాటజయసింహుడు గావలయును గదా. ఆ కొల్లిపాఱశాసనమునందు వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రి పేరు 'రాజాదిత్య పృథువిక్రమ' యనియే కానవచ్చుచున్నది. ఈ యాక్షేపము పైదానికంటె సబలముగనే కన్పించు చున్నది." కాని చక్కగ విచారించి చూచితిమేని ఇది యంతటి ప్రబలమైనది కాదని విదితము కాగలదు. కొల్లిపాఱశాసనమందలి వంశమునందు వినయాదిత్య యుద్ధమల్లుని తండ్రి పేరు జయసింహవర్మ యని కాన్పించకపోవుటమాత్రము నిజము. అయినను, వినయాదిత్య-యుద్ధమల్లునికి పూర్వులు అందఱి పేర్లును బిరుదులు గనే తోచుచున్నవే కాని యంకితనామములుగ భాసించుట లేదని యందఱు నొప్పుకొనకపోరు. అట్లగుటచే క్రింద నిరూపించిన శ్రీ భండార్కరుగారి గ్రంథము నందలి వంశచరిత్రలోను కొల్లిపాఱ శాసనములోను తెలియవచ్చు వంశావళిభాగముల నొండొంటి దిగువ నిచ్చి యా యా వారలు రాజు లొక్కరే యైయుండవచ్చునేమో పరీక్షింతము.

శ్రీ ఆర్. భండార్కరుగారిది—

౧. పులికేశి I
౨. కీర్తివర్మ I
౩. పులికేశి II
౪. జయసింహవర్మ
(లాట)

కొల్లిపాఱశాసనమున గన్పట్టునది—

౧. సత్యాశ్రయ-రణవిక్రమ
|
౨. పృథ్వీపతి
|
౩. మహారాజు
|
౪. రాజాదిత్య-పృథువిక్రమ

---

17. ఇది తప్పు. విక్రమాదిత్యుడు క్రీ.శ. ౬౫౫ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించెను. మఱియు నతడు ౨౫ యేండ్లు రాజ్యపాలనము గావించినట్లతని శాసనములవల్ల దెలియుచుండుటచే నతని యేలుబడి క్రీ.శ. ౬౮౦-౧ వఱకు సాగెననుట తెల్లము.

18. నాదోజపంప, పుటలు ౨౩-౨౫.

వీనియందు కొల్లిపాకశాసనవంశావళిలో గనుపడు మొదటి 'సత్యాశ్రయ-రణవిక్రమ'యను పేరును జూడుడు. శ్రీ ఆర్. భండార్కరుగారు చెప్పినట్లు పడు నా మొదటి పులికేశియే ఈ కులమునందు పరంపరను బట్టి వచ్చు 'సత్యాశ్రయ' బిరుదునకు మూలపురుషుడగు 'సత్యాశ్రయ-రణవిక్రము' డనుట తప్పు కాదు. ఆ సత్యాశ్రయుని తండ్రి 'రణరాగు' డని (యున్నది). అందువల్ల తండ్రిసంజ్ఞతో గూడ స్వబిరుదును జేర్చుకొనిన మొదటి పులికేశిని అట్లే 'సత్యాశ్రయ-రణవిక్రమ'యను అంకితముల్ల శాసనకారుడు నిరూపించియున్నా డని యూహించుటకవకాశము గనే యున్నది. పై కొల్లిపాకశాసనోక్తమైన (సత్యాశ్రయ-రణవిక్రమునికి) దరువాత (వచ్చు) ముగ్గురు పేర్లను బిరుదులుగ వ్యక్తమగుట ఈ యభిప్రాయమునకు ప్రబలమైన యాధారమగుచున్నది. అంతమాత్రమే కాదు. ముందటి వినయాదిత్య-యుద్ధమల్లునికి 'రామవిక్రమ, రాజాశ్రయ' మొదలగు బిరుదుల నిచ్చి, మొదటి యరికేసరిని 'త్రిభువనమల్ల-రాజత్రినేత్ర సాహసరామః ఇత్యేతై రక్షితాఖ్యైః ప్రఖ్యాతః' అని వర్ణించుటను జూడగా ఆ శాసనకారుడు రాజబిరుదులలోనే యెక్కుడు ప్రవీణత గలవాడని సిద్ధమగుచున్నది. ఆ కొల్లిపాకశాసనము సుమారు క్రీ.శ. ౯౫౦ సంవత్సర పరిసరమున దలచూపియుండవచ్చునని ఆంధ్రచారిత్రపత్రికాలేఖకులు సూచించియున్నారు. ఆ సూచనల్ల నవసారిశాసనపు వినయాదిత్య-యుద్ధమల్లుడును ఆ కొల్లిపాకశాసనపు వినయాదిత్య యుద్ధమల్లుడును అభిన్నులే అయియుండవలె ననుట మరింత వ్యర్థమగుచున్నది.[19]"

తిమ్మప్పయ్యగారి సిద్ధాంతము నంగీకరించుటకు వీలులేదు. కొల్లిపాకశాసనోక్తవంశావళి చరిత్రాత్మకమని వీరు గుజ్జువుపూచ నవలంబించిన మార్గము వింతయైనది. ఈ వంశావళియందు వినయాదిత్య-యుద్ధమల్లునికి పూర్వీకుల పేరులు బిరుదులని నిశ్చయించినారు. కాని యందలి పృథ్వీపతి రాజాదిత్య నామములు తిమ్మప్పయ్యగారు చెప్పినట్లు కేవల బిరుదులని యెంచుటకు వీలులేదు. పృథివీమహారాజు, పృథ్వీపతి, రాజాదిత్య యనునవి యంకితనామములుగ ప్రాచీన శాసనములయందు వాడబడియున్నవి. ఒకవేళ తిమ్మప్పయ్యగారనునట్లు బిరుదులే యని యొప్పుకొనినను కొల్లిపాకశాసనవంశావళిలోని రాజులలో నొక సత్యాశ్రయ-రణవిక్రమునిదప్ప తక్కినవారిని బాదామిశాఖవారని నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు. తిమ్మప్పయ్యగారి సమన్వయము నొప్పుకొనినచో బాదామిశాఖలోని మొదటి కీర్తివర్మకును, రెండవ పులికేశికిని, నతని పుత్రుడగు (లాట) జయసింహునకును వరుసగ పృథివీపతి, మహారాజ, రాజాదిత్య - పృథ్వీవిక్రము లను బిరుదులుండినవని చెప్పవలసివచ్చును. బాదామి చాళుక్యరాజుల శాసనములును, వారిని పేర్కొను వారి వంశజుల శాసనములును పెక్కు ప్రకటితమైయున్నవి. ఎచ్చటను మొదటి కీర్తివర్మకు పృథ్వీపతి యను నామాంతరముగాని, బిరుదుగాని యున్నట్లు సాక్ష్యము లేదు. ఇక 'మహారా' జనునది యొక బిరుదని చెప్పుటకంటె రాజ్యపదమును సూచించు నామవాచక మనుట యొప్పును. ఇది భూపాలురకెల్లరకు సామాన్యమే. కావున కొల్లిపాకవంశావళిలోని 'మహారాజు' బాదామిశాఖలోని ఇమ్మడి పులికేశియే యని నిర్ధారించుట కెట్లు వీలగును? అట్లు చేసిన నిర్ధారణ సమంజస మని యొప్పుకొనుట యెట్లు? బాదామిశాఖయందే కాక చాళుక్యకులమంతటియందును ఇమ్మడి పులికేశి గడు సుప్రసిద్ధుడు. పూర్వచాళుక్యులేమి, కళ్యాణిచాళుక్యులేమి, యన్యులేమి తమ వంశచరిత్రయందితని ప్రస్తావన వచ్చినప్పుడు గడు గొప్పగ చెప్పుకొనియున్నారు. కొల్లిపాకశాసనకారు డితనినే పేర్కొన నుద్దేశించినచో నతని నామమునేనియు వదలిపెట్టక సర్వసామాన్యమైన మహారాజశబ్దమును బ్రయోగించుట చిత్రము గదా. ఇక (లాట) జయసింహుని విషయము విచారింతము. ఇతనివేమి, ఇతని సంతతివారివేమి శాసనములు కొన్ని ప్రకటితములై యున్నవి. ఇందు మొదట పేర్కొనదగినది త్రిభువనాశ్రయజయాశ్రయబిరుదాంకితుడగు నాగవర్ధన మహారాజుయొక్క నిర్పణ తామ్రపటికలు. ఇతడు లాటజయసింహుని కుమారుడు. ఇందితడు తన తండ్రి

19. నాడోజపంప, పుటలు ౨౫–౨౬.

యుద్ధమల్లునే యగును. కావున వినయాదిత్యయుద్ధమల్ల నామము వేములవాడచాళుక్యుల మూలపురుషునికిని, లాటజయసింహుని పుత్రుడగు మంగళరసరాజునకును సామాన్య మగునంతమాత్రమున వారికి వ్యక్త్యైక్యము గల్పించుట సమంజసము గాదు.

మఱియొక విషయము : వేములవాడ చాళుక్య వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దతృతీయపాదమున వెలసె నని దృఢముగ బల్కవచ్చును. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦-౭౯౧ ల మధ్యమున రాజ్యముచేసిన రాష్ట్రకూటచక్రవర్తియగు నిరుపమధ్రువకలివల్లభునికి సమకాలీనుడు. ఇతని తండ్రియగు వినయాదిత్యయుద్ధమల్లుడు నిరుపమధ్రువుని తండ్రియగు మొదటి కృష్ణ అకాలవర్షుని కాలముననో, తత్పూర్వము క్రీ. శ. ౭౫౪ నుండి ౭౫౬ వఱకు రాజ్యముచేసిన దంతిదుర్గుని కాలముననో, లేక యిరువురి కాలముననో వెలసియుండవలయును. ధారాశ్రయుని కుమారుడగు వినయాదిత్యయుద్ధమల్లాపరనామధేయుడు క్రీ. శ. ౭౩౧-౨ లో రాజ్యము సేయుచుండినందువల్లను, దరువాత నిరువదియైదేండ్ల వెనుక రాష్ట్రకూటులక్రింద సామంతుడై యుండిన వేములవాడ వినయాదిత్యయుద్ధమల్లుడును సమకాలీనులై యుండి రనుట యసంగతము గాదు. సమకాలీను లగుటచే చాళుక్యవంశజులగు వా రిరువురికి నైక్యము గల్పించుటయందు వైపరీత్య మేమియు లేదు; కాని దీని కొక యాక్షేపము గలదు. వినయాదిత్యయుద్ధమల్ల బిరుదాంకితుడగు జయాశ్రయ మంగళరసరాజురాజ్యము క్రీ.శ. ౭౩౧-౨ తరువాత నచిరకాలమునకే ముగిసిపోయినది. పిమ్మట నతని తమ్ముడు పులకేశివల్లభుడు రాజ్యమునకు వచ్చెను. ఈ విషయము క్రీ.శ. ౭౩౯ నాటి ఇతని నౌసారిపట్టికల వల్ల దెల్లమగుచున్నది. ఇందు వరుసగ దన పూర్వీకులగు మొదటి కీర్తివర్మ, రెండవ పులకేశి, మొదటి విక్రమాదిత్యుడు, ధరాశ్రయజయసింహుడు, జయాశ్రయమంగళరసరాజు మున్నగువారిని పేర్కొని తరువాత దన్ను జెప్పుకొనియున్నాడు. ఇతడు బహుశూరుడు. సైంధవ, కచ్చెల్ల, సౌరాష్ట్ర, చావోటక, మౌర్య, గుర్జరాజులను జయించిన తాజికుల నోడించి దేశమును గాపాడెను. వల్లభనరేంద్రుడు, అనగా నప్పుడు సామ్రాజ్యాధిపతియై యుండిన బాదామిచాళుక్యఇమ్మడివిక్రమాదిత్యు డితని దేశసేవకు మెచ్చి దక్షిణాపథసాధక, చలుక్యకులాలంకార, పృథివీవల్లభ, అనివర్తకనివర్తయితృ యను బిరుదుల నొసగెను. మఱియు నితడు రాజ్యాధిపతులను బోలి తన యాజ్ఞను విషయపతులు మున్నగువారికి విదితపఱచియున్నాడు మఱియు, నీ శాసనమున జయాశ్రయమంగళరసును జెప్పి యటుపిమ్మట 'తస్య పాదానుధ్యాత'యగు పులకేశి పేర్కొనబడెనని స్ఫురణ యందున్నది. కావున క్రీ. శ. ౭౩౯ వ సంవత్సరమునకు పూర్వ మితని యన్నయగు జయాశ్రయమంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడు గతించగా నితడు తదనంతరము లాటరాజ్యమున కధిపతి యాయె ననుట తెల్లము. కావున క్రీ. శ. ౭౫౪ నకు తరువాత రాష్ట్రకూటుల క్రింద సామంతుడై యుండె ననుట యుక్తముగాదు. ఈ కారణములచేత దిమ్మప్పయ్యగారు వాదించునట్లు లాట జయసింహవర్మపుత్రుడగు జయాశ్రయ మంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడును, వేములవాడచాళుక్యుల మూలపురుషుడగు వినయాదిత్యయుద్ధమల్లుడును నేకపురుషులు గారు. వారు భిన్నవ్యక్తు లనుట యొప్పును.

ఈ పై దీర్ఘచర్చవలన తేలిన సారాంశ మేమనగా: కొల్లిపఱశాసనమందలి వంశావళిని గుర్తించుటకు సాధ్యము గాదు. ఇతరచాళుక్యశాఖలకు దీనితో సంబంధము గానరాదు. ఒకవేళ నిది కల్పనయేని గావచ్చును. బాదామిశాఖతోడను, లాటశాఖతోడను దీనికి సంబంధములను గలుప దలపెట్టి చేసిన సిద్ధాంతములు లభ్యమైన శాసనసాక్ష్యములకు విరుద్ధము లగుటచే నిలువజాలవు. కావున లభ్యమైన సాక్ష్యమును నిష్పక్షపాతముగ విమర్శించి చూచిన వేములవాడశాఖవారి కన్యశాఖలవారితో గల సంబంధము తెలియ దని చెప్ప వలసియున్నది.

(సశేషము)

# లేములవాడ చాళుక్యులు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

## ౪. వినయాదిత్యయుద్ధమల్లుడు

వినయాదిత్య-యుద్ధమల్లుని శాసనము లెవ్వియు నింతవఱకు లభ్యపడలేదు. కాని ఇతని సంతతి వారి శాసనములవల్లను, పంపకవి విక్రమార్జునవిజయ పీఠికవల్లను నితని చరిత్ర కొంతవఱకు దెలియవచ్చుచున్నది. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరియని చెప్పబడు కొల్లిపఱ తామ్రశాసనమున నితడు విశ్వరాటనియు, రామవిక్రమనృపాంకుశానివిగుచాంకితుండనియు, వరాహలాంఛనముచే వశీకృతభూచక్రుడనియు, సాగరవేలాపరివేష్టితసకలనగరామంగలుండనియు, తురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ కేరళప్రభృతిరాజలోకముచే నర్చలు గొనెననియు జెప్పియున్నది. ఈ శాసనము కృత్రిమమని ప్రబలమైన సంశయము గలదు. కాని శాసనము కృత్రిమమైనను నందుదహరింపబడిన యంశములు కృత్రిమములు కాక చరిత్రాత్మకములే కావచ్చునను శాసనవిమర్శకుల మతము ననుసరించి దీనిలోవిచారార్హ ముగాదని త్రోసిపుచ్చక పరామర్శించి యందెంత సత్యము గలదో కనుగొనవలసియున్నది.

వినయాదిత్యయుద్ధమల్లుడు దాక్షిణాత్యుడగు చాళుక్యుడు. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౦ వఱకు దక్కను సామ్రాజ్యము నేలిన రాష్ట్రకూట చక్రవర్తి. ధ్రువనిరుపమదేవున కితడు సామంతుడును, సమకాలీనుడును నగుటచే నితడు క్రీ. శ. ౭వ శతాబ్దతృతీయపాదమున నభ్యుదయమంది యుండవచ్చునని పూర్వప్రకరణమున నిశ్చయించియున్నాడను. ఈ కాలమున కొల్లిపఱశాసనమున వర్ణింపబడినంతటి గొప్ప చాళుక్యనరపాలు డెవ్వడేనియు నుండెనో విచారింతము. అప్పటి రాష్ట్రకూటశాసనములను బరిశీలించి చూడగా రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు గతించిన వెనుక ప్రబలుడైన చాళుక్యరాజొకడు సామ్రాజ్యము నాక్రమించుకొని కొంతకాలము రాజ్యమొనర్చినట్లు దెలియవచ్చుచున్నది.

మొదటి కృష్ణరాజుపుత్రుడగు ముమ్మడి గోవిందరాజు దన రాధన్‌పుర, వణిదిండోరి తామ్రపట్టికలయందీ విషయము నిట్లు ప్రస్తావించియున్నాడు:

పక్షచ్ఛేదభయాశ్రితాఖిలమహా
భూభృత్కులభ్రాజితా
దుర్లంఘ్యాదపరైరనేకవిమల
భ్రాజిష్ణురత్నాన్వితాత్
యశ్చాలుక్యబలాదనూనవిభవ
వ్రాతాశ్రయో వారిధే
ర్లక్ష్మీం మన్దరవత్సలీల మచిరా
దాకృష్టవాన్ వల్లభః 1.

మొదటి యమోఘవర్ష నృపతుంగుని సంజాన్ తామ్రపట్టికయందును నీ విషయము జెప్పబడియున్నది.

స్వయంవరీభూతరణాఙ్గణే తత
స్సనిర్వ్యపేక్షం శుభతుంగవల్లభః,
చకర్ష చాలుక్యకులశ్రియం బలా
ద్విలోలపాలిధ్వజమాలధారిణీం 2.

1. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬.

2. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬ త.

యగుటచేత, దంతిదుర్గుడు చాళుక్యులతోడి పోరునకే స్మృతినొందెనని తోచుచున్నది. 6

పై చర్చవలన వేములవాడ చాళుక్యవంశస్థాపకుడైన వినయాదిత్యయుద్ధమల్లుని కాలమున రాష్ట్రకూటుల యధికారమును గూలద్రోయుసంతటి శక్తిసామర్థ్యములు గల రాహప్ప యను చాళుక్యవీరుడొకడుండెనని తెలుచున్నది. ఈ రాహప్పయే కొల్లిపఱశాసనములోని వినయాదిత్యయుద్ధమల్లుడు కాగూడదా యను శంక యొకటి కలుగవచ్చును. రాహప్ప యనునది యతని వాస్తవమైన పేరును, వినయాదిత్య యుద్ధమల్లనామము లతని బిరుదులును గా నచ్చును. కొల్లిపఱశాసనమునందు వర్ణింపబడిన వినయాదిత్య యుద్ధమల్లుని విజయము లన్నియు రాహప్పకును జెల్లును; కాని యీ సందర్భమున పరామర్శించదగిన యంశ మొకటి కలదు: ఈ రాహప్ప బాదామి చాళుక్యరాజులలో గడపటివాడైన ద్వితీయకీర్తివర్మయో, లేక యువరాజ ఇమ్మడి గోవిందవల్లభునిచే బరాభూతుడైన వేంగీశ్వరుడగు విష్ణువర్ధనుడో కావలయునను వాదము ద్వితీయకీర్తివర్మ రాష్ట్రకూటులను జయించి మరల రాజ్యమును సంపాదించెననిగాని, యతనికి రాహప్పయని మారుపేరుండెననిగాని తలచుట కెట్టి యాధారము లేదు. రాష్ట్రకూటప్రథమ కృష్ణభూపాలుని కుమారుడును, యువరాజును నగు ఇమ్మడిగోవిందరాజు యొక్క వేంగీవిష్ణువర్ధనుని జయించుట నిశ్చయమే. ఇతడు వేంగీమండలమును జయించినపిమ్మట కృష్ణామూసీసంగమమున విజయస్కంధావారమునుండి యిచ్చిన అలాసు తామ్రశాసనమున "కోశదండాత్మభూమిసమర్పణే నానతే వేంగీశే"యని చెప్పుకొనియున్నాడు. 7 ఇట్లు కోశదండాత్మభూములను యువరాజగోవిందరాజునకు సమర్పించిన వేంగీశుడు చాళుక్యుడు. కృష్ణరాజుచే నోటువడి పాలిధ్వజావళిని, రాజాధిరాజపరమేశ్వరపదమును గోలుపోయిన రాహప్ప ఇతడే యని రాష్ట్రకూటచరిత్రకారులు డాక్టరు ఆల్టెకారనుచున్నారు.7 a ఇది యొప్పదగని విషయము. వేంగీచాళుక్యులు తమ శాసనములయందు తాము మహారాజాధిరాజపరమేశ్వరభట్టారకుల మని చెప్పుకొనినను పాలిధ్వజము వీరి కుండెననుట కే యాధారమును లేదు. అది యాద్యమున ఉత్తరాపథచక్రవర్తుల సామ్రాజ్యచిహ్నము. క్రీ. శ. ౭ వ శతాబ్ద తృతీయపాదమున బాదామియందు చాళుక్యప్రథమ విక్రమాదిత్యుడు రాజ్యము సేయుచుండగా నతని కుమారుడైన వినయాదిత్యుడును, మనుమడైన విజయాదిత్యుడును నుత్తరదేశములపై దండెత్తిపోయి సకలోత్తరాపథపతి నొక్కని జయించి యాతని సార్వభౌమపదచిహ్నములైన గంగాయమునలను పాలిధ్వజములను గొని స్వదేశమునకు మగిడి వచ్చిరి. 8 అది మొదలివి బాదామి శాఖవారి సార్వభౌమచిహ్నము లైనవి. బాదామి చాళుక్యులకును, వారిని దొలగద్రోసి వారి సార్వభౌమపదము నొడిచికొనిన రాష్ట్రకూటులకు దప్ప దక్షిణదేశము చేరిన యే వంశప్రభువులకును నీ పాలిధ్వజాది

---

6. రాష్ట్రకూటవంశపు గుజరాతుశాఖకు జెందిన కర్కసువర్ణవర్షుని బరోడా తామ్రపట్టికలందిలి (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౫౮)—

ధర్మాత్మత్రాతస్య కృష్ణస్య జిష్ణో
ర్నుత స్సుధర్మాత్మఖిలు కృష్ణరాజః,
యో వంశ్య మున్మూల్య విమూఢ భూజం
రాజ్యం స్వయం గోత్రహితాయ చక్రే.

అను శ్లోకము నాధారముగాగొని కొంద రీ బరోడా శాసనమున వంశ్యుడే రాహప్పయని వాదించుచున్నారు. (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౬౭.) కాని వీరి వాదమంగీకార్యము గాదు. ఏలనగా: లభ్యమైన శాసనసాక్ష్యమునుబట్టి నూటిగా రాహప్ప రాష్ట్రకూటుడని చెప్పుట కెట్టి యాధారమును లేదు; చాళుక్యుడనుటయే యొక్కువ సమంజసమని తోచుచున్నది. కావున వంశ్యునికి రాహప్పతో నైక్యము గల్పించుట సరికాదు. వారిద్దరు భిన్న పురుషులని తలచుటయే యుక్తము.

7. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౧౧.

7-a. రాష్ట్రకూటులు-వారికాలము, పుట ౭౩.

8. ఎపి. ఇండి. సం. ౫, పుట ౨౦౦.

చిహ్నములు లేవు. 9 కావున యువరాజ గోవిందరాజును కోడి తన సర్వస్వము నిచ్చి యతనికి నతుడైన వేంగీశుడు రాహప్ప కాజాలడు. రాజాధిరాజపరమేశ్వరుడును, పాలికేతనుడును నగుటచే రాహప్ప బాదామి చాళుక్యవంశజు డని నిశ్చయముగ జెప్పవచ్చును.

ఇక నీ రాహప్పయు, వేములవాడచాళుక్యుల వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడును నేకపురుషులగుదురేమో విచారింతము. కొల్లిపఱశాసనములోని వంశావళి మిక్కిలియు సంశయగ్రస్తమగుటచేత దాని నాధారపఱచుకొని వినయాదిత్యయుద్ధమల్లునికి బాదామి చాళుక్యవంశముతో సంబంధము గల్పించుట యుక్తము గాదు. వాదమునకై యతడు బాదామిశాఖకు జెందినవాడని యొప్పుకొనినను నతనికిగాని, యతని సంతతి వారికిగాని పాలిధ్వజ ముండె ననుట కే యాధారమును లేదు. కావున రాహప్పయు, వినయాదిత్యయుద్ధమల్లుడును సమకాలికులే యైనను వారు భిన్నపురుషు లని చెప్పవలసియున్నది.

ఇంతవఱకు కొల్లిపఱతామ్రపట్టికలయందు వర్ణింపబడిన వినయాదిత్యయుద్ధమల్లుని విజయాదులు సత్యాత్మకము లను దృష్టితో బరికించితిమి. కాని వీని యాథార్థ్యమును ఋజువుసేయగల సాధనాంతరము లిప్పటికిని కవ్వియు గానరాలేదు. ఇతని సంతతివారి శాసనములలో నితని పరాక్రమాతిశయాదులు ప్రశంసింపబడియున్నను, నితడు విశ్వరాటనిగాని, సాగరవేలాపరివేష్టితసకల ధరామండలాధిపతి యనిగాని, తురుష్కయవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ పాండ్య కేరళ ప్రభృతి ససంభ్రమ సమర్చితపాదపీఠు డని గాని చెప్పియుండలేదు. వానిలోని విషయమును బట్టి చూడగా నిత డొక చిన్నరాజని తోచుచున్నది. ఇతని సంతతివారి శాసనములలో నెల్ల ప్రాచీనతమమైన వేములవాడ శిలాశాసనమున నీ వినయాదిత్యయుద్ధమల్లుడు అనన్యశాసనముగ సపాదలక్షదేశమును బాలించె ననియు, బోదనపురమున నూనెచే నిండిన కొలకునం దేనుగులను దానమాడించె ననియు, జిత్రకూట మను దుర్గమును సాధించె ననియు జెప్పియున్నది. పంపకవి తన విక్రమార్జునవిజయపీఠికయందు చిత్రకూటమనుమాట యెత్తక తక్కిన యంశములను రెండింటిని పేర్కొనియున్నాడు. పరభణి తామ్రశాసనమునందుగూడ చిత్రకూటప్రస్తావన లేదు. విక్రమార్జునవిజయము వేములవాడ శిలాశాసనమునకు సమకాలికకావ్య మైనను చిత్రకూటవిజయమును బ్రస్తావించకపోవుటకు గారణము తెలియదు; కాని యీ మూటిని చరిత్రాంశము లని మనము విశ్వసింపవచ్చును.

మొట్టమొదట పరామర్శించదగినది సపాదలక్ష విషయము. శాసనములందలి వరుసను బట్టి చూడగా నిదియే వినయాదిత్యయుద్ధమల్లుని ప్రథమశూరకృత్యమని తోచుచున్నది. సపాదలక్షదేశ మెచట నుండెనో వేములవాడ పరభణిశాసనములవల్లగాని, పంపని విక్రమార్జునవిజయమువల్లగాని తెలియవచ్చుటలేదు. పాల్కురికి సోముని పండితారాధ్యచరిత్రయందు సపాదలక్ష ప్రస్తావము గలదు :

లక్షింపగ సపాదలక్షనేపాళ
మీక్షింపగ సపాదలక్షకేదార
మీక్షింపగ సపాదలక్షతీర్కార్తి
లక్షింపగ సపాదలక్షకాశ్మీర
మీక్షింపగ సపాదలక్షకన్నోజ
మీక్షింపగ సపాదలక్షగొంకణము
లక్షింపగ సపాదలక్షకళింగ. 10

ఈ ద్విపదలయందు 'సపాదలక్ష' దేశవైశాల్యమును సూచించు పదముగ బ్రయోగింపబడియున్నది.

---

9. పూర్వచాళుక్యవంశజుడైన గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనమున (భారతి. సం ౧, సం ౧, పుట ౧౧౨) "ద్వారి ప్రతిష్ఠాపితగంగాయమునాచంద్రాదిత్యపాలికేతనసమధిగతపఞ్చమహాశబ్ద శ్రవణవిత్రాసితచతురాశాచక్రో నరాహలాఞ్ఛనవీర మకరధ్వజః" అని యున్నది. ఇందు పేర్కొనబడిన గంగాయమునాపాలిధ్వజాదు లతనికి గులక్రమాగతములు గావు. రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణరాజును యుద్ధమున నోడించి యతనికడ గొన్నది.

10. పండితారాధ్యచరిత్రము, పర్వతప్రకరణము. (ఆం. గ్ర. ౨ భా.) పుట ౭౧౫.

మఱియు 'సపాదలక్ష' గ్రామములు గల దేశ మొక్కటి కా దనియు, నట్టివి సెపాళశేదారాదులు పెక్కు గల వనియు దెల్లముగుచున్నది. కాని వేములవాడ పరభణి శాసనములందును, పంపని విక్రమార్జునవిజయమందును చేర్కొనబడిన 'సపాదలక్ష' శీలదేశాంతర్గతగ్రామ సంఖ్యను దెల్పు పదము గాదనియు, నది ప్రత్యేక మొకానొక దేశమున కంకితనామ మనియు దోచు చున్నది. ఈ దేశమును గూర్చిన ప్రశంస కాదాచిత్క ముగ సంస్కృతవాఙ్మయమునందును, నుత్తరహిందూ స్థానమందలి మధ్యయుగశాసనములయందును గానవచ్చు చున్నది. ఆధునికగ్రంథములయందును సపాదలక్షదేశ నిర్దేశమును గురించిన చర్చ లచటనచట గలవు. 'అశ్మన్త దేశ్మవిహాయ యాహి' యను సోమదేవసూరియశస్తిలక చంపూవాక్యమునకు వ్యాఖ్యాత 'అశ్మన్తకసపాదలక్ష పర్వతవాసిన్' అని యర్థము వ్రాసియున్నాడు. 11 మఱియు క్రీ. శ. ౧౧౫౦ నాటి చాళుక్యవంశజుడగు గూర్జరకుమారపాలుని చితోడ్ గఢశాసనమున 12,—

మహీభృన్నికురంజేషు శాకంభరీశః
ప్రియాపుత్రలోకేన శాకంభరేశః,
అపి ప్రాప్తశత్రు గృహా త్కంప్రభూతః
స్థితా యస్య మత్తేభవాజప్రభూతః.
సపాదలక్ష మామర్ద్య నమ్రీకృతభయానకః,
స్వయ మాయా న్మహీనాథో గ్రామే శాలిపురాభిధే.
సన్ని వేశ్యశిబిరం పృథు తత్ర
త్రాసితాసహనభూపతిచక్రం,
చిత్రకూటగిరిపుష్కలశోభాం
ద్రష్టు మారనృపతిః కుతుకేన

భగవాన్‌లాల్ ఇంద్రాజిగారు, కాంగ్రా మొదలు నైనితాలువఱకు వ్యాపించియుండు సివాలిక్ పర్వతమునకు సంస్కృతమున 'సపాదలక్షపర్వత'మను పే రనియు, సపాదలక్షాధిపతు లని పేరువడసిన శాకం భరీ చాహమానప్రభువుల కా పే రాద్యమున సపాద లక్షపర్వతప్రాంత నివాసులైయుండిన కారణమున వచ్చె ననియు, దరువాత వారు వలసవచ్చి తూర్పురాజపుత్ర స్థానమున నుండు శాకంభరీప్రాంతమున నివాసము లేర్ప అచుకొని యచట నెలకొనుటచే నా ప్రాంతమునకు సపాదలక్షదేశ మని పేరు వచ్చె ననియు వ్రాసి యున్నారు. 13 వీరి యభిప్రాయమునే నందోలాల్ డేగారు తమ భూగోళకోశ మను గ్రంథమున నిట్లు సంగ్రహముగ ననువదించియున్నారు: "సపాదలక్షకు సవాలక్ అపభ్రంశరూపము. సవాలక్‌నకు సివాలిక్ అపభ్రంశరూపము. సపాదలక్ష, శాకంభరీ తూర్పు రాజస్థానములోని యిప్పటి సంభర్." 14 సపాదలక్ష (సివాలిక్) పర్వతప్రాంతవాసులగు చాహమానరాజపుత్రు లచటికి వచ్చి నెలకొనుటచే శాకంభరీపరిసరప్రదేశము లకు సపాదలక్షదేశ మని పేరు వచ్చె నను భగవాన్ లాల్ గారి సిద్ధాంత మెంతవఱకు సత్యమో తెలియదు. కాని శాకంభరీప్రభువులు సపాదలక్షీయు లనియు, వారి యేలుబడిక్రింది దేశము సపాదలక్షదేశ మని పిలువబడుచుండె ననియు దృఢముగ జెప్పవచ్చును.

తూర్పురాజస్థానమందలి యిప్పటి సంభార్ ప్రాంతదేశమే మధ్యయుగమునందలి సపాదలక్ష యని నిశ్చయ మైనది గదా. ఇక దాక్షిణాత్యుడగు వినయా దిత్యయుద్ధమల్లు డా దేశముపై నాధిపత్య మెట్లు సంపాదించగలిగెనో విచారించవలసియున్నది. ఈ విష యమును నిర్ధారించి చెప్పుటకు దగిన యాధారము లెవ్వియు గానరావు. వినయాదిత్య - యుద్ధమల్లుడు సామాన్యుడైన చిన్న రాజని ఇంతవఱకుండే వివరించి యున్నాడను. ఇట్టివాడు జిగీషామనీషచే స్వయము దండెత్తిపోయి నిజబాహుబలపరాక్రమముచే ననన్య శాసితమైన సపాదలక్షదేశము నాక్రమించుకొనె ననుట యంతగ నమ్మదగిన విషయము గాదు. తనకంటె బలవ త్తరుడైన యధిపతి నెవ్వనినేనియు గూడి దండువోయి యతని పక్షమున నిత డా దేశమును జయించి శాసించె నని తలచుట యుక్తము. ఈ వినయాదిత్యయుద్ధమల్లుని కుమారుడగు మొదటి యరికేసరి కాలమునుండియు గడపటివాడగు మూడవ

11. కావ్యమాల ౭౦, పుట ౧౫౭.

12. ఎపి. ఇండి. సంపు. ౨., పుట ౪౨౧ ఈ.

13. బాంబేగజట్టీరు, సం ౧. భా. ౧. పుట ౧౫౭, పు. ౧౫౫ అథోజ్ఞాపిక.

14. భూగోళకోశము, పుట ౧౭౫.

యారికేసరి వలనను నితని సంతతివా రందఱును రాష్ట్రకూటచక్రవర్తులకు సామంతులై వారి నాశ్రయించి యుండిరి. వారివలెనే ఇతడును రాష్ట్రకూటసామంతుడై యుండి యుండవచ్చు నని తలచుటయం దసహజమేమియు లేదు. ఈ యూహా యసమంజసము గాదేని, ఇతని కధిపుడై యుత్తరదేశముపై దండెత్తిపోయిన రాష్ట్రకూటచక్రవర్తి యెవ్వడో కనుగొనవలసి యున్నది. వినయాదిత్యయుద్ధమల్లునికి సమకాలికు లని యెన్నదగినరాష్ట్రకూటచక్రవర్తు లిరువురు గలరు. రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు మొదటివాడు. ఇతనిపిమ్మట సామ్రాజ్యపీఠము నెక్కిన యితని పినతండ్రియైన ప్రథమకృష్ణరాజు రెండవవాడు. శాసనములలోను కృష్ణరాజుత్తరాపథముపై దండెత్తిపోయిన ట్లెచ్చటను జెప్పియుండలేదు; కావున నితని గూర్చి వినయాదిత్యయుద్ధమల్లుడు సపాదలక్షను జయించె నని తలచుటకు వీలులేదు. దంతిదుర్గు డీతుడేని యోధుడు; పేరందిన దళనాయకుడు. ఇతడు యౌవనమునందే స్వర్గమును జొందినను, జీవదశయం దుండిన యల్పకాలములోను చాళుక్యుల యధికారమును గూలద్రోసి వారికడనుండి దక్షిణాపథసామ్రాజ్యమును లాగికొనెను; అంతట దృప్తివందక దిగ్విజయార్థమై యుత్తరహిందూస్థానముపై దండెత్తి పోయి, పెక్కుదేశములను జయించెను. ఇతని విజయములు యెల్లోరా లోని దశావతారగుహాయం దితడు జెక్కించిన శిలాశాసనమున నిట్లు వర్ణింపబడియున్నవి :

"దక్షేనైవ జిగాయ వల్లభబలం
యస్సన్ధుభూపాధిపం
కాఞ్చీశం సకలింగకోసలపతిం
శ్రీశైలదేశేశ్వరం,
శేషా న్మాలవ లాట టంక నృపతీ
నన్యాంశ్చ నీత్వా వశం
యః శ్రీవల్లభతా మవాప చరణం
న్యస్య ద్విషాం మస్తకే. 15

దంతిదుర్గుడు జయించినట్లు పై శ్లోకమున జెప్పబడిన రాజులలో నీ సందర్భమున ముఖ్యముగ గమనించవలసినవారు మువ్వురు. మొదటివాడు సంధుభూపాలుడు. 'సంధు' అను పేరు గల దేశ మన్యత్ర యెచటను జెప్పబడియుండలేదు. పొరబాటుచే 'సింధు' అను మాట కిది బదులుగ జెక్కబడిన దని రాష్ట్రకూట చరిత్రకారులగు డాక్టరు అల్టేకరు గారభిప్రాయపడి యున్నారు. 16 సింధుదేశమును తాజికు లీకాలమున నాక్రమించుకొని యుండిరి. అప్పుడప్పుడు పశ్చిమ సముద్రతీరదేశములపై దండెత్తి చ్చి దేవాలయములను నాశము గావించి గ్రామములను, పట్టణములను దోచుకొని పోవువారు. కావున దంతిదుర్గుడు వారిపై దండెత్తి పోయి జయించి యుండవచ్చును. రెండవవాడు టంకనృపతి. టంకదేశ మెచ్చట నుండెనో యెవ్వరును నిర్ణయింపలేరు; ఇది ప్రస్తుత రాజపుత్రస్థానములోని 'టాంకు' కావచ్చును. మూడవవాడు మాలవాధిపతి. ఆకాలమున మాలవదేశము గూర్జర ప్రతీహారుల యధికారమున్ క్రింద నుండెను. గూర్జరులు హిమాలయపర్వతములోని పశ్చిమోత్తరకనుమలగుండ హిందూదేశమున జొచ్చి యచట స్థిరనివాసముల నేర్పరచుకొనిన యన్యదేశీయు లని కొందఱి యభిప్రాయము. పంజాబున కొంతకాల ముండి తరువాత రాజపుత్రస్థానముగుండ పశ్చిమసముద్ర తీరమునందలి సురాష్ట్రము నాక్రమించుకొనిరి. మాళవదేశము నెప్పుడు గూర్జరప్రతీహారులు జయించి స్వాధీనము జేసికొనిరో తెలియదు. క్రీ. శ. ౭౫౪ లోనో, మరుసటి సంవత్సరముననో మృతినందిన దంతిదుర్గుడా దేశముపై దండెత్తిపోవునప్పటికే గూర్జరు లుజ్జయిని యందు రాజ్యము సల్పుచుండినందుచే వా రాప్రాంతమున నంతకుముందే స్వాధీనపఱచుకొనిరని తెల్లమగుచున్నది. ప్రతీహారులలో నాల్గవ రాజైన ప్రథమనాగభటుడే మాళవమును సాధించి యచట గూర్జరుల యధికారమును మొదట నెలకొల్పె నని తోచుచున్నది. ఇతడు పరాక్రమశాలి. సింధుదేశము నాక్రమించుకొని యచటి

---

15. ఆర్కి. స. ఆ. వెస్టరన్ ఇండియా. సం. ౫, పుట ౮౭.

16. రాష్ట్రకూటులు-వారికాలము. పుట ౪౫, అధోజ్ఞాపిక. ౧౩.

నుండి మాటిమాటికిని పశ్చిమసముద్రతీరదేశములపై దండు వెడలుచు మిక్కిలియు నలజడిపెట్టుచుండిన అరబ్బులను యుద్ధమున నోడించి వారి సంరంభమును జాలవఱకు దగ్గించెను. 17 ఇతని స్థిరరాజధాని రాజపుత్రస్థానములోని మేడన్తపురమైనను 18 దక్షిణమున నితని యధికారము భృగుకచ్ఛదేశమువఱకు వ్యాపించియుండెను. ఈ నాగభటుని, లేక నాగావలోకుని ప్రవర్ధమానవిజయరాజ్యమునందు విక్రమకాలము ౮౧౩ నకు సరియైన క్రీ. శ. ౭౫౬ న వ్రాయించిన హాన్సొత్ శాసనమున భృగుకచ్ఛాధిపుడును, చాహమానవంశజుడైన భర్తృవృద్ధుడు దా నీతనికి సామంతుడ నని చెప్పుకొని యున్నాడు.19 దంతిదుర్గుడు మాళవదేశముపై నెలయెత్తిపోయెనో తెలియదు. సామ్రాజ్యకాంక్షయే దీనికి ప్రధానకారణమై యుండవచ్చును. కాని దశావతార దేవాలయశాసనమునుబట్టి చూడగా క్రమముగా తుడైన రాజేశ్వరోదన్వాశ్రయింపగా నాలని కాపాడుటకు దంతిదుర్గుడీ దండయాత్రను సాగించె ననితోచుచున్నది.

దేవం......నపరపరికరం
భీమసేనానుయాతం
ప్రహ్వా ఖ్యాతేన్ద్రవృందైః పరిగత మభితో
యుగ్రసేనో ఒతారిః
వ్యాప ద్యుద్ధష్టి హేకం ప్రసభపరకరి
ధ్వంసనసంస్కారదక్షః
దిగ్ధత్వ దుష్టనాగం జయినమివ పరం
శ్రీమహారాజశర్వః.
దత్తా యే నోజ్జయిన్యా మపి నృపతిగృహ
దానమాశ్చర్యభూతం
న్యాయ్యం సంచిన్త్య దీప్తన్యుతి...హుకనకం
రత్నముక్తాదిపుంజం,

మాణిక్యాకీర్ణ మన్యం దివస మవిరత
తృప్తదీనార్థిసార్థం
కర్తుం క్రీడా మపూర్వా మపరనృపతిభిః
స్వప్నకాలే ప్యనాయ్యామ్.

* * *

య స్యాఖణ్డితవిక్రమస్య కటకే
నాక్రమ్య తీరక్షితిం
సాధ్వేఽస్మిన్ కృతగూర్జరేన్ద్రరుచితే
రమ్యే...తై స్తస్థుషః,
స్నాత్వా...తాగ్రరాగసురభి
ప్రోత్కంపపద్మాకరం
శారిత్యుప...పుష్కరేష్వపి......
...నాశ్చిరం. 20

పై శాసనశ్లోకములు మూడునుసంపూర్ణములు గాక గ్రంథపాతమువలన యఱకొఱలుగ నుండుటచేత వాని యర్థము చక్కగ బోధపడుటలేదు; కాని వాని యందలి భావము స్పష్టముగనే తెలియవచ్చుచున్నది; మొదటి శ్లోకమునందు ఉగ్రమైన సేన గలవాడును, శతారియు, ప్రసభపరకరిధ్వంసనసంస్కారదక్షుడును, దిగ్ధత్వుడును, దుష్టనాగుడును నైన శ్రీమహారాజశర్వుడు (దంతిదుర్గుడు) అభయులును, భక్తియుక్తులును నైన రాజేన్ద్రబృందముచే జుట్టబడినవానిని, శ్రేష్ఠమైన పరివారజనముతో గూడినవానిని, భీమసైన్యానుయాతుని, దేవుని, మఱియొక యుధిష్ఠిరుని (జయుని) బోలి శాపదనుండి యుద్ధరించుటకు యేమో చేసె నని (క్రియాపదముమాసిపోయినది) చెప్పియున్నది. రెండవదానియందు ఈ రాజు (దంతిదుర్గుడు) ఉజ్జయిని యందేనో యాశ్చర్యభూతమైన మహాదానము నొకదాని జేసెనని యున్నది. ఈ దానవిషయమైన ప్రస్తావన మొదటి యమోఘవర్షుని సంజన్ తామ్రపట్టికలయందును గలదు.

హిరణ్యగర్భం రాజన్యై
రుజ్జయిన్యాం య దాసితమ్
ప్రతీహారీకృతం యేన
గూర్జరేశాదిరాజకమ్. 21

---

17. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౧౦౭, ౧౧౧-౧౧.

18. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౯౬.

19. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౧౯౭.

20. ఆ. స. జ. ఇం. సం. ౫, పుట ౮౭.

21. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౨౪౭.

దీనివలన దంతిదుర్గుడు ఉజ్జయినియందు 'హిరణ్యగర్భ' దానమును జేసె ననియు, నప్పు డతనిచే గూర్జరేశాదిరాజులు ప్రతీహారులుగ జేయబడి రనియు దెలియుచున్నది. మఱియు మూడవశ్లోకమునందు ఇతడు స్వసైన్యముచే (సముద్ర)తీరక్షితి నాక్రమించుకొని యచట గూర్జరేంద్రునిచే నిర్మితమైన సౌధమునం దొక కాలని యందు స్నాన మాడె నని చెప్పుచున్నది.

మొదటిశ్లోకమున జేర్కొనబడిన దేవు డెవ్వడో. యతనికి వచ్చిన యాపద యెట్టిదో, దంతిదుర్గు డాతని నుద్ధరించుట కేల పూనుకొనెనో నిర్ధారించుటకు సాధ్యము గాదు. ఈ శ్లోకము నాధారపఱచుకొనియే కాబోలు డాక్టరు ఆల్టెకారుగారు దమ రాష్ట్రకూటుల చరిత్రయం దిట్లు వ్రాసియున్నారు: "(చాళుక్య) కీర్తివర్మను మొదటి తడవ యోడించినపిమ్మట కొంత కాలమునకు, దంతిదుర్గు డుజ్జయినీపాలకుడైన గూర్జర ప్రతీహారవంశజుడైన దేవరాజునకు సహాయ మొనర్చుటకో, లేక యాతని (దేవరాజు) ప్రతిస్పర్ధి శాఖాంతరదాయాదియగు భిన్మాలు ప్రభువగు సిలూకనిచే నతఁ డందిన పరాజయము వల్ల లాభమునంద దలచియో యుజ్జయిని మీద దండు వెట్టిన ట్లున్నది". 22 దంతిదుర్గుని మాళవదండయాత్రయపు డచట నొక దేవుడు లేక దేవరాజనువతడు రాజ్యము సేయుచుండెనది నిశ్చయము. కాని యతడు గూర్జరప్రతీహారవంశజు డనుట సంశయాస్పదము. గూర్జర ప్రతిహారవంశమున శాఖాంతరమునకు జెందిన భిన్మాలుప్రభువగు సిలూకనిచే నోడింపబడిన దేవరాజితడే యనుట యొప్పదగని విషయము. ఆల్టెకారుచే జేర్కొనబడిన దేవరాజు కనోజిగూర్జర ప్రతీహారవంశమునకు మూలపురుషుడైన ప్రథమనాగభటుని యన్నకు రెండవ కుమారుడు. క్రీ.శ. ౭౭౩-౮ ప్రాంతమున నవంతి (ఉజ్జయిని) యందు రాజ్యము సేయుచుండిన వత్సరాజుయొక్క తండ్రి. 23 ప్రథమనాగభటుని విజయరాజ్యము విక్రమకాలము ౮౧౩ అనగా క్రీ.శ. ౭౫౬ నం దింకను ప్రవర్ధమానముగ సాగుచుండెను. కావున దేవరాజుయొక్క ప్రభుత్వము క్రీ.శ. ౭౫౬-౭౮౩ల మధ్య నెప్పుడో ప్రారంభమై యుండవలయును. ఇక దంతిదుర్గుడు క్రీ.శ. ౭౫౬ లోనో, యా మరుసటిసంవత్సరమునందో మృతి నందెననుట నిశ్చయము. అతని మరణానంతరము అతని పినతండ్రియైన మొదటి యకాలవర్షకృష్ణరాజు సామ్రాజ్యపీఠము నధిష్ఠించె నని క్రీ.శ. ౭౫౮ నాటి యతని భారత ఇతిహాససంశోధకమండలిపట్టికలయందు చెప్పియుండుటచే నతి డంతకుపూర్వమే కాలగతి నందె ననుటకు సంశయము లేదు. 24 కావున దంతిదుర్గుని మాళవదండయాత్రయు, గూర్జరవిజయమును క్రీ.శ. ౭౫౬ వరకు పూర్వమే నడచియుండవలయును. కావున నాగభటుని యన్నకొడుకగు దేవరాజే దశావతారదేవాలయశాసనమందలి 'దేవుడు' కావలెను; కాని ప్రథమనాగభటుడు రాజ్యము సేయుచుండగనే యతని యన్నకొడుకగు దేవరాజు మాళవదేశముపై నేలుచుండి పినతండ్రిపై దిరుగుబాటు చేసియుండవచ్చును; అతనిచే నిర్జితుడై దేవరాజు దంతిదుర్గుని సహాయ మపేక్షించగా దంతిదుర్గుడు మాళవదేశముపై నెత్తిపోయి యుండవచ్చును అను వాద మొకటి బయలుదెడలవచ్చును. ఇం దసంగత మేమియు లేదు. కాని, ఇది కేవలము ఊహయే. దీని నిరూపించుటకు దగిన యాధారము లేదు. అట్టి యాధారములభించువఱకును నీ దేవరాజును, యెల్లూర దశావతారదేవాలయశిలాశాసనమున జేర్కొనబడిన 'దేవు'డును భిన్నపురుషు లని తలచుట యుక్తము.

రెండవ శ్లోకమువలన దంతిదుర్గునికి విజయము చేకూడె ననియు, మాళవరాజధానియగు నుజ్జయిని యతనికి హస్తగత మాయె ననియు స్పష్టమగుచున్నది. మొదటి యమోఘవర్షుని సంజాన్ పట్టికల సాక్ష్య మంగీకార్యమేని, దంతిదుర్గుని ప్రతిపక్షులలో ప్రముఖుడు గూర్జరేశ్వరు డనియు, నతని నిర్జించుటవల్లనే మాళవదేశము రాష్ట్రకూటులకు వశమాయె ననియు దోచుచున్నది. మూడవ శ్లోకమువల్ల దంతిదుర్గుడు మాళవ

---

22. రాష్ట్రకూటులు-వారికాలము, పుటలు, ౩౯-౪౦.

23. ఎపి. ఇండి. సం. ౬, పు. ౧౯౫ త.

24. భారత ఇతిహాస సంశోధకమండలి. సం. ౮, పుట ౧౬౫.

మును సాధించిన పిమ్మట దండుతో గదలిపోయి తీరక్షితిని స్వాధీనపఱచుకొనె నని తెలియుచున్నది. తీరక్షితి యన సముద్రతీరదేశము. ఈ తీరదేశము గూర్జరేశుని యాధిపత్యముక్రింద నుండెను. "సాధేఽస్మిన్ కృతగూర్జరేన్ద్రరచితే" యను శాసనవాక్యము రుజువుసేయుచున్నది. మఱియు సౌరాష్ట్రమందలి భృగుకచ్ఛ మప్పుడు గూర్జరప్రతీహారప్రథమనాగభటుని యధికారముక్రింద నుండుటచేత దానికి పైభాగమందలి తీరదేశమును,మాళవదేశమును గూడ నతని యేలుబడిక్రిందనే యుండె నను తలంపు గలుగుచున్నది.

పై చర్చవలన తేలిన సారాంశ మిది: వేములవాడ చాళుక్యులకు మూలపురుషుడైన వినయాదిత్య-యుద్ధమల్లునకు సమకాలికులును,ప్రాయశః అధిపతులును ననదగిన రాష్ట్రకూట చక్రవర్తులగు దంతిదుర్గ ప్రథమకృష్ణులలో రెండవవాడగు ప్రథమకృష్ణు డుత్తరదేశముపై దండెత్తిపోలేదు. కావున వినయాదిత్య యుద్ధమల్లు డితనితో గలసి పోయి సపాదలక్ష దేశమును జయించి యేలినా డనుట కవకాశము లేదు. మొదటివాడైన దంతిదుర్గుడు దేవుడు, లేక దేవరా జనువానిని గాపాడుటకై గూర్జరప్రతీహారవంశజుడైన ప్రథమనాగభటుని యుద్ధమున నోడించి యతని యాధిపత్యముక్రింద నుండిన మాళవమును,సౌరాష్ట్రాదితీరదేశము నాక్రమించుకొనియెను. ఈ నాగభటుని స్థిరరాజధాని రాజపుత్రస్థానములోని మేడన్తకపురమని ప్రతీహారబావుకుని జోధపురశాసనమువల్ల దెలియుచున్నది. 25 ఈ మేడన్తకపురము అజమీరునకు గించిత్పశ్చిమోత్తరమున నిరువదియైదు మైళ్ళ దూరముననను, శాకంభరికి (సాంభరునకు) బశ్చిమమున నేబదిమైళ్ళ దూరమునను నుండు ఇప్పటి మెర్తాయే యని పరిశోధకులు గుర్తించియున్నారు.26 అజమీరు, శాకంభరులు రెండును ప్రాచీనసపాదలక్షకు జెందిన స్థలములు. తత్సమీపస్థమైన మేడన్తకపురము గూడ నా సపాదలక్షలోనిదే కావలయును. మేడన్తకపురము నాగభటుని రాజధాని యగుటచేత తత్పరిసరమున నుండిన సపాదలక్ష దేశ మతని యేలుబడియందే యుండె నని తోచుచున్నది. క్రీ. శ. ౯౭౩ నాటి తన హర్ష శాసనమున శాకంభరీపాలకుడైన చాహమానవంశజుడగు రెండవ విగ్రహరాజు తన కారు తరములకు ముందరివాడగు మొదటి గూవకుడు నాగావలోకుని సభయందు వీరప్రతిష్ఠను పొందె నని చెప్పియున్నాడు.

> ఆద్యః శ్రీగూవకాఖ్యః ప్రథితనరపతి
> శ్చాహమానాన్వయోఽభూత్
> శ్రీమన్నాగావలోకప్రవరనృపసభా
> లబ్ధవీరప్రతిష్ఠః. 27

దీనివలన నీ ప్రథమగూవకుడు నాగావలోకుని సామంతుడని తేలుచున్నది. ఇందు పేర్కొనబడిన నాగావలోకుడు క్రీ. శ. ౮౦౦ మొదలు ౮౩౩ వఱకును రాజ్యము చేసిన గూర్జర ప్రతీహారరెండవనాగభటు డని శాసనవిమర్శకు లభిప్రాయపడియున్నారు. మొదటి నాగభటుడైనను కావచ్చును. ఇది యెట్లున్నను సపాదలక్షపాలకులైన శాకంభరీచాహమానప్రభువులు గూర్జర ప్రతీహారచక్రవర్తులకు సామంతులై యుండిరని నిశ్చయమగుచున్నది.శాసనాద్యాధార మెద్దియు లేకపోయినను, నాగభటుని యధికారముక్రింద నుండిన మాళవసౌరాష్ట్రాది దేశములను దంతిదుర్గుడుజయించియుండుటచేతను, సపాదలక్షయొక్క దక్షిణపు సరిహద్దునం దుండిన టంకదేశాధీశుని బరాజితుని గావించి యుండుటచేతను, సపాదలక్షాంతర్గతమైన నాగభటుని స్థిరరాజధాని యైన మేడన్తకపురముపై దండెత్తిపోయియుండినను నుండవచ్చును. కావున, వేములవాడచాళుక్యుల శాసనములలోను, పంపని విక్రమార్జునవిజయమునందును జెప్పినట్లు వినయాదిత్యయుద్ధమల్లు డనన్యశాస్యమైన సపాదలక్ష దేశమును పాలించినది దంతిదుర్గుడా దేశమును జయించిన పిమ్మట నై యుండవలయును. వీరుడును, సమర్థుడును నగుటచే నితని దంతిదుర్గు డా దేశమునకు పాలకునిగ నియమించి యుండు నని తోచుచున్నది.

వినయాదిత్యయుద్ధమల్లుడు సపాదలక్షదేశమున నెంతకాల ముండెనో తెలియదు; అతడొనర్చిన రెండవ

---

25. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౮౭.

26. డిటో

27. ఎపి. ఇండి. సం. ౨, పుటలు ౧౨౧, ౧౨౬; ఇండి. ఆంటి. ౧౯౧౧, పుటలు ౨౩౯-౪౦.

